# గానభాస్కరము

అత్యుత్తమమైన యొక సంగీత గ్రంథము

**9466**


సంగీత భరతశాస్త్ర ప్రవీణులగు

విద్వాన్ కందాడ వ. శ్రీనివాసయ్యంగారిచే

రచియింపఁబడినది



మదరాసు :

ఎమ్. ఆది అండు కంపెని

చంద్రా ముద్రాక్షరశాలయందు

ముద్రితము

1934





వెల రూ. 7—0—0

# PREFACE

The various works of the author on Hindu music have been before the public for some years. These works are intended to meet the wants of students and teachers of music and as such are practical treatises based on the current system The present work has however a higher aim. To rescue the fast dying science of Hindu music and present it to the music-loving public is a task the recognition of which might be slow and its appreciation much slower. But that is no reason why the science of Hindu music, perfected long before any other country had a scientific system, should be allowed to go the way of so many other ancient sciences in India Moreover, there is a general awakening in this field of intellectual and æisthetic activity. The last Musical Conference held the year before last at Baroda at which the author was present, revealed for the first time, the growing interest in the science of Hindu music and the existence of savants who have made a life study of it The author of this work has been labouring in the field for some years and some of the results of his researches are embodied in the book.

A few features of this work, noteworthy in the opinion of the author, might here be stated in brief to help the reader. The portion dealing with sruthi, the conclusions arrived at are in perfect agreement with those already worked out in that monumental work of Rao Sahib Abraham Pandithar of Tanjore, "Karunamrutha Sagaram" and have been independently verified by him In the portion dealing with "Grama Bhedha" for ascertaining the "Vikruthi Swaras" the author has presented definite conclusions. On this subject, ancient works like Rathnakara, and others that have followed such as Raga Vibodha, Sangitha Parijata, Sangitha Darpana, etc., are misleading and the author has reasons to believe that the commentators like Kallinatha, Simha Bhupala and others, have gone astray. The portions dealing with the criticism of these authors is also commended to the reader Attention might also be drawn to the discussion on Vivadi Swaras and the author's demonstration of the wrong conclusion arrived at by Venkatamakhi in his Chathurthandi Prakasika and Subbarama Dikshitar in his Sangitha Sampradaya Pradarsini in the matter of forty ragas

in the Melakartha as being tainted by Vivadi Dosha. Certain popular works both Telugu and Tamil have perpetuated many wrong ideas extant and introduced innovations due to the defective understanding of the science Those also are dealt with in the interest of purer science.

The author trusts that this work, which contains the first instalment of his researches into the existing ancient works, will meet with an encouraging reception from the public.

Another feature of the work is the collection of rare kirthanams by eminent masters such as Tyagaraja Iyah, Veena Kuppaiah. Patnam Subramania Iyer, Sadasiva Row, Sama Sastrulu, Subbaraya Sastrulu, Muthusami Dikshitar, Balaswami Dikshitar, Ponniah, Chinnasami Dikshitar, Ramaswami Dikshitar, Virabhadra Iyah, Krishnaswami Iyah, Kumara Yettappa Maha Rajah, Sesha Iyangar, Pallavi Gopala Iyah, Duraisami Iyah, Mathrubhoota Iyah, Kuppusami Iyah, Skeshathragna and such others into which inaccuracies and mistakes have crept in These have been corrected, and rendered into notation to help the practical songsters

THE AUTHOR.

# ఉపోద్ఘాతము

సంగీత విద్యాభ్యాసకులకును ఉపాధ్యాయులకును మిగుల నుపయోగమైన యనేక సంగీతగ్రంథముల నిదివఱకే యచ్చొత్తించినాఁడను. వానిలో సంగీతాభ్యాసకుల కత్యావశ్యకమైయుండు సంగీతలక్షణ సంగ్రహము, ప్రథమాభ్యాస పద్ధతులు, అలంకార, వర్ణ, గీత, కీర్తనాదులును స్వరతాళములతో వ్రాయఁబడియున్నవి. కొన్ని సంవత్సరములుగ గీర్వాణ భాషయందు గల సంగీతరత్నాకరాద్యనేక గ్రంథములను, ఆంగ్లేయ భాషయందు గల సయిన్సును సంబంధించిన యనేక గ్రంథములను ద్రావిడ భాషయందు గల యతిపురాతన గ్రంథములను, ప్రకృతము ఆంధ్రద్రావిడ భాషలో ప్రచురమైయుండు అనేక సంగీత గ్రంథములను పరిశీలించి "గానభాస్కర" మను నీ గ్రంథమును వ్రాసినాఁడను.

ఇందు సంగీతసంబంధమైన సకల రహస్యములను వెల్లడి జేసియున్నాఁడను. పూర్వ గ్రంథములోని పొరపాటు లివియనియును, ప్రకృతము మన దేశములో ప్రచురమైయుండు సంగీత గ్రంథములలోని గుణదోషము లివి యనియును దెలుపుటకై పక్షపాతములేక యచ్చటచ్చట నా మా గ్రంథములోని గుణములను కొనియాడియు, దోషములను ఖండించియు నీ గ్రంథములో వ్రాసినాఁడను. మఱియు నిదివఱకు ప్రచురముకాని 125 కీర్తనలను స్వరతాళములతో వ్రాసి యీగ్రంథములో నచ్చొత్తించి యున్నాను. పల్లవి పాడువారి కనుకూలమైన కొన్ని ముఖ్యాంశములును, పల్లవి పాడవలసిన క్రమమును ఇందు వ్రాయఁబడియున్నవి. అభినయించువారి కుపయోగమగునట్లు కొన్ని పదములును వానికి భావములును కొలిపింపులును వ్రాసియున్నాను. ఈ గ్రంథము సంగీతపోషకు లందఱికి నొక మహోపకారియై యుండునని నమ్ముచున్నాఁడను.

ఈ గ్రంథరచనమును జేయునపుడు నా కుపకరించిన నా జ్యేష్ఠ భ్రాతయగు, శ్రీమాన్-కె. వరదాచార్యస్వామికిన్ని, నా కనిష్ఠ భ్రాతయగు వీణ-కృష్ణమాచారికిన్ని. మా శిష్యుఁడైన పిడీలు-సుందరరాజ అయ్యంగారికిన్ని నే కృతజ్ఞుఁడనై యున్నాఁడను.

ఇట్లు,
గ్రంథకర్త.

# గా న భా స్క ర ము.

## వి ష య సూ చి క.



## స్వరములు.

## రాగ విమర్శనములు.



## తాళము.

## త్యాగరాజస్వామి కీర్తనలు స్వరముల సహా

## వీణ - కుప్పయ్యగారి కృతులు.



## పట్నం - సుబ్రహ్మణ్యయ్యగారి కీర్తనలు.

## అనుబంధము A



## అనుబంధము B.



## అనుబంధము C



**విషయసూచిక సమాప్తము.**

# గానభాస్కరము

శ్లో॥ బ్రహ్మగ్రన్థిజమారుతానుగతినా చిత్తేన హృత్పంకజే।
సూరీణా మనురంజకః శ్రుతిపదం యోయం స్వయం రాజతే।
యస్మాద్గ్రామవిభాగవర్ణరచనాలంకారజాతిక్రమో।
వందే నాదతనుంతముద్ధురజగద్గీతం ముదే శంకరం॥ (సం. రత్నాకరః.)

ఈ శ్లోకపూర్వముగ సర్వప్రధానంబైన నాదబ్రహ్మమునకు వందన మొనరించుచున్నాడు.

శ్లోకప్రారంభములో 'బ్రహ్మగ్రంథి' యను ప్రయోగమువల్ల మంగళవాచ్యమును సూచింపుచున్నాడు. బ్రహ్మగ్రంథి యనగా యోగాధారము లాఱింటిలో మొదటిదైన మూలాధార స్థానమునందు గల చతుర్దళ దళ చక్రమునకు పేరు. ఈ చక్రమునందుండు సూక్ష్మాగ్ని చేత ప్రేరేపింపబడిన ప్రాణవాయు నాభి హృదయ కంఠమూలముగా బయలు వెడలుటచే నాదము బుట్టుటకు కారణం బగుచున్నది యనియు, ఈ నాదమే వేదముల కాధారస్థానమనియు, ఈ నాదముచేతనే పద వాక్య కావ్య నాటకాలంకార శాస్త్రము లున్ను, స్వరవర్ణ గ్రామాద్యలంకారాదులును బుట్టుచున్నదనియును, లోకమునకు ఆది కారణము నాదమనియును, అట్టి నాదబ్రహ్మమును, యీ గ్రంథము అవిఘ్నముగా సంపూర్తి చేయుటకై, ప్రార్థించుచున్నా నని భావము.

## సంగీత ప్రశంస.

శ్లో॥ "సామవేదాదిదం గీతం సంజగ్రాహ పితామహః।" (సం. రత్నా.)

తా. సంగీతము, సామవేదమునుండి బ్రహ్మచే గ్రహింపబడి, లోకోపకారమై, భరతాదులచేతను తరువాత ఇతర వాగ్గేయ కారకులచేతను, వెల్లడి చేయబడిన శాస్త్రము. గనుక ఈ సంగీతవిద్య మహనీయులచే గొనియాడబడి యున్నది.

శ్లో॥ గీతిగానేన యోగస్స్యాత్ యోగాదేవ శివైక్యతా।
గీతజ్ఞో యది యోగేన సయాతి పరమేశ్వరం॥ (సూతసంహిత.)

తా. భక్తితో చేయబడు గానము యోగమగుచున్నది. ఆ యోగముచేత పురుషుడు పరమాత్మైకత్వమును బొందుచున్నాడు.

శ్లో॥ కావ్యాలాపాశ్చ యేకేచి ద్గీతాని సకలానిచ ।
శబ్దమూర్తి ధరస్యై తే విష్ణో రంశా మహాత్మనః ॥ (శ్రీ విష్ణుపురాణము.)

తా. శబ్దస్వరూపమైన కావ్యములును, సంగీతమును భగవంతుని స్వరూపాంశమని భావము.

శ్లో॥ నాహం వసామి వైకుంఠే న యోగి హృదయే రవౌ ।
మద్భక్తా యత్ర గాయంతే తత్ర తిష్ఠామి నారద ॥

తా. ఓయి నారదా! నేను వైకుంఠమునందు వసింపలేను. యోగులయొక్క హృదయములోను వసింపలేను, సూర్యమండలములోను వసింపలేను. నా భక్తులు ఎచ్చోట గానముఁ జేయుచున్నారో అచ్చట నేనున్నాను. "ఈ భగవద్వాక్యమువలన గానము సర్వోత్కృష్టమైన యోగమని వెల్లడియగును."

శ్లో॥ సర్వేషా మేవ పుణ్యానా మస్తి సంఖ్యా యశస్విని
మమాగ్రే గీయతే యేన తస్య సంఖ్యా నవిద్యతే ॥
నఘృతే తాదృశీ ప్రీతి ర్నక్షీరే నచ గుగ్గులౌ
యాదృశీ చైవ గాంధర్వే మమ ప్రీతి ర్వరాననే ॥

కించ॥ గీతజ్ఞో యది గీతేన నాప్నోతి పరమం పదమ్
రుద్రస్యానుచరో భూత్వా తేనైవ సహ మోదతే ॥
త్రివర్గ ఫలదా స్సర్వే దాన యజ్ఞ జపాదయః
ఏకం సంగీత విజ్ఞానం చతుర్వర్గ ఫల ప్రదమ్ ॥
హరిశాది స్తుతౌ ధర్మో ధన కామా నృపాదితః
నిష్కామ స్తదనుష్ఠానా న్మోక్ష మాప్నో త్యసంశయమ్॥ (శివసర్వస్వం.)

తా. యశోవంతురాలవగు ఓ పార్వతీ! ఎల్ల పుణ్యములకును లెక్కకలదు; నా యెదుటఁ గానము నెవడు చేయునో వాని పుణ్యములకు సంఖ్యలేదు. నాకు సంగీతమునం దెట్టి ప్రీతియో అట్టిప్రీతి నేయి, పాలు, గుగ్గులు మొదలగువాటిలోను లేదు. మఱియును గానవిశారదుడు సంగీతముచే పరమపదమును పొందఁడేని రుద్రునకు అనుచరుఁడై అతని తోడనే సంతోషించుచున్నాఁడు. దానయజ్ఞ జపాదులన్నియు త్రివర్గఫలము నిచ్చునవి. సంగీతజ్ఞాన మొకటిచేత నే చతుర్విధపురుషార్థములును లభ్యమగును. హరిహరాదుల స్తుతిచే ధర్మమును, రాజులు మొదలగు వారిచే ధనకామములును, నిష్కాముఁడగుచు సంగీతానుష్ఠానము చేయుటచే మోక్షమును, నిస్సంశయముగ మానవుడు పొందుచున్నాడు.

## ప్రసిద్ధవాగ్గేయకారకులు

శ్లో॥ సదాశివ శ్శివా బ్రహ్మా భరతః కశ్యపోమునిః
మతంగో యాష్టికో దుర్గా శక్తిః శార్దూల కోహలౌ

విశాఖిలో దన్తిలశ్చ కంబలోఽశ్వతర స్తథా
వాయు ర్విశ్వావసూ రంభాఽర్జున నారద తుంబరాః ।
ఆంజనేయో మాతృగుప్తో రావణో నందికేశ్వరః
స్వాతిర్గుణో బిందురాజః క్షేత్రరాజశ్చ రాహలః ।
రుద్రటో నా న్యభూపాలో భోజభూవల్లభ స్తథా
పరమర్ది చ సోమేశో జగదేకమహీపతిః ।
వ్యాఖ్యాతారో భారతీయే లోల్లటోద్భట శంకుకాః
భట్టాభినవగుప్తశ్చ శ్రీమత్కీర్తి ధరోఽపరః ।
అన్యేచ బహవః పూర్వే యే సంగీతవిశారదాః
అగాధబోధమన్థేన తేషాం మతపయోనిధిం
నిర్మథ్య శ్రీశార్ఙ్గదేవః సారోద్ధార మిమం వ్యధాత్ ॥ (సం.రత్నాకరః.)

పై శ్లోకములవలన సంగీతరత్నాకర కర్తయయిన శార్ఙ్గదేవుఁడు సదాశివాది పూర్వాచార్యప్రముఖుల మతములను, "అన్యేచ బహవఃపూర్వే యేసంగీతవిశారదాః" అనునట్లు ఇతరమైన యనేక పూర్వాచార్యుల యగాధ పయోనిధివంటి మతములనుఁ బరిష్కరించి సంగీతసారమును గ్రహించి లోకములో వెల్లడిచేయుచున్నానని తెలుపుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మవిష్ణు మహేశాన్యః సంగీతోత్స్య సుఖస్పృహాః ।
ఏహికా ముష్మికో త్యక్త్వా దేవర్షి ర్నారద స్సదా ॥
బ్రహ్మ నందోఽపి వీణాయాం వాదనే నియతో భవత్ ।
దైత్య సంహారిణీ దుర్గా సంగీతేభిరతా సదా ॥
మతంగకశ్యపావాస్తాం సంగీతాభి రుచీమునీ ।
కర్తా సంగీత శాస్త్రస్య హనూమాంశ్చ మహాకపిః ॥
శార్దూల కోహలావేతౌ సంగీత గ్రంథకారిణౌ ।
కంబలాశ్వతరౌ వాయుర్హాహా హూహూశ్చ రావణః ।
రంభా బాణాసుతా చోషా ఫాల్గునః ఫణినాంపతిః ।
ఇత్యేతేఽన్యోపి సంగీత శాస్త్రవ్యాఖ్యాన కారిణః ॥ (సం. పారిజాతః.)

సంగీత రత్నాకరమునందు జెప్పియుండు పూర్వాచార్యులసంఖ్యకన్న అధికముగా హాహా, హూహూ మొదలగు కొన్నివారలను పారిజాతకారులు జెప్పియున్నారు. ఈ విషయము పై శ్లోకములయందు గనిపించియున్నది.

## సంగీత శబ్దార్థము.

శ్లో॥ గీతం వాద్యం తథా నృత్యం త్రయం సంగీత ముచ్యతే।(సం.రత్నాకరః.)

తా. గీతము, వాద్యము, నృత్యము అను నీమూటి చేరిక సంగీత మనంబడును. మఱియు రాగము స్వరము తాళము అను నీమూటి చేరికయు సంగీత మనంబడును.

గీతవాదిత్ర నృత్యానాం త్రయం సంగీతముచ్యతే ।
గానస్యాత్ర ప్రధానత్వాత్ తత్సంగీతమితీరితం ॥ (సం. పారిజాతః.)

గీతం వాద్యం నర్తనంచ త్రయం సంగీతముచ్యతే ॥ (సం. దర్పణము.)

అన్యశ్చః—

గీతం వాద్యంచ నృత్యంచ త్రయం సంగీతముచ్యతే ।
గీతవాద్యోభయం యత్ర సంగీత మితి కేచన ॥
రాగస్వరశ్చ తాళశ్చ త్రిభి స్సంగీతముచ్యతే ॥

N. B. గీతము వాద్యము అను నీ రెంటిచేరిక సంగీతమని కొందఱి మతము. అయితే ఇది ప్రసిద్ధవాగ్గేయ కారకుల మతము కాదు.

## సంగీత విభాగము.

మార్గ దేశీతి తద్ద్వేధా తత్ర మార్గ స్స ఉచ్యతే ।
నృత్యం వాద్యానుగం ప్రోక్తం వాద్యం గీతానువృత్తిచ
అతో గీతం ప్రధానత్వా దత్రాదావభిధీయతే ॥ (సం. రత్నాకరః.)

తా. నృత్యము వాద్యము ననుసరించినది. వాద్యము గీతము ననుసరించినది. అందుచేత మూటిలో ప్రధానమైన గీతము ప్రథమమున చెప్పబడుచున్నది.

మార్గ దేశి విభాగేన సంగీతం ద్వివిధం మతం । (సం. దర్పణము.)
మార్గ దేశీయ భేదేన ద్వేధా సంగీతముచ్యతే । (సం. పారిజాతము.)
ఆద్యం గీతం ద్వేధా మార్గ దేశీ । (రాగవిబోధము.)

సంగీతము మార్గమనియు దేశ్యమనియు నిరుతెఱంగులుగా విభగింపఁబడియున్నది. అెటులు,

## మార్గసంగీతము.

శ్లో॥ యోమార్గితో విరించాద్యైః ప్రయుక్తో భరతాదిభిః ।
దేవస్య పురత శ్శంభో ర్నియతాభ్యుదయ ప్రదః॥ (సం. రత్నాకరము.)

అర్యః

గీతం ద్వేధా మార్గో దేశీ మార్గః సయోవిరించాద్యైః ।
అన్విష్టో భరతాద్యైః శంభోరగ్రే ప్రయుక్తోఽర్చ్యైః ॥ (రాగవిబోధః.)
వేదాన్మూధాఖ్య సంగీతం భరతాయూ బ్రవీత్స్వయం ।
బ్రహ్మణోఽధీత్య భరతః సంగీతంమార్గసంజితత్ ॥ (సం. పారిజాతము.)

మహిణేన యదన్విష్టం ప్రయుక్తం భరతేనచ ।
మహాదేవస్య పురతః స్తన్మార్గాఖ్యం విముక్తదం ॥ (సం. దర్పణము.)
అనాది సంప్రదాయం యద్గంధర్వై స్సంప్రయుజ్యతే ।
నియతం శ్రేయసోహేతు స్తద్గాంధర్వం ప్రచక్షతే॥ (స్వరమేళకళానిధిః)

మొత్త తాత్పర్యము. బ్రహ్మ సంకల్పముచే గలిగినదియును, పరమశివుని సముఖమున భరతమునిచే చెప్పబడినదియును, మోక్షప్రదంబైనదియునైన సంగీతము మార్గసంగీత మనంబడును. "ఈ మార్గ సంగీతము భూలోకమునందు లేదనియును, దేవతలవల్లను, భరతాదులవల్లను దేవలోకమునందుమాత్ర మభ్యసింపబడి వెలయుచున్నదనియును భావము."

## దేశ్య సంగీతము.

శ్లో॥ దేశేదేశేజనానాం యద్రుచ్యా హృదయ రంజకం
గానంచ వాదనం నృత్యం తద్దేశీ త్యభిధీయతే ॥ (సం. రత్నాకరము.)
ఆర్య. దేశేదేశే రుచ్యా యజ్జన హృద్రంజనంతు సాదేశీ ।
సతు లోకరుచి విరలితః ప్రయో లక్ష్మ్యత్ర దేశీతత్ ॥ (రాగవిబోధః.)
యస్తువాగ్గేయకారేణ రచితం లక్షణాన్వితం ।
దేశీరాగాదిభిః ప్రోక్తం తద్గానం జనరంజనం ॥ (స్వరమేళ కళానిధిః.)
తత్ర దేశస్థయారీత్యా యత్స్యాల్లోకానురంజనం ।
దేశేదేశేతు సంగీతం తద్దేశీ త్యభిధీయతే ॥ (సం. దర్పణము.)

మొ. తా. ఆయాదేశములయందు జనరంజనముగా జేయబడు గానమును. వాయింపఁబడు వాద్యమును, ఒనర్చబడు నాట్యమును దేశ్యసంగీత మనఁబడును.

## సంగీత మాహాత్మ్యము.

గీతేన ప్రీయతే దేవః సర్వజ్ఞః పార్వతీపతిః ।
గోపీపతి రనంతోఽపి వంశధ్వని వశం గతః ॥
సామగీతి రతో బ్రహ్మా వీణాసక్తా సరస్వతి ।
కిమన్యే యక్ష గంధర్వ దేవ దానవ మానవాః ॥
అజ్ఞాత విషయాస్వాదో బాలః పర్యంకికాగతః ।
రుదన్ గీతామృతం పీత్వా హర్షోత్కర్షం ప్రపద్యతే ॥
వనేచర స్తృణాహార శ్చిత్రం మృగశిశుః పశుః ।
లుబ్ధో లుబ్ధకసంగీతే గీతే త్యజతి జీవితం ॥
తస్య గీతస్య మాహాత్మ్యం కేప్రశంసితు మీశతే ।
ధర్మార్థకామమోక్షాణా మిద మేవైకసాధనం ॥ (సం. రత్నాకరము.)

తా. సర్వజ్ఞుడైన పరమశివుఁడును గీతమునందు ప్రీతుడగుచున్నాడు. గోపీనాథుడైన శ్రీకృష్ణపరమాత్ముడును వేణునాదమునకు లోనయ్యెను. అటులనే సామగానమందు బ్రహ్మయును, వీణాగానమందు సరస్వతియును పరవశులగుచున్నారు. ఇకను యక్ష గంధర్వ దేవదానవ మానవులు యీ గానమందు పరవశులగుటకు సందియమా? యుక్తాయుక్త జ్ఞానములేక యుయ్యలలో యేడ్చుచున్న బాలుడును గానమును విని మిక్కిలి సంతోషమును బొందినవా డగుచున్నాడు. అడవిని సంచరించుచు గడ్డిపరకల నాహారముగా గొను జింకపిల్లలు కిరాతకుని గానమునకు ఆశపడుచు ప్రాణముల నిచ్చుచున్నవి. గనుక యీ గీతముయొక్క మాహాత్మ్యము నుడువ నెవ్వరికి సాధ్యము? ధర్మార్థ కామ మోక్షాదులకు యీ సంగీతమే ముఖ్య సాధన మగుచున్నది. మోక్షసాధనత్వమను గ్రంథములో "వీణావాదన తత్వజ్ఞః శ్రుతిజాతి విశారదః । తాళజ్ఞశ్చా ప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి॥" శ్రుతిజాత్యాదుల నెఱింగి లయముతో వీణ వాయించువాడు ప్రయాసలేక మోక్షమును బొందుచున్నాఁడు.

గీతం నాదాత్మకం వాద్యం నాదవ్యక్త్యాప్రశస్యతే ।
తద్వయానుగతం నృత్తం నాదాధీన మతస్త్రయం ॥
నాదేన వ్యజ్యతే వర్ణః పదం వర్ణాత్పదా ద్వచః ।
వచసో వ్యవహారోయం నాదాధీన మతో జగత్ ॥ (సం. రత్నాకరము.)

తా. నాదమువలన అక్షరమును, అక్షరమువలన శబ్దమును, శబ్దమువలన వ్యవహారమును గలుగుచున్నది. గనుక, లోకమంతయు నాదాధీన మగుచున్నది.

## నాదవిభాగము.

ఆహతోఽనాహతశ్చేతి ద్విధానాదో నిగద్యతే ।
సోయంప్రకాశతే పిండే తస్మాత్పిండోభిధీయతే ॥ (సం. రత్నాకరము.)

తా. నాదము ఆహతమనియు, అనాహతమనియు రెండు విధములు. ఈ రెండును పిండమునందుండి పుట్టుటచే పిండోత్పత్తి చెప్పబడుచున్నది. "ఆహత అనాహత నాదములు పిండమునుండి గలుగుటవలన అట్టి పిండోత్పత్తినిగూడ చక్కగా నెఱుంగవలయునను వ్యాజముతో రత్నాకరమునందు పిండోత్పత్తి ప్రకరణమని యొక ప్రకరణమును వ్రాసి, అందు మాతృగర్భమునందు పిండముధరించి అచట వృద్ధిజెందు క్రమములను ఆ పిండమందు నాదము సంభూతమైయుండు విధములను చెప్పియున్నారు."

## అనాహత నాదము.

తత్రాఽనాహతనాదంతు మునయ స్సముపాసతే ।
గురూపదిష్ట మార్గేణ ముక్తిదం నతు రంజకం ॥ (సం. దర్పణము.)

తా. అందు అనాహతనాదము రంజకములేనిదై గురుముఖముగ నుపదేశింపబడినదై, ముక్తిప్రదంబై, అచంచలమైన మనోరథమునుగల మునులచే సాహసింపబడుచున్నది.

## ఆహత నాదము.

సానాదస్త్వాహతో లోకే రంజకో భవభంజకః ।
శ్రుత్యాది ద్వారత స్తస్మా త్తదుత్పత్తి ర్నిరూప్యతే ॥ (సం. దర్పణము.)

తా. ఆహతనాదము భవభంజకమైనదియును, గానోత్పత్తికారియై శ్రుతి, స్వర, గ్రామ, మూర్ఛనాదులద్వారా జనరంజనమును గలుగఁజేయుచున్నది.

సంగీత దర్పణమునందు "శారీర వివేక" మను ప్రకరణమందు మనుష్య శరీరమందుగల మూలాధారాది ఆఱు యోగాధార చక్రములను జెప్పి, నాదము మూలాధారమునుండి బయలువెడలి క్రమేణ గాత్రమగుచున్నదనియు చెప్పియున్నారు.

## నాద ప్రకరణము.

వందన శ్లోకము.

చైతన్యం సర్వభూతానాం వివృతం జగదాత్మనా ।
నాదబ్రహ్మ తదానంద మద్వితీయ ముపాస్మహే ॥ (సం. ర.)

### త్రిమూర్తులు నాదస్వరూప మనుట.

నాదోపాసన యా దేవ బ్రహ్మవిష్ణు మహేశ్వరః ।
భవం త్యుపాసితా నూనం యస్మాదేతే తదాత్మకాః ॥ (సం.ర.)

తా. బ్రహ్మ విష్ణు మహేశ్వరులైన త్రిమూర్తులు నాదమునే స్వరూపముగా గలవారు. గాన, వారు నాదముచేతనే యుపాసింపబడుచున్నారు.

## నాదోత్పత్తిః.

ఆత్మా వివక్షమాణోయం మనః ప్రేరయతే మనః ।
దేహస్థం వహ్నిమాహంతి స ప్రేరయతి మారుతం ॥
బ్రహ్మగ్రంథిస్థితః సోథ క్రమాదూర్ధ్వపథే చరన్ ।
నాభి హృత్కంఠ మూర్ధాస్యే ష్వావిర్భవయతి ధ్వనిమ్॥ (సం.రత్నా.)

తా. శరీరమందుగల ఆత్మ మనస్సును ప్రేరేపించుచున్నది. మనస్సు దేహమందుగల వహ్నిని గొట్టుచున్నది. ఆ వహ్ని వాయువును ప్రేరేపించుచున్నది. ఆ మారుతము బ్రహ్మగ్రంథియను మూలాధారమునుండి యూర్ధ్వముఖముగా నాభి, హృదయము, కంఠము, శిరము, ముఖము వీటియందు క్రమేణ చరించునపుడు నాదము ఆవిర్భవించుచున్నది.

నాదోతిసూక్ష్మః సూక్ష్మశ్చ పుష్టో పుష్టశ్చ కృత్రిమః ।
ఇతి పంచభిధాన్ ధత్తే పంచస్థానా స్థితః క్రమాత్ ॥ (సం. రత్నా.)

తా. నాదము క్రమముగా నాభియందు అతి సూక్ష్మమనియును, హృదయమునందు సూక్ష్మమనియును, కంఠమందు పుష్టమనియును, శిరమునందు అపుష్టమనియును, ముఖమునందు కృత్రిమమనియును చెప్పఁబడుచున్నది.

## నాద శబ్దార్థము.

నకారం ప్రాణనామానం దకార మనలం విదుః ।
జాతః ప్రాణాగ్ని సంయోగా త్తేన నాదోఽభి ధీయతే॥ (సం.ర.)

తా. నకారము ప్రాణమనియును, దకారము అగ్నియనియును, ప్రాణాగ్నిసంయోగము నాదమనియును చెప్పఁబడుచున్నది.

## నాద భేదము.

వ్యవహారే త్వసౌ త్రేధా హృదిమంద్రోఽభి ధీయతే ।
కంఠే మధ్యో మూర్ధ్నితారో ద్విగుణశ్చో త్తరో త్తరః॥(సం.రత్నా.)

తా. నాదము వ్యవహారమునందు మంద్ర, మధ్య, తారమని మూడువిధములుగా చెప్పఁబడుచున్నది. నాదము హృదయమం దున్నపుడు మంద్రమనియును, కంఠమందు మధ్యమనియును, శిరస్సునందు తారమనియును చెప్పఁబడుచున్నది. ఈనాదము ఉత్తరో త్తరము ద్విగుణమగుచున్నది. అనగా, హృదయమునందు ఒకపాలైనచో కంఠమునందు రెండుపాలుగాను, శిరమునందు నాలుగుపాలుగాను రెట్టించునని తాత్పర్యము.

తత్రద్వావింశతి ర్భేదా శ్శ్రవణాచ్ఛ్రియ తేమతాః ।
హృద్యూర్ధ్వ నాడీసంలగ్నా నాడ్యో ద్వావింశతి ర్మతాః॥(సం.రత్నా.)

తా. ఆ నాదము 22 భేదములను పొందిశ్రుతులగుచున్నది. ఆ శ్రుతులు హృదయమునుండి యూర్ధ్వముగా గల 22 నాడులవలన పలికింపబడుచున్నవి.

ఇదివరకును దెలిపియున్న విషయములో పూర్వాచార్యులైన వాగ్గేయకారకులు సంగీతము ద్వివిధమనియును, అవి మార్గదేశ్య భేదములనియును, నాదోత్పత్తి పిండోత్పత్తి విషయములను నొకేతీరున నే చెప్పియున్నారనియును స్పష్టముగ తెలియుచున్నది. ఇకను శ్రుతి విషయమై చెప్పునపుడు వీరల కభిప్రాయభేదములు చాలా గలిగియున్నవి. వాటిని నీక్రింద విశదముగ జూడుడి.

## శ్రుతిః.

ఇపుడు శ్రుతియనగా నేమియని తెలుసుకోవలయును. ''శ్రూయన్త ఇతి శ్రుతయః.'' శ్రోత్రమునకు వినునది శ్రుతియని జెప్పియున్నాను. సంగీత దర్పణమందు ''స్వరూపమాత్ర శ్రవణా న్నాదోఽనురణనంవినా । శ్రుతిరిత్యుచ్యతే భేదా స్త స్యాద్వా వింశతిర్మతాః'' అనురణనము లేనిదియును, స్వరూపమాత్రముగ మొదట వినబడుచున్నదియు నైన ధ్వని శ్రుతి యనంబడును. ఆ శ్రుతి 22 భేదము లగుచున్నది. రాగవిబోధమునందు ''ధ్వన్యంత ర్నైష్టా నేరవః'' సారికల, అనగా వీణయందు గల మెట్లు, పైన ప్రాలియున్న తంత్రుల నుండి శబ్దించుధ్వని శ్రుతి యనఁబడును, అని జెప్పియున్నారు. సంగీత పారిజాతమందు, ''కేశాగ్ర వ్యవధానేవ భావోప్యపి శ్రుతయశ్శ్రితాః । వీణాయాశ్చ తథాగాత్రే, సంగీత జ్ఞానినాంమతే ॥ మధ్యే పూర్వోత్తరరాబధ్వే వీణాయాం గాత్రఏవవా । షడ్జపంచమ భావేన శ్రుతిర్ద్వావింశతిం జగుః॥'' మనుష్య శారీరమందును వీణయందును ఒక కేశ

ప్రమాణమున కొక శ్రుతివంతున ఎన్నో శ్రుతులున్నవని సంగీతజ్ఞానులు చెప్పుచున్నారు వీణయందుఁగాని శారీరమందుఁగాని షడ్జపంచమ ప్రకారముగఁ గలుగు శ్రుతులు 22 మాత్రమనియే పెద్దలు చెప్పుచున్నారు

### మతంగ మతము

శ్లో॥ శ్రవణార్థస్య ధాతోః క్తి ప్రత్యయే చ సుసంశ్రితే।
శ్రుతిశబ్దః ప్రసాధ్యోఽయం శబ్దజ్ఞైః కర్మసాధనైః॥

### విశ్వావసు మతము

శ్లో॥ శ్రవణేంద్రియ గ్రాహ్యత్వా ద్ధ్వనిరేవ శ్రుతిర్భవేత్।

తా॥ చెవులకు వినునదియును శ్రోత్రేంద్రియమునకు గ్రాహ్యమగునదియును శ్రుతి యనఁబడును

### కోహలః

శ్లో॥ ద్వావింశతిం కే చిదుదాహరంతి శ్రుతి శ్రుతిజ్ఞాన విచారదక్షాః
షట్షష్టి భిన్నాః ఖలు కేచి దాసా మానన్త్యమేవ ప్రతిపాదయంతి

తా॥ కొందఱు శ్రుతులు ద్వావింశతియని చెప్పుచున్నారు మఱికొందఱు ఆ శ్రుతులు 66 అని చెప్పియున్నారు * మఱికొందఱు శ్రుతులు అనంతమని చెప్పుచున్నారు

**మఱియు,**

శ్లో॥ "ఆనన్త్యంహి శ్రుతీనాంచ సూచయంతి విపశ్చితః।
యథా ధ్వని విశేషాణా మమానం గగనోదరే॥
ఉత్తాలపవనో ద్వేల్ల జ్జలరాశి సముద్భవాః।
ఇయంత్యః ప్రతిపద్యంతే నతరంగ పరంపరాః॥

తా॥ ధ్వనివిశేషములవల్ల గలిగెడి శ్రుతు లిన్నియని గగనోదరమునందు గణించుటకు సాధ్యము కాదనియును, † వీచీతరంగ న్యాయ ప్రకారముగ గాలిచేత కొట్టఁబడిన తటాకమునందు గల నీటిపైఁ గలుగు అలలయందు సూక్ష్మమైన చిన్నయలలు అనేకమున్న చందంబున నొక శ్రుతియందు అనేక శ్రుతు లున్నవనియును జెప్పుచున్నారు

---

* 66 శ్రుతులు, మూడు స్థాయీలకును స్థాయి యొకటింటికి 22 శ్రుతులు చొప్పున నని యెఱుంగునది

† వీచీతరంగ న్యాయమువలన శ్రుతు లనంతమని చెప్పుచున్నారు, శ్రుతియను శబ్దమునకు శ్రవణమునకు వినబడినది (The sound that could be perceived by ear) యని అర్థమేగాని మఱేమియు కాదు వేపనములు 18 లేక 19-కి తగ్గినను 10000 లేక 20000 హెచ్చినను ధ్వని చెవులకు వినఁబడదను సంగతి స్పష్టముగ నున్నది అందుచేత వేపనములు అనంతముగ నుండవచ్చునేగాని శ్రుతు లనంతముగ నున్నవని చెప్పుట యసంభావితము

సైయిక్సాన్ ప్రకారము (In accordance with the Modern Science) కొన్ని యంశములు నీక్రింద నుదహరింపఁబడును. ప్రొఫెసర్ హెమాల్‌టన్ (Professor Helmholtz) అను జర్మని సయన్టిస్టు చెప్పిన పద్ధతిని అనుసరించి (Sedley Taylor, M. A.) సీడ్లీ టేయిలర్ గారు వ్రాసియుండు (Sound & Music) అను గ్రంథములో "The Syren shows that below a certain rate of vibrations, no musical sound is produced. The lowest note on the largest modern organs has 16½ for its vibration number ; but it is a moot question whether the musical character of this note can be recognised or not.

In any case we may regard the lower limit of a musical sound as situated in the immediate neighbourhood of this degree of pitch. For some distance above the limit the musical character continues to be very imperfect, and it is not until we reach 41¼ vibrations per second, the lowest note of the double bass, that we get a satisfactory musical sound. There is no corresponding limit absolutely bearing the scale of pitch in the opposite direction : but sounds above a certain degree of accuteness become painful to the ear, and therefore unfit for musical purposes The highest note of the piccolo, the shrillest sound heard in the Orchestra, makes 4752 vibrations per second. And this we may regard as constituting a practical superior limit of the scale of pitch at the disposal of musical art. The extremest range attainable by exceptional human voices, from the deepest note of Bass to the highest note of a Soprano, lies, roughly speaking, between 50 and 1500 vibrations per second. Ordnary chorus voices range from 100 to 900 or 1000 vibrations per second

అని చెప్పియున్నారు. ఇందలి ముఖ్యాంశంబులు:—ఇప్పుడు భూలోకమునందుండు అన్ని * ఆర్గన్ లోను పెద్దదియగు వాద్యములో మొదటిస్వరమునకు గల వేపనములు 16½ యనియును, ఆ స్వరము అంతగా సంగీతయోగ్యము కాదనియును, † 41¼ వేపన

---

* ఆర్గన్ = పెద్దహార్మోనియము, పెద్ద పియానాలు మొదలైన వాద్యములు. ఈ ఆర్గను సుమారు 1000 లేక 2000 మంది చేరి పాడునపుడు ప్రక్కవాద్యముగ నుపయోగించుటకై చాల పెద్దవిగాఁ జేసి ఐరోపాదేశమునందుఁ గల క్రైస్తవ దేవాలయములలో వాడుచున్నారు.

† శబ్దమునకుఁగల వేపనములు సుమారు 12 లేక 19-కి తగ్గినను, 10000 లేక 15000 హెచ్చినను శ్రవణేంద్రియ గ్రాహ్యము కాదు. దీపము మండునపుడు వేపనములు సుమారు 30000 లేక 40000 కధికమగుచున్నవి గనుక శబ్దము చెవులకు వినకయున్నది. వేపన సమూహములలో సంగీతయోగ్యమైన స్వరములు సెకెండు 1కి సుమారు 100కి పైఁబడి 2000 వేపనముల వఱకే యుండును. ఈ లెక్కకు అధికమైనచో నాదము చాల హెచ్చుగాను చెవులకు అహితముగాను నుండును. ఈ విషయమును ప్రత్యక్షముగ తెలియఁగోరినయెడల 5 లేక 6 స్థాయిలనుగల పియానో లేక హార్మోనియము వాద్యములలో నుండు కడపటి స్వరమును పలికించి పరీక్షించినచో స్పష్టమగును. మఱియు, వేపన.

ములుగల స్వరము (అనగా పైని చెప్పిన 16½ వేపనములు గల స్వరముననుండి ఒకటి స్వర స్థాయి హెచ్చులో నుండు స్వరము) వచ్చువఱకును గల స్వరములు సంగీతయోగ్యములై యుండలేదనియును చెప్పుచున్నారు. మఱియు, సంగీతమునకు అతిమంద్రమైన స్థాయియందుఁ గల స్వరమునకు వేపనములు 16½ యని చెప్పినట్లు అన్నిటికిని హెచ్చైన స్వర మిది యని చెప్పుటకు వీలులేక యున్నదనియును, వేపనములు చాల అధికమైనచో చెవులకు దురారాధ్యమైన* శబ్దమును గలుగజేయుచున్నదనియును, ఇప్పుడుగల పికోలో ఆర్చెస్ట్రా మొదలగు వానిలోనగు హెచ్చు స్వరమునకు వేపనములు సెకెండు 1-కి 4752 అగుచున్నదనియును, దీనినే అన్నిటికిని హెచ్చు స్వరమని చెప్పవచ్చుననియును, ఉత్తమమైన మనుష్య శారీరములో పలుకు స్వరములకుఁ గల వేపనముల లెక్క తక్కువ సెకండుకు 50 వేపనములును, హెచ్చు సెకెండుకు 1500 వేపనము లనియును, సాధారణ శారీరములో సెకండు 1-కి 100 మొదలుకొని 900 లేక 1000 వఱకు పలుకు ననియును † చెప్పియున్నారు.

---

సమూహములలో సంగీతయోగ్యమైన స్థానమును వెదకియే కనిపెట్టవలసియున్నది. ఇట్లు కనిపెట్టునపుడు ముఖ్యముగ గమనించవలసినది హార్మొని (Harmony) (హార్మొని యనగా స్వరము లొకటితో నొకటి యింపుగ చేరుటకైన గుణము) ఆంగ్లేయ సంగీత విద్యావిశారదులు సెకండు ఒకటికి 256 వేపనములు గల స్వరమును ఆధార షడ్జముగా నుంచుకొన్నయెడల యా శ్రుతినుండి పుట్టు ఇతర స్వరములు నిండు హార్మొనితో చేరినవియై శ్రావ్యముగ నుండునని కొన్ని శతాబ్దములకు మునుపు చెప్పుచుండిరి. ఈవల కొన్ని సంవత్సరములకు మునుపు అమెరికాలో జరిగిన సంగీత కాన్ఫరన్స్‌లో సెకండుకు 256 వేపనములుగల స్వరమునకంటె 240 వేపనములు గల స్వరమును ఆధారషడ్జముగఁ జేసికొన్నయెడల హార్మొని విశేషముగ నుండునని నిశ్చయించినటులు తెలియుచున్నది. ఇప్పుడు ఆంగ్లేయులును సెకెండుకు 240 వేపనములు గల స్వరమునే యాధారషడ్జముగఁ జేసికొని యున్నారు.

* దోమలు ఎగురునపుడు వాని ఱెక్కలలోఁ గలుగు వేపనములు సుమారు పదివేలకధిక మగుచున్నదని తెలియుచున్నది. దోమలు చెవులకు సమీపముగ నెగురునపుడు ఆ నాదము చెవులకు చాల దురారాధ్యమై యున్నది గనుక అధిక సంఖ్యగల వేపనములతో నగు శబ్దములు సంగీత యోగ్యమైనవి కావు.

† మిస్టర్ సీడ్లి టెయిలర్ గారు చెప్పిన ప్రకారముగ మనుష్యశారీరమునందు సెకండుకు 50 వేపనములుగల స్వరము పలుకునను విషయము మన దేశమునందుఁ గనుపడలేదు. పైని చెప్పిన 50 వేపనములుగల స్వరము ఇప్పటి వాడుక ప్రకారముగ అనుమంద్రస్థాయికైనను ఒక స్థాయి తక్కువైన స్వరమగుచున్నది. ఈ స్వరము మన దేశమునందు వీణలోఁగూడ వాయించినటుల తెలియలేదు. పూర్వాచార్యుల గ్రంథములలోను ఇంత తక్కువైన శ్రుతిగాని స్వరముగాని చెప్పఁబడలేదు. సోమనాథుల మతములోను వీణమేళనము అనుమంద్ర షడ్జమునుండియే చెప్పఁబడియున్నది. మఱియు పైస్థాయిస్వరము సెకండుకు 1500 వేపనములుగల స్వరమునకైన హెచ్చైన స్వరము పలుకదని చెప్పుచున్నారు. సెకండుకు 1920 వేపనముల కధికమైన అతితారషడ్జము మన దేశమునందు మగవారి శారీరములోనే పలుకుచున్నది. అయినను ఈ వ్యత్యాసము దేశస్థ శీతోష్ణ సంబంధమని కొందఱభిప్రాయ పడుచున్నారు.

## శార్ఙ్గదేవుల శ్రుతి నిరూపణము

ఇతఁడు, శ్రుతులను నిశ్చయించుటకై ఒకటే కొలతగల రెండు వీణలను జేసికొని, వీణ యొకటికి తంత్రులు 22 చొప్పున వేసి రెండు వీణలయందును ఒకటే శ్రుతిని అనుసరించి ఒకస్థాయిలో ఒకటికంటె నొకటి యుత్తరోత్తరము తీవ్రమైన 22 శ్రుతులను జేసికొనవలయునని చెప్పియున్నాఁడు. అట్లు చేయునపుడు శ్రుతులమధ్య మఱియొక శ్రుతి రాకూడదనియును చెప్పియున్నాఁడు ఇందువలన, శార్ఙ్గదేవుఁడు 22 సమశ్రుతులనే (22 equal intervals) చెప్పియున్నాఁడని వెల్లడియగుచున్నది పైనిచెప్పిన రెండు వీణలలో నొకటి ధ్రువవీణయనియును మఱియొకటి చలవీణయనియును జెప్పుచున్నాఁడు ఈ రెండు వీణలయందుఁగల శ్రుతులలో స్వరస్థాపనములను జెప్పుచున్నాఁడు *

శ్లో॥ వీణాద్వయేస్వరాః స్థాప్యా తత్ర షడ్జ చతుశ్శ్రుతిః ।
స్థాప్యా స్తంత్రియాంతురీయాయా మృషభః స్త్రిశ్రుతి స్తతః ॥
పంచమీంత స్తృతీయాయాం గాంధారో ద్విశ్రుతి స్తతః ।
అష్టమీంతో ద్వితీయాయాం మధ్యమోద చతుశ్శ్రుతిః ॥
దశమీంత చ్చతుర్థ్యాం స్యా త్పంచమోధ చతుశ్శ్రుతిః ।
చతుర్దశీతస్తుర్యాయాం ధైవతా స్త్రిశ్రుతి స్తతః ॥
అష్టాదశ్యా స్తృతీయాయాం నిషాదో ద్విశ్రుతి స్తతః ।
ఏకవింశా ద్వితీయాయాం వీణైకాఽత్ర ధ్రువాధవేత్ ॥

తా॥ శ్రుతివీణయందు స్వరములను స్థాపనముఁ జేయునపుడు 4-వ శ్రుతియందు షడ్జమును, 7-వ శ్రుతియందు ఋషభమును, 9-వ శ్రుతియందు గాంధారమును, 13-వ శ్రుతియందు మధ్యమమును, 17-వ శ్రుతియందు పంచమమును, 20-వ శ్రుతియందు ధైవతమును, 22-వ శ్రుతియందు నిషాదమును స్థాపనముఁ జేయవలయును

---

* రాగవిబోధకారుఁడైన సోమనాథుఁడు శ్రుతిని నిశ్చయించుటకై ఒక వీణయందు 22 తంత్రులనువేసి శ్రుతి చేయుటకంటె నాలుగు తంత్రులనువేసి అందు మధ్యమధ్య 22 సారికలను బెట్టి శ్రుతిని జేయుట సులభమని వీణయందు సారికలను బెట్టి శ్రుతిని గుణించియున్నాఁడు నిశ్శంకుని యుక్తికంటె ఇతని యుక్తి చాల బాగుగనున్నది ఇతఁడును షడ్జ పంచమ భావమువలన ఒకస్థాయియందు 22 శ్రుతులు మాత్రమే యున్నవను నభిప్రాయము గలవాఁడనియె తెలియుచున్నది ఇతఁడు స్వరములయొక్క నియత శ్రుతిని జెప్పునప్పుడు ఇన్నవ తంత్రిలో నీ స్వరము పుట్టుచున్నదని చెప్పుటకుఁ బదులుగా ఇన్నవ సారికలో నీ స్వరము పుట్టుచున్నదని చెప్పియున్నాఁడు

పై నిచెప్పిన ప్రకారముగ స్వరస్థాపనమును చేయవలయును ఇట్లు చేసినవెనుక చలవీణయందు ఒకశ్రుతినితగ్గించి చూచు నప్పుడు ఇందు ఒకశ్రుతి తగ్గుటవలన ధ్రువవీణయందు స్వరము లేవియును చేరక ఒక శ్రుతిమాత్రము వ్యత్యాసమై యుండును చలవీణయందు రెండు శ్రుతులను తగ్గించి చూచునపుడు ఇందుగల నిషాద గాంధారములు ధ్రువవీణయందు గల ధైవత ఋషభములలో లయమును చెందును మఱియు చలవీణయందు 3 శ్రుతులను తగ్గించి చూచునపుడు చలవీణయందు గల ఋషభ ధైవతములు ధ్రువవీణయందు గల షడ్జపంచమములలో లయించును మఱియు చలవీణయందు నాలుగు శ్రుతులను తగ్గించి చూచినచో, చలవీణయందు గల షడ్జ, మధ్యమ, పంచమములు ధ్రువవీణయందు గల నిషాద, గాంధార, మధ్యమములలో లయమును జెందును ఇట్లు శ్రుతులను బరిష్కరించి, "చతుశ్చతు శ్చతుశ్చైవ షడ్జ మధ్యమ పంచమాః। ద్వే ద్వే నిషాదగాంధారౌ త్రి స్త్రి ఋషభ ధైవతౌ" అని స్వరములకు శ్రుతులను నిర్ణయించియున్నారు

శ్రుతులను మార్చునపుడు ధ్రువవీణయందుఁ గల స్వరములలో చలవీణ స్వరములు లయమును జెందువిధమును ఈ పథకములోఁ (1) జూడుఁడు

## పథకము (1)

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ధ్రువవీణ | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | సమశ్రుతి |
| చలవీణ | | | | స$^{3}$ | | | రి$^{2}$ | | గ$^{4}$ | | | | మ$^{4}$ | | | | ప$^{3}$ | | | ధ$^{2}$ | | ని | సమశ్రుతి |
| మొదటి భేదము | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | ఒక శ్రుతి తక్కువ |
| రెండవ భేదము | | స | | | రి | | గ$^{2}$ | | | | మ | | | | ప | | | ధ | | ని$^{2}$ | | | 2 శ్రుతులు తక్కువ |
| మూడవ భేదము | స | | | రి$^{3}$ | | గ | | | | మ | | | | ప | | | ధ$^{3}$ | | ని | | | | 3 శ్రుతులు తక్కువ |
| నాల్గవ భేదము | | | రి | | గ | | | | మ$^{4}$ | | | | ప$^{4}$ | | | ధ | | ని | | | | స | 4 శ్రుతులు తక్కువ |

## కొన్ని ముఖ్యాంశములు

ప్రకృతము మనకు లభ్యమైయుండు సంగీత సంబంధమైన సంస్కృతగ్రంథము లన్నిటిలోను చాల పురాతనమైన గ్రంథము భరతాచార్యులచే రచియింపఁబడిన నాట్యశాస్త్ర మొకటియే. ఇతఁడు సుమారు 1500 సంవత్సరములకు మునుపు ఉండిన వాఁడని తెలియుచున్నది. ఇతఁడు వ్రాసియున్న నాట్యశాస్త్రములో శ్రుతిని గుఱించి చెప్పునపుడు నీ యభిప్రాయమునుగాని వ్యక్తముగఁ జెప్పినవాడుకాఁడు. అందుచేత ఇతఁడు శ్రుతులను నిశ్చయించుటకై యెంతమాత్రము ప్రయత్నించినవాఁడు కాఁడనియే చెప్పవచ్చును.

రత్నాకరకారుఁడైన శార్ఙ్గదేవుడు పైనిచెప్పిన భరతాచార్యున కీవలివాఁడు. ఇతఁడు సుమారు 700 సంవత్సరములకు మునుపు రత్నాకరగ్రంథమును వ్రాసినటులు తెలియుచున్నది. ఇతఁడు శ్రుతులను నిర్ణయించుటకై చాల ప్రయత్నించినవాఁడని చెప్పవచ్చును. ఇతఁడు సమభాగములను గల శ్రుతులు మాత్రమే (equal intervals) సంగీతయోగ్యమని చక్కగా నెఱిగినవాఁడు; అయినను షడ్జపంచమ భావప్రకారముగ నొకస్థాయిలో 22 శ్రుతుల నెట్లు స్థాపించినాఁడో తెలియలేదు. షడ్జపంచమభావ ప్రకారముగ ప్రయత్నించునపుడు, ఒక స్థాయిలో శ్రుతులు 22 కన్న నధికముగ వచ్చుచున్నవి. వానికి ఇతఁ డేదియును సమాధానముఁ జెప్పలేదు. మఱియు, షడ్జపంచమభావ ప్రకారముగ నితఁడు శ్రుతిని నిశ్చయించినటులును చెప్పలేదు. గనుక ఇతఁడు ఒక స్థాయిని 22 సమభాగములుగాఁ జేసికొని అందు స్వరముల నమర్చినవాఁడు. అందుచేత నే ఇతనికి స్వరస్థానములు శుద్ధముగ కుదురలేదు. గ్రామభేదములను చేయునపుడు స్వరములు చాల హెచ్చుతక్కువగ నుండుటను జూచి ఒకస్వరమున కిచ్చిన శ్రుతిని మఱియొక స్వరమున కిచ్చి చ్యుతషడ్జము, త్రిశ్రుతిఋషభము అని సందర్భానుసారముగ 12 వికృతి స్వరములను నేర్పఱచుకొన్నాఁడని తోఁచుచున్నది. ఇతఁడు నిశ్శంకుఁడని బిరుదు వహించినవాఁడైనను శ్రుతులను నిర్ణయించి అందు స్వరముల నమర్చుటయందు చాల శంక గలవాఁడుగ నే కనఁబడుచున్నాఁడు.

ఇతనికి ఇటీవలి వాఁడైన సోమనాథుఁడును ఈ సంశయములోనుండి తొలఁగినవాఁడు కాఁడు. అయినను ఇతఁడు మంచి పండితుఁడు. ఇందులకు ఇతఁడు వ్రాసియున్న రాగవిబోధమే సాక్షియగును. ఈ గ్రంథము చక్కని సంస్కృతములో వ్రాయఁబడియున్నది. మఱియు నితఁడు మంచి గాయకుఁ డనియును వైణికుఁడనియును తెలియుచున్నది. షడ్జపంచమ భావముగ గలుగు స్వరసమూహములకు అన్యోన్యత (Harmony or concordance of sound) విశేషముగ నున్నదను తత్త్వమును తెలిసికొన్నవాఁడు. ఇతఁడును శార్ఙ్గదేవుఁడు పోయిన పద్ధతి ననుసరించి శ్రుతులను జెప్పినాఁడే గాని సందేహమును తీర్చుకొని శ్రుతులను నిర్ణయించలేదు. ఇట్లు శ్రుతులను లెక్కపెట్టునపుడు తనకుఁ గలిగిన సందేహమును వెల్లడిగఁ జెప్పినవాఁడు కాడు. ఇతఁడు వ్రాసిన రాగవిబోధము మొదటి వివేకములో 18, 19, 20, 21, 22-వ ఆర్యలలో "శ్రుతి స్వరజ్ఞానోపాయన వీణ" యని యొక వీణను చెప్పియున్నాఁడు. రెండవ వివేకము 18 మొదలు 43

వఱకుఁగల ఆర్యలలో "అఖిలరాగమేళ శుద్ధమేళ వీణ" యని యొక వీణను చెప్పియున్నాఁడు. రెండవ వివేకము 44 మొదలు 51 వఱకు గల ఆర్యలలో "అఖిలరాగమేళ మధ్యమేళ వీణ" యని మఱియొక వీణను జెప్పియున్నాఁడు. రెండవ వివేకమున 19-27-36-37 ఆర్యలలో "ఏకరాగ మేళ శుద్ధమేళ వీణ" యని యొక వీణయును, ఆర్య 44-47 లో "ఏకరాగమేళ మధ్యమేళ వీణ" యని మఱియొక వీణయును ఇట్లు 5 వీణలను జెప్పియున్నాఁడు. వానిని ఈ గ్రంథముయొక్క అనుబంధము (I) లోఁ జూడుఁడు.

సంగీత పారిజాతకారుఁడైన అహోబిలుఁడు స్వరములను షడ్జపంచమ భావముగానే లెక్కచేసినవాఁడని తెలియుచున్నది. "మధ్యేపూర్వోత్తరాబద్ధ వీణాయాం గాత్ర ఏవవ। షడ్జపంచమ భావేన శ్రుతిర్ద్వావింశతిం జగుః॥" అని ఇతఁడు చెప్పియున్నాఁడు. ఇతఁడు శ్రుతులను లెక్కచేయునపుడు ఒక స్థాయిలో 22 శ్రుతులకన్న అధికమైన శ్రుతులు వచ్చుచున్నవి యనే రహస్యమును తెలిసికొని మఱికొన్ని శ్రుతులను గుణించియున్నాడు. అయినను ఒక స్థాయిలో యున్న శ్రుతులే షడ్జపంచమభావమువలన గలుగుచున్నవని నెఱిగినవాఁడు కాఁడని తెలియుచున్నది. వీణయందు ఇంతకొలతలో ఈ స్వరమున్నదను నొక క్రొత్త సంప్రదాయమును ఇతఁడే మొట్టమొదట వెల్లడిచేసినవాఁడు. * ఇతఁడు చెప్పియుండు కొలతలు [illegible] గణితశాస్త్ర ప్రకారముగఁ జూచునపుడు [illegible] యున్నయవి.

---

* సంగీత పారిజాతకారుఁడైన అహోబిలుఁడు పైని చెప్పిన ద్వావింశతి శ్రుతులను నిర్ణయించునపుడు వీణయందు ఇంతకొలతలో ఈ స్వరము బుట్టుచున్నదని ఊంచుమించుగా కొలతలను జెప్పియున్న పద్ధతుల నీ దిగువ జూడుఁడు.

## వీణయందు శుద్ధస్వర నిరూపణము

శ్లో. ధ్వన్యవచ్ఛిన్న వీణాయాం మధ్యేతారక సంస్థిత
ఉభయోః షడ్జయోర్మధ్యే మధ్యమం స్వరమాచరేత్
త్రిభాగాత్మకవీణాయాం పంచమస్స్యాత్తదగ్రిమే।
షడ్జపంచమయోర్మధ్యే గాంధారస్యస్థితిర్భవేత్॥
సపయోః పూర్వభాగేచ స్థాపనీయోధరిస్వరః
పసయోర్మధ్యదేశేతు ధైవతం స్వరమాచరేత్।
తత్రాంశద్వయ సంత్యాగాన్నిషాదస్యస్థితిర్భవేత్

తా. అవచ్ఛిన్నధ్వనితోఁ గూడిన వీణయందుఁగల తంత్రియొక్క మధ్యలో (1/2) తారషడ్జము పలుకును. రెండుషడ్జములకు నడుమ (1/4) మధ్యమము నాచరింపవలయును. తంత్రియొక్క మొత్తము నిడివిని మూఁడుగా భాగించి అందు రెండు భాగములు త్రోసి (3/4) పంచమమును స్థాపింపవలయును. షడ్జపంచమములకు మధ్యలో గాంధారము పలుకును. మేరులోనుండి పంచమమువఱకు కొలిచి దానిని మూఁడుభాగ

## శ్రుతులకు సంబంధించిన ప్రకృత చర్చలు.

పూర్వపు సుప్రసిద్ధ వాగ్గేయకారకులు, ఒక స్థాయియందు 22 శ్రుతులున్నవనియును, గానము చేయునపుడు రాగములకు జీవకళల నిచ్చి రక్తిఁ గలుగఁజేయుటకై యీ శ్రుతులను సందర్భానుసారముగ, గమకముచేత కల్పించి, వాడుకొనవలయు ననియును జెప్పియున్నారు. అయినను, వీణయందు స్వరమేళనమును చేయునపుడు, ఒకస్థాయిలో ఉత్తరోత్తరము, ద్విగుణములైన 12 స్వరములకు మాత్రమే మేళన పద్ధతిలోఁ జెప్పియున్నారు.

---

ములుగా జేసి మొదటిభాగముయొక్క అంత్యములో ఋషభమును స్థాపింపవలయును. పంచమమునకును తారషడ్జమమునకును మధ్యలో ధైవతము పలుకును. పంచమమునకును తారషడ్జమమునకును గల నిడివిని మూఁడుభాగములుచేసి అందు రెండుభాగముల త్రోసి చూచునప్పుడు నిషాదము పలుకును.

### వీణయందు వికృతస్వర నిరూపణము.

శ్లో॥ భాగత్రయాన్వితో మధ్యే మేరోఋషభసంజ్ఞితాత్ ।
భాగద్వయోత్తరం మేరోః కుర్యాత్ కోమలరిస్వరమ్

తా. మేరువునకును ఋషభమునకును మధ్యలో రెండుభాగములను విడిచి కోమల ఋషభమును స్థాపనము చేయవలయును.

శ్లో॥ మేరోర్ధైవతయోర్మధ్యే తీవ్రగాంధారమాచరేత్ ॥

తా. మేరువునకును ధైవతమునకును నడుమ తీవ్రగాంధారమును జేయవలయును.

శ్లో॥ భాగత్రయవిశిష్టేస్మిఁ తీవ్రగాంధారషడ్జయోః ।
పూర్వభాగోత్తరంమధ్యే మం తీవ్రతమమాచరేత్ ॥

తా. తీవ్రగాంధారమునకును షడ్జమమునకును మధ్యలో ఒకభాగమును విడిచి తీవ్ర మధ్యమమును స్థాపింపవలయును.

శ్లో॥ భాగత్రయాన్వితో మధ్యే పంచమోత్తర షడ్జయోః ।
కోమలా ధైవత స్థాప్యః పూర్వభాగే మనీషిభిః ॥

తా. పంచమమునకును తారషడ్జమమునకును మధ్యలో మూఁడుభాగములు చేసి మొదటిభాగముయొక్క కొనలో కోమల ధైవతమును స్థాపనము చేయవలయును.

శ్లో॥ తథైవ ధసయోర్మధ్యే భాగత్రయ సమన్వితే ।
పూర్వభాగద్వయాదూర్ధ్వం నిషాదం తీవ్ర మాచరేత్ ॥

తా ధైవతమునకును తారషడ్జమమునకును మధ్యలో మూఁడుభాగములు చేసి రెండుభాగముల త్రోసి తీవ్ర నిషాదమును ఆచరింపవలయున

ప్రాకృత సంగీత విద్యావిశారదులు, ఒక స్థాయిలో 22 శ్రుతు లున్నవని పుస్తకములలో మాత్రము వ్రాసి యున్నారేకాని. వానిని స్వానుభవమునం దుంచికొన్నారు గారు. మన హైందవ సంగీతములందుం గల రాగములకు శ్రుతులే సొంపుగ నున్నయవి. ఒక స్థాయిలో 12 స్వరములను మాత్రము సమ్మేళనమును చేసికొని వానిలోనే కర్నాటక రాగములకుంగల కళ లన్నియు నున్నవని చెప్పుట సరికాదు. మనదేశమునందలి సంగీత విద్వాంసులలో, వైణికులుమాత్రమే, ఒక స్థాయిలో 12 స్వరములకన్న నధికమైన స్వరములో, లేక శ్రుతులో యుండవలయునని చెప్పుచున్నారు. అయినను, వారు అట్టి శ్రుతు లెన్ని యుండవలయునని చెప్పలేక యున్నారు. కొందఱు గ్రంథపద్ధతి ననుసరించి, ఒక స్థాయిలో 22 శ్రుతు లున్నవని చెప్పుచున్నారు. సంగీతవిద్యను జీవనోపాయముగం గైకొన్న విద్వాంసు లెవరును ఈ శ్రుతుల సంబంధమైన రహస్యమును కనిపెట్టుటకు ప్రయత్నించినవారు గారు. సుమారు, 15 సంవత్సరములకు పూర్వము, (Mr. Rao Bahadur C Nagoji Rov, Inspector of Schools, Southern Circle) మిస్టర్ రావు బహదూర్ సి. నాగోజి రావుగారు, ఈ శ్రుతులను లెక్కపెట్టుటకై ప్రయత్నించినారు. రావుగారు 1904 వ సంవత్సరమున తిరువల్లిక్కేణికివచ్చి నన్ను రావించి తాము సిద్ధముచేసిన 22 శ్రుతుల వీణను నాకు చూపి, నా యభిప్రాయము నడిగినారు. కొన్ని రాగకళలను అందులో వాయించినారు. వానిలో కొన్ని శుద్ధముగాను కొన్ని సంకరముగాను (హెచ్చు తక్కువలుగాను) ఉండెను శ్రుతులు హెచ్చుతక్కువలుగా నున్నవని నా యభిప్రాయమును తెలిపితిని. అందులకు వారును సమ్మతించి వానిని సవరింపవలయునని చెప్పినారు. ఇది శ్రుతులను లెక్కపెట్టుటకైన ప్రథమ ప్రయత్నము తరువాత, శ్రుతుల విషయమై అనేకులు చర్చింపం దొడంగిరి. వానిలో ముఖ్యమైన కొన్ని యభిప్రాయముల నీ దిగువ వ్రాసెదను.

## (1) రావుబహదూర్ సి. నాగోజి రావుగారి యభిప్రాయము.

### 22 శ్రుతులను వాని వేవన సంఖ్యలను అవి పుట్టుస్థానములను వాని (Ratio) రేషియోలను, * అంతరములను తెలిపెడి పధకము.

| శ్రుతులసంఖ్య. | స్వరనామములు. | నాటకయందుంగల 12 స్వరములు. | వేవన నిష్పత్తులు. | వేవన సంఖ్యలు. | అంతరముల నిష్పత్తులు. | గ్రంథకర్త యభిప్రాయము. |
|---|---|---|---|---|---|---|
| 1 | స | స. | 1 | 240 | 1 | |
| 2 | రి1 | ... | 25/24 | 250 | 24/25 | |
| 3 | రి2 | శు.రి. | 16/15 | 256 | 15/16 | |
| 4 | రి3 | ... | 10/9 | $266\frac{2}{3}$ | 9/10 | |
| 5 | రి4 | చ.రి. | 9/8 | 270 | 8/9 | |
| 6 | గ1 | ... | 32/27 | $284\frac{4}{9}$ | 27/32 | |
| 7 | గ2 | సా.గ. | 6/5 | 288 | 5/6 | |
| 8 | గ3 | అం.గ. | 5/4 | 300 | 4/5 | |
| 9 | గ4 | ... | 32/25 | $307\frac{1}{2}$ | 25/32 | |
| 10 | మ1 | శు. మ. | 4/3 | 320 | 3/4 | |
| 11 | మ2 | ... | 27/20 | 324 | 20/27 | |
| 12 | మ3 | ప్ర.మ. | 45/32 | $337\frac{1}{2}$ | 32/45 | |
| 13 | మ4 | ... | 36/25 | $345\frac{3}{5}$ | 25/36 | |
| 14 | ప | ప | 3/2 | 360 | 2/3 | |
| 15 | ధ1 | శు.ధ. | 25/16 | 375 | 16/25 | |
| 16 | ధ2 | ... | 8/5 | 384 | 5/3 | |
| 17 | ధ3 | చ.ధ. | 5/3 | 400 | 3/5 | |
| 18 | ధ4 | ... | 27/16 | 405 | 16/27 | |
| 19 | ని1 | ... | 16/9 | $426\frac{2}{3}$ | 9/16 | |
| 20 | ని2 | కై. ని. | 9/5 | 432 | 5/9 | |
| 21 | ని3 | కా. ని. | 15/8 | 450 | 8/15 | |
| 22 | ని4 | ... | 48/25 | 461 | 25/48 | |
| 23 | స | సఀ | 2 | 480 | 1/2 | |

మిస్టరు, నాగోజి రావుగారు, ఈ శ్రుతుల పద్ధతిని ఆంగ్లేయ ఏన్‌హార్మొనిక్ స్కేల్ (English E ihormonic Sca'e) ననుసరించి చెప్పియున్నారు. ఇందు, కొన్ని స్వరములు ఆంగ్లేయపద్ధతికి సరిగ నున్నవి. కొన్ని సరికావు. ఇందుఁగల శ్రుతులు, ఒకటే లెక్కగలవి కావు. గనుక, ఇవి సంగీత రత్నాకరోక్త శ్రుతులు కానేరవు.

మఱియు 2/1, 3/2, 4/3, 5/4, 6/5, 9/8, -0/9, 16/15, 2;/24అను (inter' als) కాలవ్యవధులు మాత్రమే సంగీత యోగ్యమనియును, అట్టి శ్రుతులు ఒకస్థాయిలో 22 మాత్రమే యున్నవనియును చెప్పియున్నారు.†

* రేషియో = రెండుసంఖ్యలకు గల సంబంధము ; అంతరము.

† ఆంగ్లేయులు, సంగీతమునందు హార్మొని (harmony) నిండి యుండవలయునని చెప్పుచున్నారు. హార్మొని యనఁగా నేమి? అని మనము తెలిసికొనవలయును. స్వరములు ఒకటితో నొకటి చేరుటకైన శబ్ద విశేషము హార్మొని యనఁబడును. వీణలో షడ్జతంత్రిని మీటి మేరువును నొకవ్రేలితో తాఁకి తత్‌క్షణమే వ్రేలిని పైకెత్తి, స్వర

ములను గమనించినచో, షడ్జతంత్రిలోనే, "స, గ, ప, సి" యని షడ్జ, అంతర గాంధార, పంచమ, తారషడ్జములు వరుసగాను సూక్ష్మముగాను ధ్వనించి, వెంటనే షడ్జములో లయించి పోవుటయును విశదముగ నెఱుఁగవచ్చును. ఇట్లు పలుకుటకు, అప్పర్ పార్షల్ (upper partial) అని పేరు. వాద్యములలో, ఒక అప్పర్ పార్షలును, మనుష్య శారీరములలో మూఁడు అప్పర్ పార్షలును పలుకును. అందుచేతనే గాత్రగానము జంత్రగానమునకన్న మిగుల సొంపుగ నున్నది. ఇట్టి సొంపు సంగీతమునకు హార్మోనివలననే గలుగుచున్నది. మఱియు నిట్లు పలుకు స్వరములకు, కార్డ్ ఆవ్ నేచర్ (chord of nature) ఒకటితో నొకటి చేరెడి స్వరములని పేరు. ఇట్టి స్వరములు, వరుసలుగా వచ్చునపుడు రాగము గలుగుచున్నది.

పైని చెప్పిన రీతిగ నిండు హార్మొనిగల స్వరము లివి యనియును, తక్కువ హార్మొనిగల స్వరము లివి యనియును నెఱుఁగవలసినది యావశ్యకమే గదా?

(1) ఒక స్వరమునకును మఱియొక స్వరమునకును గల అంతరము (interval) సరిగా ఒకస్థాయి యుండినయెడల పూర్ణమైన హార్మొని గలుగును.

ఉ॥ స సి

ఈ అంతరమునకు లెక్క 2 (interval)

(2) షడ్జమునకును పంచమమునకును (సప) గల హార్మొని రెండవతరగతి యగును, ఇందుకు అంతరము 3/2 (interval)

(3) పంచమమునకును షడ్జమునకును (ప సి) గల అంతరము (interval) 4/3. ఎట్లనిన,

$$ప \times 4/3 = సి$$

$$3/2 \times 4/3 = 2$$

(4) అంతర గాంధారమునకును షడ్జమునకును (గ3-స) గల అంతరము 6/5:-

$$గ3 \times 6/5 = ప$$

$$5/4 \times 6/5 = 3/2$$

మఱియు ఆంగ్లేయ సంగీతములో 9/8 (Major tone) 10/9 (Minor tone), 16/15 (Major Semitone), 25/24 (Minor Semitone), అను అంతరములను (intervals) చేరికగల స్వరములుగా స్వీకరించి యున్నారు. ఇందుచేత, మనము తెలిసికొన్న దేమనగ, "2/1, 3/2, 4/3, 5/4, 6/5, 9/8, 10/9, 16/15, 25/24" ఇట్టి అంతరములను గల స్వరములు, ఒకటితోనొకటి చేరెడి స్వభావము గలవి యనునదియే.

ఇఁకను, "స1-గ3, గ3-ప, ప-స2" వీని మధ్యలో నెన్ని హార్మోనిక్ స్వరములు రావచ్చునని లెక్కపెట్టవలయును.

1. షడ్జమునకును అంతర గాంధారమునకును (స-గ3) మధ్యలో రి1 వచ్చినచో అనుగుణ్యమైన స్వరమగును. రి 1-కి అంతరము 25/24; (గ3) మూఁడవ గాంధారమునకు అంతరము 6/5. ఎట్లనిన,

25/24 × 6/5 = 5/4
రి1 × 6/5 = గ3

మొదటి ఋషభమును షడ్జముగ జేసినచో మూఁడవ గాంధారము సాధారణ గాంధారముగ పలుకును.

2. షడ్జమునకును మూఁడవ గాంధారమునకును మధ్యలో మూఁడవ ఋషభము వచ్చును. షడ్జమునకును మూఁడవ ఋషభమునకును గల అంతరము 10/9; మూఁడవ ఋషభమునకును మూఁడవ గాంధారమునకును గల అంతరము 9/8. ఎట్లనిన,

10/9 × 9/8 = 5/4
రి3 × 9/8 = గ3

మూఁడవ ఋషభమును షడ్జముగఁ జేసినచో మూఁడవ గాంధారము 4-వ ఋషభముగ పలుకును.

3. షడ్జమునకును మూఁడవ గాంధారమునకును మధ్యలో 4-వ ఋషభము వచ్చినచో అనుగుణ్యమైన స్వరమగును. ఎట్లనిన, షడ్జమునకును 4-వ ఋషభమునకును గల అంతరము 9/8; 4-వ ఋషభమునకును 3-వ గాంధారమునకును గల అంతరము 10/9.

9/8 × 10/9 = 5/4
రి4 × 10/9 = గ3

ఇచ్చట 4-వ ఋషభమును షడ్జముగఁ జేసినచో 3-వ గాంధారము 3-వ ఋషభముగ పలుకును.

4. రెండవ గాంధారము షడ్జమునకును మూఁడవ గాంధారమునకును మధ్యలో వచ్చినయెడల ఐకమత్యముగల స్వరమగును. రెండవ గాంధారమునకును షడ్జమునకును గల అంతరము 6/5; 3-వ గాంధారమునకును 2-వ గాంధారమునకును గల అంతరము 25/24.

6/5 × 25/24 = 5/4
గ2 × 25/24 = గ3.

2-వ గాంధారమును షడ్జముగఁ జేసినచో మూఁడవ గాంధారము మొదటి ఋషభముగ పలుకును. పైని చెప్పిన 4 పద్ధతులవలన షడ్జమునకును మూఁడవ గాంధారమునకును మధ్యలో 4 స్వరములే ఐకమత్యము గలవిగా యుండునని తెలియుచున్నది. వానిని నీ క్రింద జూడుఁడు.

| | | | |
|---|---|---|---|
| 1. | స | రి1 | గ3 |
| 2. | స | రి3 | గ3 |
| 3. | స | రి4 | గ3 |
| 4. | స | రి6 | గ3 |

మూఁడవ గాంధారమునకును పంచమమునకును మధ్యలో, ఎన్ని అనుగుణ్యమైన స్వరములున్నవని విచారింతము.

1. మొదటి మధ్యమము చేరికగల స్వరము.

| | |
|---|---|
| 5/4 × 16/15 = 4/3 | 4/3 × 9/8 = 3/2 |
| గ3 × 16/15 = మ1 | మ1 × 9/8 = ప |

మూఁడవ గాంధారమును షడ్జముగఁ జేసినచో అందుకు మ1 శుద్ధ ఋషభముగ నుండును. మొదటి మధ్యమమును షడ్జముగఁ జేసినచో పంచమము 4-వ ఋషభముగ పలుకును.

2. మూఁడవ మధ్యమమును ఐకమత్యమైన స్వరమే. 3-వ మధ్యమమునకును 1-వ మధ్యమమునకును గల అంతరము 9/8 ; మూఁడవ మధ్యమమునకును పంచమమునకును గల అంతరము 16/15.

$5/4 \times 9/8 = 45/32$ | $45/32 \times 16/15 = 3/2$

గ2 × 9/8 = మ3 | మ3 × 16/15 = ప

కనుక 3-వ గాంధారమునకును పంచమమునకును మధ్యలో ఈ దిగువ వ్రాసి యున్న చేరికగల స్వర సమూహములు వచ్చును.

1. గ3 మ1 ప
2. గ3 మ3 ప

ఇపుడు షడ్జమునకును 2-వ గాంధారమునకును పంచమమునకును మధ్యలో ఏయే స్వరములు చేరిక గలవై యుండునని విచారింపఁబడును.

1. షడ్జమునకును రెండవ గాంధారమునకును మధ్యలో 2-వ ఋషభము ఐకమత్యముఁగల స్వరమై యుండును. షడ్జమునకును 2-వ ఋషభమునకును గల అంతరము 16/15 ; రెండవ ఋషభమునకును 2-వ గాంధారమునకును గల అంతరము 9/8.

$16/15 \times 9/8 = 6/5$

రి2 × 9/8 = గ2

2. షడ్జమునకును 2-వ గాంధారమునకును మధ్యలో 4-వ ఋషభము అనుగుణ్యమైన స్వరమగును. షడ్జమునకును 4-వ ఋషభమునకును గల అంతరము 9/8; 4-వ ఋషభమునకును రెండవ గాంధారమునకును గల అంతరము 16/15.

$9/8 \times 16/15 = 6/5$

కనుక { స రి2 గ2 / స రి4 గ2 } షడ్జమునకును 2-వ గాంధారమునకును మధ్యలో నీ రెండు సమూహములు ఐకమత్యము గలవిగా నుండును.

1. రెండవ గాంధారమునకును పంచమమునకును మధ్యలో 1-వ మధ్యమము చేరిక గల స్వరమై యుండును. 2-వ గాంధారమునకును 1-వ మధ్యమమునకును గల అంతరము 10/9; 1-వ మధ్యమమునకును పంచమమునకును గల అంతరము 9/8.

$6/5 \times 10/9 = 4/3$ | $4/3 \times 9/8 = 3/2$

గ2 × 10/9 = మ1 | మ1 × 9/8 = ప

2. రెండవ గాంధారమునకును పంచమమునకును మధ్యలో 2-వ మధ్యమము వచ్చును. 2-వ గాంధారమునకును 2-వ మధ్యమమునకును గల అంతరము 9/8 ; రెండవ మధ్యమమునకును పంచమమునకును గల అంతరము 10/9

$6/5 \times 9/8 = 27/20$ | $27/20 \times 10/9 = 3/2$

గ2 × 9/8 = మ2 | మ2 × 10/9 = ప

3. రెండవ గాంధారమునకును పంచమమునకును మధ్యలో 4-వ మధ్యమము వచ్చును. రెండవ గాంధారమునకును 4-వ మధ్యమమునకును గల అంతరము 6/5; 4-వ మధ్యమమునకును పంచమమునకును గల అంతరము 25/24.

| | |
|---|---|
| $6/5 \times 6/5 = 36/25$ | $36/25 \times 25/24 = 3/2$ |
| గ2 $\times 6/5 =$ మ4 | మ4 $\times 25/24 =$ ప |

కనుక { గ2 మ1 ప; గ2 మ2 ప; గ2 మ4 ప } ఈ మూఁడు చేరికగల స్వరసమూహములు గ2—ప మధ్యలో వచ్చును.

ఇదివరకును షడ్జమములో నుండి పంచమమువఱకుఁ గల చేరికఁగల స్వరములను లెక్క చేసితిమి. అటులనే పంచమము మొదలుకొని పై షడ్జమువఱకుఁ గల ఐకమత్యము గల స్వరములను కనిపెట్టవలయును. అందుకు, ఒక సులభమైన త్రోవయున్నది. ఎట్లనిన, పంచమమును షడ్జముగ (శ్రుతిగ) స్వీకరించినచో పై షడ్జము 1-వ మధ్యమ మగును; కనుక "పసి" యనునది "సమ" యను స్వరములకు సరియగును. ఈ కారణముచేత షడ్జములోనుండి 1-వ మధ్యమమువఱకును ఎన్ని ఐకమత్యముఁగల స్వరమున్నవో, అన్ని స్వరములే పంచమమునకును పై షడ్జమమునకును మధ్యలో నుండును. వాని నీ దిగువనుండు చక్రములో జూడుఁడు.

## షడ్జ మధ్యమముల మధ్యనుండు స్వరములకు సరియైన స్వరములను పంచమ తార షడ్జమధ్యములోఁ జూపెడి పథకము.

| స—మ (1) మధ్య నుండుస్వరములు. | అంతరములు. | ప—స. మధ్య నుండుస్వరములు. | అంతరములు. | షరాలు. |
|---|---|---|---|---|
| స | 1 | ప | 3/2 | ఈ పథకములో మొదటి పంక్తిలో నుండు స్వరములకు, మూఁడవ పంక్తిలో నుండు స్వరములు సమయోగ్యంబులైనవి యని యెఱుఁగునది. |
| రి1 | 25/24 | ధ1 | 25/16 | |
| రి2 | 16/15 | ధ2 | 8/5 | |
| రి3 | 10/9 | ధ3 | 5/3 | |
| రి4 | 9/8 | ధ4 | 27/16 | |
| గ2 | 6/5 | ని2 | 9/5 | |
| గ3 | 5/4 | ని3 | 15/8 | |
| మ1 | 4/3 | సి | 2 | |

ఇదివఱకును, ఒక స్థాయిలో ఆరోహణక్రమముగఁ జూచునపుడు ఐకమత్య శ్రుతు లెన్నిగలవో యని విచారించితిమి. ఇపుడు అవరోహణ క్రమములో నెన్ని ఐకమత్య శ్రుతు లున్నవని విచారింపవలయును.

1. పంచమమునకును 1-వ ధైవతమునకును గల అంతర మెదియో, అదియే 4-వ నిషాదమునకును షడ్జమమునకును గల అంతరమగును.

పైనిఁ గనఁబఱచిన 22 శ్రుతులకంటె నధికమైన ఐకమత్యముఁగల శ్రుతులు ఒకస్థాయిలో వచ్చుటకు వీలులేదు ఇదియే రావుగారి 22 శ్రుతుల పద్ధతి. ఈ పద్ధతులు లెక్కకు సరిగానున్నవి ; అయినను పైనిచెప్పిన లెక్క ప్రకారముగ వీణయందు స్వరములను స్థాపనము జేయునపుడు షడ్జస్వరములుతప్ప ఇతర స్వరములు శుద్ధముగా నుండవు. అందుచేత స్వరములొకటితో నొకటి చేరవు.

---

ఉ॥ $48/25 \times 25/24 = 2$

$\text{ని}4 \times 25/24 = \text{సి}$

కనుక 4-వ నిషాదమును శ్రుతిగా నుంచుకొన్నచో అందుకు షడ్జము శుద్ధ ఋషభమగును.

2. 2-వ ధైవతమునకును పంచమమునకును గల అంతర మెదియో అదియే 3-వ నిషాదమునకును షడ్జమునకును గల అంతరము.

ఉ॥ $15/8 \times 16/15 = 2$

$\text{ని}3 \times 16/15 = \text{సి}$

3. 1-వ నిషాదమును శ్రుతిగాఁ (షడ్జముగ) జేయునపుడు అందుకు తారషడ్జము 4-వ ఋషభముగ పలుకును.

ఉ॥ $16/9 \times 9/8 = 2$

$\text{ని}1 \times 9/8 = \text{సి}$

పైని చెప్పినప్రకారముగ తారషడ్జమునకును పంచమమునకును మధ్యలో 1-వ, 4-వ నిషాదములు చేరికగల స్వరములగుచున్నవి. ఈ తీరుననే శుద్ధమధ్యమములోనుండి క్రింది షడ్జమువఱకును గుణించునపుడు 1, 4 సంఖ్యగల ఋషభములు (రి1, రి4) మనకు లభ్యమగును. ఎట్లనిన,

1-వ గాంధారమునకును 1-వ మధ్యమమునకును గల అంతరము 9/8.

ఉ॥ $22/27 \times 9/8 = 4/3$

$\text{గ}1 \times 9/8 = \text{మ}1$

4-వ గాంధారమునకును 1-వ మధ్యమమునకును గల అంతరము 25/24.

ఉ॥ $32/25 \times 25/24 = 4/3$

$\text{గ}4 \times 25/24 = \text{మ}1$

ఇదియే 22 అనుగుణ్యముఁ గల శ్రుతులు. వీనికన్న యధికమైన ఐకమత్య శ్రుతులొక స్థాయిలో లేవని యభిప్రాయఁబడుచున్నారు.

పైనిఁ గనఁబఱచిన 22 శ్రుతులకంటె నధికమైన ఐకమత్యముఁగల శ్రుతులు ఒకస్థాయిలో వచ్చుటకు వీలులేదు ఇదియే రావుగారి 22 శ్రుతుల పద్ధతి. ఈ పద్ధతులు లెక్కకు సరిగా నున్నవి ; అయినను పైని చెప్పిన లెక్క ప్రకారముగ వీణయందు స్వరములను స్థాపనము జేయునపుడు షడ్జస్వరములుతప్ప ఇతర స్వరములు శుద్ధముగా నుండవు. అందుచేత స్వరములొకటితో నొకటి చేరవు.

---

ఉ॥ $48/25 \times 25/24 = 2$

ని$4 \times 25/24 =$ సఁ

కనుక 4-వ నిషాదమును శ్రుతిగా నుంచుకొన్నచో అందుకు షడ్జము శుద్ధ ఋషభమగును.

2. 2-వ ధైవతమునకును పంచమమునకును గల అంతర మెదియో అదియే 3-వ నిషాదమునకును షడ్జమునకును గల అంతరము.

ఉ॥ $15/8 \times 16/15 = 2$

ని$3 \times 16/15 =$ సఁ

3. 1-వ నిషాదమును శ్రుతిగాఁ (షడ్జముగ) జేయునపుడు అందుకు తారషడ్జము 4-వ ఋషభముగ పలుకును.

ఉ॥ $16/9 \times 9/8 = 2$

ని$1 \times 9/8 =$ సఁ

పైని చెప్పినప్రకారముగ తారషడ్జమునకును పంచమమునకును మధ్యలో 1-వ, 4-వ నిషాదములు చేరికగల స్వరములగుచున్నవి. ఈ తీరుననే శుద్ధమధ్యమములోనుండి క్రింది షడ్జముల కును గుణించునపుడు 1, 4 సంఖ్యగల ఋషభములు (రి1, రి4) మనకు లభ్యమగును. ఎట్లనిన,

1-వ గాంధారమునకును 1-వ మధ్యమమునకును గల అంతరము $9/8$.

ఉ॥ $32/27 \times 9/8 = 4/3$

గ$1 \times 9/8 =$ మ1

4-వ గాంధారమునకును 1-వ మధ్యమమునకును గల అంతరము $25/24$.

ఉ॥ $32/25 \times 25/24 = 4/3$

గ$4 \times 25/24 =$ మ1

ఇదియే 22 అనుగుణ్యముఁ గల శ్రుతులు. వీనికన్న యధికమైన ఐకమత్య శ్రుతులొక స్థాయిలో లేదని యభిప్రాయఁబడుచున్నారు.

## రావుగారి 22 శ్రుతుల పద్ధతి (కరుణామృతసాగర ప్రకారముగ)

| సంఖ్యలు. | స్వరనామములు. | తీగ స్థానములు. | అంతర స్థానములు. | అంతర దశాంశ స్థానములు. | 32 అంగుళముల తీగెపై శ్రుతులకు గురుతులు. | సెంట్సులు. | అంతర సెంట్సులు. | స. 540 కంపనముల షడ్జమునకు కంపన సంఖ్యలు. | స. 240 కంపనముల షడ్జమునకు కంపనసంఖ్యలు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | స | 1 | | | 32 | | | 5.0 | 240 |
| 1 | రి1 | 24/25 | 24/25 | .9600 | 30.72 | 71 | 71 | 562.59 | 250 |
| 2 | రి2 | 15/16 | 125/128 | .9375 | 30 | 112 | 41 | 576 | 256 |
| 3 | రి3 | 9/10 | 24/25 | .9000 | 28.8 | 182 | 71 | 600 | 266.66 |
| 4 | రి4 | 8/9 | 80/81 | .8889 | 28.44 | 204 | 22 | 607.50 | 270 |
| 5 | గ1 | 27/32 | 243/256 | .8438 | 27 | 294 | 90 | 640 | 284.44 |
| 6 | గ2 | 5/6 | 80/81 | .8333 | 26.67 | 316 | 22 | 648 | 288 |
| 7 | గ3 | 4/5 | 24/25 | .8000 | 25.60 | 386 | 71 | 675 | 300 |
| 8 | గ4 | 25/32 | 125/128 | .7813 | 25 | 427 | 41 | 691.20 | 307.2 |
| 9 | మ1 | 3/4 | 24/25 | .7507 | 24 | 498 | 71 | 720 | 320 |
| 10 | మ2 | { 20/27 | 80/81 | .7407 | 23.70 | 520 } | 22 | 729 | 324 |
| 11 | మ3 | { 32/45 | 24/25 | .7111 | 22.76 | 590 } | 71 | 759.375 | 337.5 |
| 12 | మ4 | { 25/36 | 125/128 | .6944 | 22.22 | 631 } | 41 | 777.60 | 345.6 |
| 13 | ప | 2/3 | 24/25 | .6667 | 21.33 | 702 | 71 | 810 | 360 |
| 14 | ధ1 | 16/25 | 24/25 | .6400 | 20.48 | 773 | 71 | 843.75 | 375 |
| 15 | ధ2 | 5/8 | 125/128 | .6250 | 20 | 814 | 41 | 864 | 384 |
| 16 | ధ3 | 3/5 | 24/25 | .6000 | 19.20 | 884 | 71 | 900 | 400 |
| 17 | ధ4 | 16/27 | 80/81 | .5926 | 18.99 | 906 | 22 | 9911.25 | 405 |
| 18 | ని1 | 9/16 | 243/256 | .5625 | 18 | 996 | 90 | 960 | 426.67 |
| 19 | ని2 | 5/9 | 80/81 | .5556 | 17.78 | 1018 | 22 | 972 | 432 |
| 20 | ని3 | 8/15 | 25/25 | .5333 | 17.07 | 1088 | 71 | 1012.50 | 450 |
| 21 | ని4 | 25/48 | 125/128 | .5208 | 16.67 | 1129 | 41 | 1036.80 | 460.8 |
| 22 | సే | 1/2 | 24/25 | .5000 | 16 | 1200 | 71 | 1080 | 480 |

పైని కనఁబఱచియుండు పథకములో కొన్ని వ్యత్యాసములైన లెక్కలు గనఁబడుచున్నవి. 7-వ 8-వ పంక్తిలో జూడుఁడు; ఒక స్థాయికి గల మొత్తము సెంట్సులు 1200, అని 7-వ పంక్తి అంత్యములో వ్రాసియున్నది. 8-వ పంక్తిలో పైనిచెప్పిన 1200 సెంట్సులకును వివరమును గనఁబఱచి యున్నారు. ఆ సంఖ్యలు, ఒక శ్రుతికిని దానివెంటనే వచ్చెడి మఱియొక శ్రుతికిని గల అంతరములు. ఈ అంతర సెంట్సులను మొత్తము చేసినచో 1200 సెంట్సులే రావలయును. అట్లుగాక 5 సెంట్సులు అధికముగ వచ్చియున్నవి. మఱియు 7-వ పంక్తిలో నుండు మొత్తసంఖ్య ఒకటితో 8-వ

పంక్తిలో నుండు అంతరసంఖ్యనుగూర్చి చూచునపుడు అందులకు దిగువనుండు 7-వ పంక్తిలోని మొత్తము సరిగ నుండవలయును. అట్లుగాక కొన్ని తావులలో వ్యత్యాసమై యుండుటయును జూడుఁడు. అంతరభిన్నములకుఁ దగినట్లుగ సెంట్సులను లెక్కచేసి నందువలన నీ వ్యత్యాసము గనఁబడుచున్నదని తెలియుచున్నది.

---

## (2) 22 శ్రుతులు. Mr. సహస్రబుద్ధిగారి యభిప్రాయము ననుసరించి గుణింపఁబడిన పథకము.

| శ్రుతుల సంఖ్యలు. | స్వర నామములు. | తీగె పొడవులు. | 32 అంగుళముల తీగెపై స్వరములు పలుకు స్థానములు. | సె. 540 కంపన సంఖ్యలు. | సెంట్సులు. | అంతర సెంట్సులు. | రత్నాకర పద్ధతి. | గ్రంథకర్త యభిప్రాయము. |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | స | 1 | 32.00 | 540 | 0 | | సంగీత రత్నాకర ప్రకారము 1 శ్రుతికిని మఱియొక శ్రుతికిని ఉండవలసిన అంతరము 54.54½. | Mr. సహస్రబుద్ధిగారు శ్రుతులను లెక్కచేయునపుడు తంత్రియొక్క నిడివిని 4 సమభాగములుగఁ జేసి వాని లో 22 భాగముల నొక స్థాయికినిచ్చి తారషడ్జమును చేసినారు. ఈ లెక్క షడ్జమునకు మాత్రము సరిగ నుండునే గాని తదితర స్వరములకు సరిగా నుండదు. ఇందు మధ్యమ పంచమము లే సరిగ నుండలేదు. 12, 16 శ్రుతులను జూడుఁడు. |
| 2 | రి1 | 43/44 | 31.27 | 552.6 | 40 | 40 | | |
| 3 | రి2 | 42/44 | 30.55 | 565.7 | 81 | 41 | | |
| 4 | రి3 | 41/44 | 29.82 | 579.5 | 122 | 41 | | |
| 5 | గ1 | 40/44 | 29.09 | 594 | 165 | 43 | | |
| 6 | గ2 | 39/44 | 28.36 | 609.2 | 209 | 44 | | |
| 7 | మ1 | 38/44 | 27.64 | 625.3 | 254 | 45 | | |
| 8 | మ2 | 37/44 | 26.91 | 642.2 | 300 | 46 | | |
| 9 | మ3 | 36/44 | 26.18 | 660 | 347 | 47 | | |
| 10 | మ4 | 35/44 | 25.45 | 678.9 | 396 | 49 | | |
| 11 | ప1 | 34/44 | 24.37 | 698.8 | 446 | 50 | | |
| ☞ 12 | ప2 | 33/44 | 24 | 720 | 498 | 52 | | |
| 13 | ప3 | 32/44 | 23.27 | 742.5 | 551 | 53 | | |
| 14 | ప4 | 31/44 | 22.55 | 766.5 | 606 | 55 | | |
| 15 | ధ1 | 30/44 | 21.82 | 792 | 663 | 57 | | |
| ☞ 16 | ధ2 | 29/44 | 21.09 | 819.3 | 722 | 59 | | |
| 17 | ధ3 | 28/44 | 20.36 | 848.6 | 783 | 61 | | |
| 18 | ని1 | 27/44 | 19.64 | 880 | 845 | 62 | | |
| 19 | ని2 | 26/44 | 18.91 | 913.8 | 911 | 66 | | |
| 20 | స1 | 25/44 | 18.18 | 950.4 | 979 | 68 | | |
| 21 | స2 | 24/44 | 17.45 | 990 | 1049 | 70 | | |
| 22 | స3 | 23/44 | 16.73 | 1033 | 1123 | 74 | | |
| 23 | సే4 | 22/44 | 16 | 1080 | 1200 | 77 | | |

## (3) ద్వావింశతి శ్రుతులు: రాజా సురేంద్రనాథ టాగూరుగారి యభిప్రాయము.

| శ్రుతుల సంఖ్యలు. | స్వర నామములు. | తంత్రీదైర్ఘ్యములు. | 32 అంగుళముల తంత్రిలో స్వరముల స్థానము. | స. 540 గా నున్న కంపన సంఖ్యలు. | సెంట్లు. | అంతర సెంట్లు. | సరాసరి. | గ్రంథకర్త యభిప్రాయము. |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | స | 1 | 32.0 | 540 | | | [illegible] 54·5+½ [illegible] | ఈ పద్ధతిననుసరించి [illegible] |
| 2 | రి1 | 35/36 | 31.11 | 555.4 | 49 | 49 | | |
| 3 | రి2 | 34/36 | 30.22 | 571.8 | 99 | 50 | | |
| 4 | రి3 | 33/36 | 29.33 | 589.1 | 151 | 52 | | |
| 5 | గ1 | 32/36 | 28.44 | 607.5 | 204 | 53 | | |
| 6 | గ2 | 31/36 | 27.56 | 627.1 | 259 | 55 | | |
| 7 | మ1 | 30/36 | 26.67 | 648. | 316 | 57 | | |
| 8 | మ2 | 29/36 | 25.78 | 670.3 | 374 | 58 | | |
| 9 | మ3 | 28/36 | 24.89 | 694.3 | 435 | 61 | | |
| 10 | మ4 | 27/36 | 24.0 | 720 | 498 | 63 | | |
| 11 | ప1 | 38/52 | 23.4 | 738.9 | 543 | 45 | | |
| 12 | ప2 | 37/52 | 22.8 | 758.9 | 589 | 46 | | |
| 13 | ప3 | 36/52 | 22.2 | 780 | 637 | 48 | | |
| 14 | ప4 | 35/52 | 21.5 | 802.3 | 685 | 48 | | |
| 15 | ధ1 | 34/52 | 20.9 | 825.9 | 736 | 51 | | |
| 16 | ధ2 | 33/52 | 20.3 | 850.9 | 787 | 51 | | |
| 17 | ధ3 | 32/52 | 19.7 | 877.5 | 841 | 54 | | |
| 18 | ని1 | 31/52 | 19.1 | 905.8 | 895 | 54 | | |
| 19 | ని2 | 30/52 | 18.5 | 936 | 952 | 57 | | |
| 20 | స1 | 29/52 | 17.8 | 968.3 | 1011 | 59 | | |
| 21 | స2 | 28/52 | 18.2 | 1002.9 | 1072 | 61 | | |
| 22 | స3 | 27/52 | 16.6 | 1040 | 1135 | 63 | | |
| 23 | స4 | 25/52 | 16.0 | 1080 | 1200 | 65 | | |

## (4) ద్వావింశతి శ్రుతులు : Mr. K. B. దేవాలుగారి యభిప్రాయము.

| సంఖ్యలు. | స్వరనామములు. | స్థాన భిన్నములు. | 32 అంగుళముల తంత్రిలో స్వరముల స్థానములు. | సం. 540 తో స్వర స్వరముల కంపన సంఖ్యలు. | సెంట్లు. | అంతర సెంట్లు. | ర. ప్ర. అం. సెంట్లు. | గ్రంథకర్త యభిప్రాయము. |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | స | 1 | 32 | 540 | | | రత్నాకర ప్రకారము స్వరముల మధ్యనుండు అంతరములు 54, 54½. | మన్నవ తాను బహుమూల నాగోజిరావుగారి యభిప్రాయములో సెంట్ల వ్యత్యాసము లేదు కనబడుచున్నది యొక్క ఈ పట్టికలో కానవచ్చును. మన్నవ రావుగారి లెక్కలో 5 సెంట్లు అధికముగా యుండెను. ఈ పట్టికలో 2 సెంట్లు అధికముగా నున్నది. శ్రుతిస్థానములకు తదితరమైన స్థానములలో నీ యుభయుల యభిప్రాయములను వ్యత్యాసముగా నే యున్నది. |
| 2 | రి1 | 20/21 | 30.48 | 567 | 84 | 84 | | |
| 3 | రి2 | 15/16 | 30.00 | 576 | 112 | 27 | | |
| 4 | రి3 | 9/10 | 28.80 | 600 | 182 | 71 | | |
| 5 | గ1 | 8/9 | 28.44 | 607.5 | 204 | 22 | | |
| 6 | గ2 | 27/32 | 27.00 | 640 | 294 | 90 | | |
| 7 | మ1 | 5/6 | 26.60 | 648 | 316 | 22 | | |
| 8 | మ2 | 4/5 | 25.60 | 675 | 386 | 71 | | |
| 9 | మ3 | 64/81 | 25.28 | 683 437 | 408 | 22 | | |
| 10 | మ4 | 16/21 | 24.38 | 708.45 | 471 | 63 | | |
| 11 | ప1 | 3/4 | 24.00 | 720 | 498 | 27 | | |
| 12 | ప2 | 32/45 | 22.76 | 759.375 | 590 | 92 | | |
| 13 | ప3 | 45/64 | 22.50 | 768 | 610 | 20 | | |
| 14 | ప4 | 2/3 | 21.33 | 810 | 702 | 92 | | |
| 15 | ధ1 | 40/63 | 20.32 | 850.5 | 786 | 84 | | |
| 16 | ధ2 | 5/8 | 20.00 | 864 | 814 | 27 | | |
| 17 | ధ3 | 3/5 | 19.20 | 900 | 884 | 71 | | |
| 18 | ని1 | 16/27 | 18.96 | 911.25. | 906 | 22 | | |
| 19 | ని2 | 9/16 | 18.00 | 960 | 996 | 90 | | |
| 20 | స1 | 5/9 | 17.07 | 972 | 1018 | 22 | | |
| 21 | స2 | 8/15 | 17.78 | 1012.5 | 1088 | 71 | | |
| 22 | స3 | 128/243 | 16.86 | 1025.15625 | 1110 | 22 | | |
| 23 | స4 | 1/2 | 16.00 | 1080 | 1200 | 90 | | |

(5) 22 శ్రుతులు : (Mr. E. Clements, I. C. S) ఇ. క్లెమెంట్సు గారి యభిప్రాయము.

| సంఖ్యలు. | స్వరనామములు. | స. 1 గా నున్న స్వరము లకు గల నిష్పత్తులు. | 32 అంగుళముల తీగెలో శ్రుతులకు స్థానములు. | స. 240 గా నున్న శ్రుతుల కంపనసంఖ్యలు. | సెంట్సులు. | సెంట్సు భేదములు. | [illegible] | ప్రొఫెసరు గారి అభిప్రాయము. |
|---|---|---|---|---|---|---|---|---|
| | స | 1 | 32 | 240 | | | 54·54½ [illegible] | [illegible] |
| 1 | ర1 | 20/21 | 30.48 | 252 | 84 | 84 | | |
| 2 | ర2 | 15/16 | 30 | 256 | 112 | 27 | | |
| 3 | ర3 | 9/10 | 28.80 | 266.67 | 182 | 71 | | |
| 4 | ర4 | 8/9 | 28.44 | 270 | 203 | 22 | | |
| 5 | గ1 | 27/32 | 27 | 284.44 | 294 | 90 | | |
| 6 | గ2 | 5/6 | 26.67 | 288 | 316 | 22 | | |
| 7 | గ3 | 4/5 | 25.6 | 300 | 386 | 71 | | |
| 8 | గ4 | 64/81 | 25.28 | 303.75 | 408 | 22 | | |
| 9 | మ1 | 16/21 | 24.38 | 315 | 471 | 63 | | |
| 10 | మ2 | 3/4 | 24 | 320 | 498 | 27 | | |
| 11 | మ3 | 20/27 | 23.70 | 324 | 520 | 22 | | |
| 12 | మ4 | 32/45 | 22.76 | 337.50 | 590 | 71 | | |
| 13 | మ5 | 45/64 | 22.50 | 341.33 | 610 | 20 | | |
| 14 | ప | 2/3 | 21.33 | 360 | 702 | 92 | | |
| 15 | ధ1 | 40/63 | 20.32 | 378 | 780 | 84 | | |
| 16 | ధ2 | 5/8 | 20 | 384 | 814 | 27 | | |
| 17 | ధ3 | 3/5 | 19.20 | 400 | 884 | 71 | | |
| 18 | ధ4 | 16/27 | 18.96 | 405 | 906 | 22 | | |
| 19 | ని1 | 4/7 | 18.29 | 420 | 969 | 66 | | |
| 20 | ని2 | 9/16 | 18 | 426.67 | 996 | 27 | | |
| 21 | ని3 | 5/9 | 17.78 | 432 | 1018 | 22 | | |
| 22 | ని4 | 8/15 | 17.07 | 450 | 1088 | 71 | | |
| 23 | ని5 | 135/256 | 16.88 | 455.11 | 1108 | 20 | | |
| 24 | సె | 1/2 | 16 | 480 | 1200 | 92 | | |

తంజావూరి సుబ్రహ్మణ్య శాస్త్రిల యభిప్రాయము.

షడ్జ పంచమభావ ప్రకారముగ, ఒక స్థాయిలో 53 శ్రుతు లున్నవని వీరి నవీనాభిప్రాయము. శ్రుతుల నెట్లు నవీనముగ స్థాపనము జేసినారో, అట్లే వానికి నామములను కల్పించియున్నారు. వీరు వీరి నూతనమైన యభి

ప్రాయమును సిద్ధాంతము చేయుటకై పూర్వగ్రంథ సమ్మతములైన శ్లోకములను కొన్నితావులలో మార్చియున్నారు. వీరి యభిప్రాయము శ్రుతుల విషయమైన చర్చలో నొకవిధముగ నుండలేదు. ఈ విషయము వీరు తంజావూరి సంగీతసభలోఁ జదివియున్న వ్యాసములను జూచినవారికి స్పష్టమగును. వానిని గ్రంథ విస్తరభీతిచే నిచట వ్రాయలేదు. అయినను, వీరి యభిప్రాయమును దెలిపెడి కొన్ని నియమముల నీ దిగువఁ జూడుఁడు :

(6) ద్వావింశతి శ్రుతులు: బ్రహ్మశ్రీ, సుబ్రహ్మణ్య శాస్త్రిలవారి యభిప్రాయము.

| సంఖ్యలు. | స్వరనామములు. | స 1 అగుచో స్వరస్థానములు. | 32 అంగుళముల తంత్రిపై స్వరస్థానములు. | స. 240 అగుచో కంపన సంఖ్యలు. | సెంటులు. | అంతర సెంటులు. | ర. శ్రు. సెంటులు. | గ్రంథకర్త యభిప్రాయము. |
|---|---|---|---|---|---|---|---|---|
| | స | 1 | 32 | 240 | | | | |
| 1 | రి1 | 80/81 | 31.60 | 243 | 22 | 22 | సంగీతరత్నాకర ప్రకారముగ నుండవలసిన అంతర సెంటులు 54.54½. | |
| 2 | రి2 | 15/16 | 30 | 256 | 112 | 90 | | |
| 3 | రి3 | 25/27 | 29.63 | 259.2 | 133 | 21 | | |
| 4 | గ1 | 8/5 | 28.44 | 270 | 204 | 71 | | |
| 5 | గ2 | 640/729 | 28.09 | 273.375 | 225 | 21 | | ఇందు గసంబంధియుండు శ్రుతులలో కొన్ని శాస్త్రిలవారి స్వకల్పనములు, కొన్ని ఆంగ్లేయ తత్త్వశాస్త్రులైన పైతాగరస్సు, వాట్సన్ మొదలగువారల పద్ధతి ననుసరించినవి. ఈ పద్ధతి సమ అంతరములను బడసినదిగాదు. కనుక సంగీతరత్నాకర మత ద్వావింశతి శ్రుతుల పద్ధతి కానేరదు. |
| 6 | మ1 | 5/6 | 26.67 | 288 | 316 | 71 | | |
| 7 | మ2 | 64/81 | 25.28 | 303.75 | 408 | 92 | | |
| 8 | మ3 | 32/41 | 24.98 | 307.5 | 429 | 21 | | |
| 9 | మ4 | 3/4 | 24 | 320 | 498 | 69 | | |
| 10 | ప1 | 20/27 | 23.70 | 324 | 520 | 22 | | |
| 11 | ప2 | 45/64 | 22.50 | 341.33 | 610 | 90 | | |
| 12 | ప3 | 25/36 | 22.22 | 345.6 | 631 | 21 | | |
| 13 | ప4 | 2/3 | 21.33 | 360 | 702 | 71 | | |
| 14 | ధ1 | 160/243 | 21.07 | 364.5 | 723 | 21 | | |
| 15 | ధ2 | 5/8 | 20 | 384 | 314 | 91 | | |
| 16 | ధ3 | 50/81 | 19.75 | 388.8 | 835 | 21 | | |
| 17 | ని1 | 16/27 | 18.96 | 405 | 906 | 71 | | |
| 18 | ని2 | 1280/2187 | 18.73 | 410.063 | 927 | 21 | | |
| 19 | స1 | 5/9 | 17.78 | 432 | 1018 | 91 | | |
| 20 | స2 | 128/243 | 16.85 | 455.565 | 1110 | 92 | | |
| 21 | స3 | 64/123 | 16.65 | 461.25 | 1131 | 21 | | |
| 22 | సీ4 | 1/2 | 16 | 480 | 1200 | 69 | | |

బ్రహ్మశ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిలుగారు షడ్జపంచమ భావ ప్రకార ముగ, ఒక స్థాయిలో 53 శ్రుతులున్నవని చెప్పియున్నారు. ఈ 53 శ్రుతుల పద్ధతిని పరీక్షించుటకు మునుపు, ''షడ్జపంచమ భావము'', ''షడ్జమధ్యమ భావము'' అను నీ రెండు క్రమములను మనము తెలిసికొనవలయును. వానిని నీ దిగువ వివరించెదను :

షడ్జపంచమ భావము.

ఒక తంత్రీవాద్యమునందలి షడ్జతంత్రిని మీటునపుడు, ఆ షడ్జ తంత్రిలోనే సూక్ష్మముగ అంతరగాంధార, పంచమ, తారషడ్జములు పలుకుచున్నవనియును, అట్లు వచ్చు స్వరములు సంపూర్ణైకమత్య స్వరము లనియును ఇదివఱకే చెప్పఁబడినది. షడ్జ పంచమములు సమగ్రమైన హార్మొనిగల స్వరములుగ నుండుటవలన షడ్జ పంచమ భావ ప్రకారము మనకు లభ్యమగునట్టి యన్నిస్వరములును పూర్ణమగు హార్మొని గలవియై, గానయోగ్యములై యుండుననుటకు సందియము లేదు. ఈ షడ్జ పంచమ భావము ఆరోహణక్రమములో లెక్కఁ జేయఁదగినది. షడ్జమునకు 14.వ శ్రుతిలో పంచమ మున్నది ; కనుక షడ్జమమునకును పంచమమునకును మధ్యలో 12 శ్రుతులున్నవి. 12 శ్రుతులను మధ్యప్రదేశమునందు గల స్వరములు వాది సంవాది స్వరము లనంబరగును. వాది సంవాది స్వర ములు సంపూర్ణమైన హార్మొని గలిగినయవి. ఇట్లు వాది సంవాదిగ 22 శ్రుతులను ప్రస్తరించునపుడు 13 స్థాయిలలో ప్రస్తారము ముగించి 22 శ్రుతులు మనకు లభ్యమగును.

ప్రస్తరించు క్రమము:—ఆధారషడ్జమునకు సరియైన పంచమమును కనిపెట్టవలయును. తరువాత, ఆ పంచమమునే షడ్జముగఁ దలఁచి దాని యందలి పంచమమును గనిపెట్టవలయును. ఇదియే ప్రస్తారక్రమము. ఈ ప్రస్తారక్రమము ప్రక్కపుటయందలి పథకములోఁ జూడుఁడు :

## షడ్జపంచమ భావముగ ప్రస్తరించు క్రమమును జూపెడి పథకము.

| ప్రస్తారసంఖ్యలు. | శ్రుతుల సంఖ్యలు. | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| 1 | | | | | | | | | | | | | ప1 | | | | | | | | | |
| 2 | | | | ప2 | | | | | | | | | | | | | ప3 | | | | | |
| 3 | | | | | | | | ప4 | | | | | | | | | | | | | ప5 | |
| 4 | | | | | | | | | | | | ప6 | | | | | | | | | | |
| 5 | | | ప7 | | | | | | | | | | | | | ప8 | | | | | | |
| 6 | | | | | | | ప9 | | | | | | | | | | | | | ప10 | | |
| 7 | | | | | | | | | | | ప11 | | | | | | | | | | | |
| 8 | | ప12 | | | | | | | | | | | | | ప13 | | | | | | | |
| 9 | | | | | | ప14 | | | | | | | | | | | | | ప15 | | | |
| 10 | | | | | | | | | | ప16 | | | | | | | | | | | | |
| 11 | ప17 | | | | | | | | | | | | | ప18 | | | | | | | | |
| 12 | | | | | ప19 | | | | | | | | | | | | | ప20 | | | | |
| 13 | | | | | | | | | ప21 | | | | | | | | | | | | | ప22 |

## షడ్జమధ్యమ భావము.

పైని చెప్పిన షడ్జపంచమ భావ పద్ధతిలో షడ్జమును మీటినపుడు అంతరగాంధార పంచమ తారషడ్జములు స్వేచ్ఛగానే పలుకుచున్నవని చెప్పఁబడియున్నది. షడ్జములోనే పంచమము పుట్టినందువలన షడ్జమును ఆధారముగ నుంచుకొని పంచమమును కనిపెట్టి ఆరోహణక్రమములో ప్రస్తరించితిమి. ఇపుడు షడ్జములో పంచమము పుట్టినట్టు మధ్యమము పుట్టలేదు. అటులుండునపుడు షడ్జమధ్యమ భావము నెందుచేత నైకమత్య భావముగ స్వీకరింపవలయు నను విషయము చర్చింపఁ దగినదే. ఒక స్వరమునకును, మఱియొక స్వరమునకును, ఆరోహణమునందు, ఐకమత్య ముండినచో, అవరోహణమునందును ఐకమత్య మున్నదనుట కెంతయు సందియములేదు. ఇట్టి ఐకమత్యము షడ్జమధ్యమ భావమునకున్నది. ఎట్లనిన, (పస) అని పంచమముతో తారషడ్జము చేరునపుడు సంపూర్ణమైన ఐకమత్య మున్నదను విషయ మిదివఱకే చెప్పఁబడియున్నది. ఇపుడు మధ్యపంచమమును షడ్జముగఁ దలఁచినచో తారషడ్జము దానికి శుద్ధమధ్యమమగుచున్నది. కనుక, "(పస=సమ)" పంచమ షడ్జములకు గల యనుగుణ్యము షడ్జ శుద్ధమధ్యమములకు నున్నదని స్పష్టమగును. మఱియు, తారషడ్జమును మధ్యమముగ నెంచునపుడు మధ్యపంచమము దానికి ఆధార షడ్జముగఁ బలుకును. అందుచేత మధ్యమములో నుండి షడ్జము అవరోహణముగఁ బుట్టుచున్నది. ఈ విధిని అనుసరించి షడ్జ మధ్యమ భావమును అవరోహణముగ గుణింపవలయునని పెద్దలు చెప్పియున్నారు.

షడ్జమునకు పదియవ శ్రుతిలో శుద్ధమధ్యమము పుట్టుచున్నది; కనుక, షడ్జమునకును మధ్యమమునకును మధ్యలో 8 శ్రుతులున్నవి. పైని చెప్పిన షడ్జ పంచమ భావ పద్ధతిలో 12 శ్రుతులను మధ్యప్రదేశమునందు గల స్వరములు వాది సంవాదులని చెప్పియున్నాను. అటులనే 8 శ్రుతులను మధ్యప్రదేశమునందుఁ గల స్వరములును వాది సంవాదు లగుచున్నవి. ఈ షడ్జ మధ్యమ భావ ప్రస్తారము 9 స్థాయిలో పూర్తిఁజెందును. ఈ క్రమము ప్రక్కపుటయందలి పథకములోఁ జూడుఁడు :

## షడ్జపంచమ భావముగ ప్రస్తరించు క్రమమును జూపెడి పథకము.

| స్థాయిసంఖ్యలు. | శ్రుతుల సంఖ్యలు. | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| 1 | | | | | | | | | మ 1 | | | | | | | | | మ 2 | | | | |
| 2 | | | | | మ 3 | | | | | | | | | మ 4 | | | | | | | | |
| 3 | మ 5 | | | | | | | | | మ 6 | | | | | | | | | మ 7 | | | |
| 4 | | | | | | మ 8 | | | | | | | | | మ 9 | | | | | | | |
| 5 | | మ 10 | | | | | | | | | మ 11 | | | | | | | | | మ 12 | | |
| 6 | | | | | | | మ 13 | | | | | | | | | మ 14 | | | | | | |
| 7 | | | మ 15 | | | | | | | | | మ 16 | | | | | | | | | మ 17 | |
| 8 | | | | | | | | మ 18 | | | | | | | | | మ 19 | | | | | |
| 9 | | | | మ 20 | | | | | | | | | మ 21 | | | | | | | | | మ 22 |

పైని చెప్పిన షడ్జపంచమ భావ ప్రకారముగ, ఒక స్థాయిలో 53 శ్రుతులున్నవని బ్రహ్మశ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిలుగారు జెప్పుచున్నారు. రత్నాకర పద్ధతిని యనుసరించి లెక్కచేయునపుడు షడ్జపంచమభావ ప్రకారముగ 22-వ శ్రుతి, 13-వ స్థాయిలో 22-వ స్థానములో సంపూర్తి యగుచున్నదను విషయము, పైని గనఁబఱచియుండు షడ్జపంచమ భావ పథకములో స్పష్టమగుచున్నది. ఈ తీరుననే 53 శ్రుతులను ప్రస్తరించునపుడు 53-వ శ్రుతిలో స్థాయి సంపూర్తిని చెందవలయును. అట్లు లేనియెడల ఈ పద్ధతి సరికాదు. సుబ్రహ్మణ్యశాస్త్రిలగారి 53 శ్రుతులను ప్రస్తరించునపుడు అవి 32-వ స్థాయిలో 5-వ శ్రుతిలోనే సంపూర్తిని చెందును.

మఱియు షడ్జమధ్యమభావ ప్రకారముగ 22 శ్రుతులు 9-వ స్థాయి 22-వ శ్రుతిలో ముగించును. ఇందులకు నుదాహరణమును పైఁ గనఁబఱచి

యున్న షడ్జ మధ్యమ భావ పథకములో జూడుడు.

గారి షడ్జమధ్యమ భావమువలనఁ గలిగెడి 53 శ్రుతులను ప్రస్తరించునపుడు అవి 22-వ స్థాయిలో 15-వ శ్రుతిలోనే ముగించును. (Professor Helmholtz) ప్రొఫెసర్ హెమ్హోల్ట్జును, మిస్టర్ బెసాన్క్వే చెప్పిన కొన్ని పద్ధతుల ననుసరించి శాస్త్రిలుగారు, ఈ 53 శ్రుతులను లెక్కచేయ నారంభించినారని తెలియుచున్నది. ఇది సరియైన పద్ధతి కాదు.

శ్రుతులవిషయమై మిస్టర్ సహస్రబుద్ధిగారి యభిప్రాయము 1, ఆర్. ఎస్. యం. ఠాకూరిగారి యభిప్రాయము 1, చిన్నసామి మొదలియారి యభిప్రాయము 1, ఆంగ్లేయ శైటానిక్ స్కేలు పద్ధతి 1, మిస్టర్ క్లెమెన్సు గారి పద్ధతులు 2, మిస్టరు దేవాలుగారి పద్ధతి 1, మిస్టర్ నాగోజిరావు గారి పద్ధతి 1, బ్రహ్మశ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిలగారి యభిప్రాయములు 5, బ్రహ్మశ్రీ పంచాపగేశ భాగవతుల పద్ధతి 1, మిస్టర్. ఎస్. మాణిక్య మొదలి యారి పద్ధతి 1, మిస్టర్ పి. ఆర్. భండార్కర్‌గారి యభిప్రాయములు 3, బ్రహ్మశ్రీ ప్రతాప రామస్వామిభాగవతుల యభిప్రాయము 1. అంత మొత్తము 19గురి యభిప్రాయములను గుణించి రత్నాకర కారుని యభిప్రాయముతో పరీక్షించుటకై, "కరుణామృత సాగరము" అను గ్రంథములో మిస్టర్ ఏబ్రహాం పండితులుగారు, ఒక పట్టికను(స్టేటుమెంటు నెం. 50) సిద్ధపఱచి అచ్చొత్తించి యున్నారు. అందులో వారివారి యభిప్రాయ ప్రకారముగ శ్రుతులను లెక్కచేయునపుడు 1 స్థాయిలో 158 వ్యత్యాసములైన స్థానములలో వీరల నానావిధాభిప్రాయము లున్నయవి. ఒక స్థాయిలో 22 శ్రుతులను స్థాపనము చేయుటకై ప్రయత్నించిన వీరలకు 158 వ్యత్యాసములైన స్థానములు కావలసి వచ్చెనేని, ద్వావింశతి శ్రుతులను నిశ్చయించుటకై వీరు చేసిన ప్రయత్నములును, ఆప్రయత్నములలో వీరలకుఁ గలిగిన పరాపజయములను నేమని చెప్పవచ్చును. ఇందులో రత్నాకర కారునియభిప్రాయమును గ్రహించి శ్రుతులను లెక్కచేసిన వారెవరును లేరని నిస్సందేహముగ తెలియు చున్నది. ఈ వివరములను గ్రంథవిస్తరభీతిచే నిచ్చుట వ్రాయలేదు. పైని చెప్పిన వారలలో నొక్కరైనను శార్ఙ్గదేవుల "ద్వ్యగుణశ్చోత్తరోత్తరః" అను సూత్ర రహస్యమును చక్కఁగ గ్రహించి శ్రుతులను నిశ్చయించుటకై ప్రయత్నించినవారు కారు.

రత్నాకర ప్రకారముగ ద్వావింశతి శ్రుతు లుండవలసిన విధమును కరుణామృత సాగర ప్రకారముగ ప్రక్క-పుటమొదలి పథకములో జూడుడు.

## (7) రత్నాకరోక్త ద్వావింశతి శ్రుతులం జూపెడి పథకము.

| శ్రుతుల సంఖ్యలు. | స్వర నామములు. | సంవర్గమానములు. | సంవర్గ మాన సంఖ్యలు. | సం. 540 తీవనముల స్వరములకు తీవనసంఖ్యలు. | ఒక్క 1 గా స్వరములకు పొడవులు. | 32 అంగుళముల తీగలో స్వరములకు స్థానములు. | శ్రుతులకు అంతరములు. | శ్రుతులకు సెంట్సులు. | అంతర సెంట్సులు. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 0 | స1 | 0 | 1.000000 | 540 | 1.0000000 | 32.000000 | | 0 | 54.54½ |
| 1 | స2 | .01368318 | 1.032008 | 557.28432 | 0.9689844 | 31.[illegible]07501 | .9925 | 45.55 | 54.54½ |
| 2 | స3 | .02[illegible]366[illegible]6 | 1.065041 | 575.12268 | 0.938931[illegible] | 30.045792 | .9617 | 109.09 | 54.54½ |
| 3 | స4 | .04104955 | 1.099131 | 593.53128 | 0.9098095 | 29.113904 | .9319 | 163.64 | 54.54½ |
| 4 | రి1 | .05473273 | 1.134313 | 612.52848 | 0.8815912 | 28.210918 | .9030 | 218.18 | 54.54½ |
| 5 | రి2 | .06841591 | 1.17062 | 632.1348 | 0.8542482 | 27.335942 | .8750 | 272.73 | 54.54½ |
| 6 | రి3 | .08009909 | 1.208086 | 652.3686 | 0.8277522 | 26.488102 | .8478 | 327.27 | 54.54½ |
| 7 | గ1 | .095782[illegible]7 | 1.246758 | 673.2493 | 0.8020800 | 25.666560 | .8215 | 381.82 | 54.54½ |
| 8 | గ2 | .10946545 | 1.286665 | 6[illegible]4.8000 | 0.772029 | 24.870493 | .7916 | 436.36 | 54.54½ |
| 9 | మ1 | .12314864 | 1.327849 | 717.0379 | 0.7530978 | 24.099130 | .7714 | 490.91 | 54.54½ |
| 10 | మ2 | .13683182 | 1.370351 | 739.989 | 0.7297400 | 23.351680 | .7474 | 545.45 | 54.54½ |
| 11 | మ3 | .15051500 | 1.414214 | 763.67556 | 0.7071068 | 22.827418 | .7643 | 600 | 54.54½ |
| 12 | మ4 | .16419818 | 1.45948 | 788.1192 | 0.6851755 | 21.925616 | .7018 | 654.55 | 54.54½ |
| 13 | ప1 | .1778813[illegible] | 1.506196 | 813.34584 | 0.6639245 | 21.245584 | .6800 | 709.09 | 54.54½ |
| 14 | ప2 | .19156455 | 1.554406 | 839.37924 | 0.6433325 | 20.586640 | .6589 | 763.64 | 54.54½ |
| 15 | ప3 | .20524773 | 1.604160 | 866.2464 | 0.6233790 | 19.948128 | .6385 | 818.18 | 54.54½ |
| 16 | ప4 | .21893091 | 1.655507 | 893.97[illegible]2 | 0.6040447 | 19.329430 | .6187 | 872.73 | 54.54½ |
| 17 | ధ1 | .23261409 | 1.708457 | 922.5878 | 0.5853100 | 18.729920 | .5995 | 927.27 | 54.54½ |
| 18 | ధ2 | .2462972[illegible] | 1.763182 | 952.1183 | 0.5671563 | 17.149000 | .5809 | 981.82 | 54.54½ |
| 19 | ధ3 | .25998045 | 1.819[illegible]19 | 982.5948 | 0.5495656 | 17.5[illegible]6099 | .5629 | 1036.36 | 54.54½ |
| 20 | ని1 | .27366364 | 1.877862 | 1014.04548 | 0.5325206 | 17.040659 | .5454 | 1090.91 | 54.54½ |
| 21 | ని2 | .28734682 | 1.937968 | 1046.50272 | 0.5160040 | 16.512118 | .5285 | 1145.45 | 54.54½ |
| 22 | స | .30103000 | 2.000000 | 1080.00000 | 0.5000000 | 16.000000 | .5121 | 1200 | |

## (8) రత్నాకరోక్త ద్వావింశతి శ్రుతులను జూపెడి పటకము.

| సంఖ్యలు. | స్వరనామములు. | [illegible] శ్రుతులు. | 32 అంగుళముల తంత్రిమీద [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | స | స | 32 | .0000 | 0 | | | [illegible] |
| 2 | రి1 | | 31.01 | .9690 | 55 | 55 | | |
| 3 | రి2 | | 30.05 | .9380 | 10[illegible] | 51 | | |
| 4 | రి3 | రి | 29.11 | .90[illegible]8 | 1[illegible] | 5[illegible] | [illegible] | |
| 5 | గ1 | | 28.21 | .881[illegible] | 21[illegible] | 54 | | |
| 6 | గ2 | గ | 27.34 | .8543 | 273 | 5[illegible] | | |
| 7 | మ1 | | 26.49 | .8278 | [illegible] | [illegible] | | |
| 8 | మ2 | | 25.67 | .8021 | 382 | 55 | | |
| 9 | మ3 | | 24.87 | .7772 | 436 | 51 | | |
| 10 | మ4 | మ | 24.10 | .7531 | 491 | 55 | | |
| 11 | ప1 | | 23.35 | .7297 | 545 | 54 | | |
| 12 | ప2 | | 22.[illegible]3 | .7071 | 600 | 55 | | |
| 13 | ప3 | | 21.93 | .6852 | 655 | 54 | | |
| 14 | ప4 | ప | 21.25 | .6630 | 709 | 55 | | |
| 15 | ధ1 | | 20.59 | .6433 | 764 | 55 | | |
| 16 | ధ2 | | 19.95 | .6234 | [illegible] | 54 | | |
| 17 | ధ3 | ధ | 19.33 | .6040 | [illegible]73 | 55 | | |
| 18 | ని1 | | 18.73 | .5853 | [illegible] | 54 | | |
| 19 | ని2 | ని | 18.15 | .5672 | [illegible] | 55 | | |
| 20 | స1 | | 17.59 | .5496 | 1036 | 54 | | |
| 21 | స2 | | 17.04 | .5323 | 1091 | 55 | | |
| 22 | స3 | | 16.51 | .5160 | 1145 | 54 | | |
| 23 | స4 | స | 16 | .5000 | 1200 | 55 | | |

సంగీత శాస్త్ర సంబంధమైన ప్రక్రియను మనకు లభ్యమైయుండు గీర్వాణభాషా గ్రంథము లన్నిటిలోను చాల పురాతనమైనది భరతాచార్యుల నాట్యశాస్త్ర మొకటియే యనియును, ఆ గ్రంథము సుమారు 1500 సంవత్సరములకు పూర్వము రచింపఁబడినట్లు తెలియుచున్న దనియును, పూర్వమే చెప్పియున్నాఁడను. సంగీతరత్నాకరకారుఁడును తన

గ్రంథమును భరతాచార్యుల ననుసరించియే వ్రాసియున్నాఁ డనియును తెలి యుచున్నది. సుమారు 300 సంవత్సరములకు మునుపుఁడిన అహోబిలుడు, పైనిచెప్పిన భరతాచార్యుఁడు, శార్ఙ్గదేవుఁడు వీరి పద్ధతులలో చెప్పని యంశ మైన వీణలలో స్వరములకు తంత్రికొలతలను చెప్పినపుడు, తంత్రియొక్క 3/4 నిడివిలో మధ్యమము బుట్టుచున్నదనియును, 1/3 నిడివిలో పంచమము బుట్టుచున్నదనియును చెప్పియున్నాఁడు. "3/4 మ, 1/3 ప" అను నీ పద్ధ తులు భరతాచార్యుఁడు, శార్ఙ్గదేవుఁడు వీరలచేఁ జెప్పఁబడక పోయినను ఇది మన దేశమున గల చాల పురాతన పద్ధతిలో చేరినవియే యనుటకు సందేహము లేదు. ఎట్లనిన, సుమారు 2500 సంవత్సరములకు మునుపు హైందవ శాస్త్రోక్తంబులైన యనేక విషయములను దెలిసికొనుటకై, "ఇండియా" దేశమునకు వచ్చియుండిన గ్రీసుదేశపు తత్త్వశాస్త్రియైన పితాగొరస్, (Pythagoras, the well-known Greek Philosopher) ఇంచుమించుగ, "3/4 మ, 1/3 ప" అను పద్ధతులను చెప్పియున్నాఁడు. ఈ పితాగొరస్ కాలమునుండి ఇదివఱకును యూరోపావారి సంగీతమునం దీ పద్ధతులు నెలకొనియున్నవి.

పైనిచెప్పిన కారణముల వలన భరతాచార్యుల కాలమునకు 100 సంవత్సరములకు మును పే మన హైందవ సంగీతము అత్యున్నత పదం బుల నుండినదని తెలియుచున్నది.

శార్ఙ్గదేవుఁడు రత్నాకరమును వ్రాసినపుడు ఇతఁడు అనేక పూర్వ గ్రంథముల రహస్యంబుల నెఱిఁగియే తనగ్రంథమును వ్రాసినాఁడని తెలి యుచున్నది. ఇందులకు ఇతఁడు చెప్పియున్న 22 శ్రుతులే సాక్షియగును.

శార్ఙ్గదేవుని 22 శ్రుతుల క్రమము ననుసరించి లెక్కనుచేయునపుడు శుద్ధమధ్యమము 491 సెంట్సులుగాను, పంచమము 709 సెంట్సులుగాను వచ్చు చున్నవి. "3/4 మ, 1/3 ప" అను పద్ధతుల ప్రకారముగ శుద్ధమధ్యమము 497 సెంట్సులుగాను, పంచమము 702 సెంట్సులుగాను వచ్చుచున్నవి. మఱియు, సప 1/3 గాను, సమ 3/4 గాను లెక్కచేయునపుడు 'సప' ప్రకా రముగఁ జేయు లెక్క ఒకస్థాయికి కొంచె మధికముగాను, 'సమ' పద్ధతియైన లెక్క ఒకస్థాయికి కొంచెము తక్కువగాను ముగించుచున్నది. రత్నాకర

పద్ధతిని యనుసరించిన శ్రుతులు 22ను స్థాయిలో సరిగ మగించినను గ్రామభేదమును చేయునపుడు కొన్ని స్వరములు తమ నియత శ్రుతులనుండి తొలఁగి, గానయోగ్యంబులు గాకపోవుచున్నవి. ఈ రెండు పద్ధతులకన్న శ్లాఘ్యమైన పద్ధతిగలదా యని విచారించునపుడు అతి పురాతనమైన ద్రావిడ గ్రంథములలో (తొల్కాప్పియము, శిలప్పధికారము మున్నగునవి) ఈ శ్రుతుల పద్ధతిని కడు హృద్యముగ వెల్లడిఁజేసియున్నారు.

ఒక స్థాయిలో 12, 24, 48, 96 ఇట్లు సమశ్రుతు లుండవలయునని యును, శ్రుతులయందు సప్తస్వరములు బుట్టి వాని మూలముగ రాగములు బుట్టు పద్ధతు లివియనియును స్పష్టముగఁ జెప్పియున్నారు. పైనిచెప్పిన 12, 24, 48, 96 అను శ్రుతులు లెక్కకును సరిగానున్నవి. ఐకమత్యము గలవియై యున్నవి; ప్రకృతము మనదేశమునందు వాడుకలో నున్న రాగకళలకు యోగ్యంబులైనయవి. ఇట్టి అత్యద్భుతంబైన గానపద్ధతి సుమారు 12000 సంవత్సరములకు మునుపే దాక్షిణాత్యసంగీతమునం దనుభవమున నున్న దను విషయము చాల వింతను గొల్పుచున్నయది.

పైనిచెప్పిన ద్రావిడగ్రంథములలో, "వట్టప్పాలై" అను 24 శ్రుతుల పద్ధతిలో రెండు శ్రుతులను త్రోసి 22 శ్రుతులలో నొక గానపద్ధతిని జెప్పి యున్నారు.

ఈ ద్రావిడపద్ధతులు భరతాచార్యుని కాలమునకు 1000 సంవత్సరములకు మునుపుండినందువలనను, ఉత్తర దేశస్థులకు ద్రావిడ భాషాజ్ఞానము లేకయుండినందువలనను, ఉత్తర దేశములో నుండిన పురాతన గ్రంథములనేకములు అంతకు పూర్వమే నశించినందువలనను, ఔత్తర వాగ్గేయకారకులు, ద్రావిడపద్ధతిలో నొకటియైన, 22 శ్రుతులను లెక్కచేయునపుడు 1-వ స్థాయిలోఁ గల 24 శ్రుతులలో 22 శ్రుతులను లెక్కచేయక, స్థాయి యొకటిలో, అంతు మొత్తము శ్రుతులు 22 అనియే లెక్కచేసి నందువలన ఈ 22 శ్రుతులు గానయోగ్యంబులు గాకపోయెను.

ఈ 24 శ్రుతుల పద్ధతిని గ్రంథవిస్తరభీతిచే నిచట వ్రాయలేదు. మిస్టర్ ఏబ్రహాం పండితులుగారు వ్రాసియుండు, "కరుణామృత సాగరము" అను ద్రావిడ గ్రంథములోఁ జూడుఁడు.

---

## శ్రుతి జాతులు.

భరతాచార్యుని నాట్యశాస్త్రములో శ్రుతుల జాతులకు పేళ్లు చెప్పఁబడలేదు. రత్నాకరములో మాత్రము శ్రుతులకు నామములను చెప్పియున్నారు. ఈ శ్రుతులకుఁ గల నామములు నారదీయములోఁ జెప్పియుండునటుల నీక్రింది పారిజాతశ్లోకమువలన తెలియుచున్నది. "శ్లో॥ ద్వావింశతిశ్రుతీ నాంచ వ్యవహార ప్రసిద్ధయే । తాసాం నామాని వక్ష్యేహం నారదీయానుసారతః ॥

22 శ్రుతుల నామములను దెలిపెడి పథకము.

| సంఖ్య | శ్రుతుల నామములు. | సంఖ్య | శ్రుతుల నామములు. |
|---|---|---|---|
| 1 | తీవ్రా | 12 | ప్రీతీ |
| 2 | కుముద్వతీ | 13 | మార్జనీ |
| 3 | మన్దా | 14 | క్షితీ |
| 4 | ఛన్దోవతీ | 15 | రక్తా |
| 5 | దయావతీ | 16 | సన్దీపినీ |
| 6 | రఞ్జనీ | 17 | ఆలాపినీ |
| 7 | రతికా | 18 | మదన్తీ |
| 8 | రౌద్రీ | 19 | రోహిణీ |
| 9 | క్రోధ | 20 | రమ్యా |
| 10 | వజ్రికా | 21 | ఉగ్రా |
| 11 | ప్రసారిణీ | 22 | క్షోభిణీ |

## శ్రుతి జాతులు.

శ్రుతులు దీప్తా, ఆయతా, కరుణా, మృదూ, మధ్యా, అని ఐదుజాతులనొప్పును. అవి 22 భేదంబులై స్వరసప్తకములయందు వ్యవస్థితి గలిగియుండును.

జాతులకు చేరిన శ్రుతులఁ జూపెడి పథకము

| సంఖ్యలు. | జాతులు. | అందలి శ్రుతులు. | మొత్తము. |
|---|---|---|---|
| 1 | దీప్తా | తీవ్రా, రౌద్రీ, వజ్రికా, ఉగ్రా | 4 |
| 2 | ఆయతా | కుముద్వతీ, క్రోధీ, ప్రసారిణీ, సన్దీపినీ, రోహిణీ | 5 |
| 3 | కరుణా | దయావతీ, ఆలాపినీ, మదన్తీ | 3 |
| 4 | మృదూ | మన్దా, రతికా, ప్రీతీ, క్షితీ | 4 |
| 5 | మధ్యా | ఛన్దోవతీ, రఞ్జనీ, మార్జనీ, రక్తా, రమ్యా, క్షోభిణీ | 6 |

శ్లో॥ చతు శ్చతు శ్చతుశ్చైవ షడ్జమధ్యమపంచమాః ।
ద్వే ద్వే నిషాద గాంధారౌ త్రీస్త్రీ ఋషభధైవతౌ ॥ (సం. ర.)

తా. పైని చెప్పఁబడిన 22 శ్రుతులలో షడ్జపంచమ మధ్యమములు నాలుగేసి శ్రుతులను, ఋషభధైవతములు మూఁడేసి శ్రుతులను, నిషాదగాంధారములు రెండేసి శ్రుతులను బడసియుండును.

మఱియు, షడ్జమునకు దీప్తా, ఆయతా, మృదూ, మధ్యాజాతులందును; ఋషభమునకు, కరుణా, మధ్యా, మృదూ జాతులయందును; గాంధారమునకు దీప్తా, ఆయతా జాతులయందును; మధ్యమమునకు దీప్తా, ఆయతా, మృదూ, మధ్యాజాతులందును; పంచమమునకు మృదూ, మధ్యా, ఆయతా, కరుణా జాతులందును ; ధైవతమునకు కరుణా, ఆయతా, మధ్యా జాతులయందును; నిషాదమునకు దీప్తా, మధ్యా జాతులయందును శ్రుతులు గలిగియుండును.

శ్రుతిజాతుల విభాగ పట్టికమును నీ దిగువఁ జూచుఁడు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | స | తీవ్రా | దీప్తా | 12 | మ | [illegible] | [illegible] |
| 2 | ,, | కుముద్వతీ | ఆయతా | 13 | ,, | [illegible] | [illegible] |
| 3 | ,, | మన్దా | మృదూ | 14 | ప | [illegible] | [illegible] |
| 4 | ,, | ఛన్దోవతీ | మధ్యా | 15 | ,, | [illegible] | [illegible] |
| 5 | రి | దయావతీ | కరుణా | 16 | ,, | [illegible] | [illegible] |
| 6 | ,, | రఞ్జనీ | మధ్యా | 17 | ,, | [illegible] | [illegible] |
| 7 | ,, | రక్తికా | మృదూ | 18 | ధ | [illegible] | [illegible] |
| 8 | ,, | రౌద్రీ | దీప్తా | 19 | ,, | [illegible] | [illegible] |
| 9 | గ | క్రోధీ | ఆయతా | 20 | ,, | [illegible] | [illegible] |
| 10 | ,, | వజ్రికా | దీప్తా | 21 | ని | [illegible] | [illegible] |
| 11 | మ | ప్రసారిణీ | ఆయతా | 22 | ,, | [illegible] | [illegible] |

## స్వ ర ము.

శ్లో॥ శ్రుత్యనంతరభావీయః స్నిగ్ధోనురణనాత్మకః ।
స్వతోరంజయతి శ్రోతృ చిత్తం స స్వర ఉచ్యతే ॥ (సం. ర.)

తా. శ్రుతికి వెంటనే కలిగెడి స్నిగ్ధమైనదియును, అనురణనాత్మకమైనదియును, స్వకీయముగ రంజనమును గలదియును, శ్రోతృచిత్త సుఖావహముగ నుండునదియు నగునది స్వర మనఁబడును.

## స్వ ర నా మ ము లు.

శ్లో॥ శ్రుతిభ్యస్స్యుః స్వరాషడ్జర్షభగాంధారమధ్యమాః ।
పంచమోధైవతశ్చాథ నిషాద ఇతిసప్తతే ॥
తేషాంసంజ్ఞాః సరిగమ పధనీత్యపరామతాః ॥ (సం. ర.)

తా. శ్రుతులలోనుండి బుట్టెడి స్వరములు షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము అను సప్తకము. ఈ సప్తకమునకు, స, రి, గ, మ, ప, ధ, ని అని సంకేతాక్షరము లేర్పడియున్నవి.

### స్వరనామములకు కారణములు.

### మ తం గ మ త ము.

శ్లో॥ షణ్ణాంస్వరాణాం జనకః షడ్భిర్వాజన్యతేస్వరైః ।
షడ్భ్యోవాజాయతేంగేభ్యః షడ్జ ఇత్యభిధీయతే ॥

తా. ఋషభాదినిషాదాంత్యముగాఁ గల 6 స్వరములకును జనకస్థానముగాను, ఆఱు స్వరములను బుట్టించునదిగాను, మనుష్య శరీరములో నాసికము, కంఠము, ఉరస్సు, తాలు, జిహ్వ, దంతములు అను నీ యాఱుస్థలముల ద్వారముగాఁ బుట్టునదిగాను నుండుట చేత షడ్జమని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ ప్రాప్నోతి హృదయం శీఘ్రి మన్యస్మాదృషభః స్మృతః ।
స్త్రీ గవీషు యథా తిష్ఠ న్విభాతి ఋషభేమహాన్ ।
స్వరగ్రామే సముత్పన్నః స్వరేషు ఋషభస్తథా ॥

తా. హృదయమునందుఁ బ్రవేశించునది గనుక ఋషభ మనం బరఁగును. గోవుల సమూహములో ఋషభ మెట్లు బలవంతుఁడై యుండునో, అట్లే ఈ ఋషభము స్వర సమూహంబులో రెండవస్థానమునందు గంభీరత్వమును జెందినయది.

శ్లో॥ వాచం గానాత్మికం ధత్త ఇతి గాంధారసంజ్ఞకః ॥

తా. గాంధర్వ సుఖహేతుత్వమైనది గనుక గాంధారమని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ స్వరాణాంమధ్య మత్వాచ్చ మధ్యమస్వర ఉచ్యతే ॥

తా. సప్తస్వరములకు మధ్యస్థానమైన 4-వ స్థానమునందుఁ బుట్టుటవలన మధ్యమమని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ స్వరాంతరాణాం విస్తారం యో మిమీతే స పంచమః ।
షాడక్రమేణగణనే సంఖ్యయా పంచమోథవా ॥

తా. స్వర సప్తకములో నయిదవస్థానమునందు వచ్చుచున్నది గనుక పంచమ మనఁబడును.

శ్లో॥ ధీర్యస్యాస్తి సధీవాం స్తత్సంబంధి ధైవతశ్శ్రుతిః ।
షష్ఠస్థానే ధృతో యస్మాత్తతోఽసౌధైవతోమతః ॥

తా. ధీరసంబంధమైనదియై, ఆఱవస్థానములో వచ్చుచున్నందున ధైవత మనం బడును.

శ్లో॥ నీషీదంతిస్వరాః సర్వే నిషాదస్తేనకథ్యతే ॥

తా. సప్తస్వరములలో షడ్జాదిధైవతాంత్యమైన సకల స్వరములును ముగించు స్థానములో నుండునది గనుక నిషాదమనంబడును.

స్వరోచ్చారణములు.

శ్లో॥ మయూరచాతకచ్ఛాగ క్రౌంచకోకిలదర్దురాః ।
గజశ్చ సప్తషడ్జాదీన్క్రమాదుచ్చారయన్త్యపి ॥ (సం. ర.)

తా. మయూరము, చాతకము, ఋషభము, క్రౌంచము, కోకిలము, దర్దురము, గజము వీని ధ్వనులు వరుసగా షడ్జాది స్వరోచ్చారణములు.

గ్రంథాంతరమతములు :—

సప్తస్వర ధ్వనులు.

శ్లో॥ షడ్జంమయూరోవదతి గావోఋషభభాషిణః ।
అజావికంతుగాంధారం క్రౌంచః క్వణతిమధ్యమమ్ ॥
పుష్పసాధారణేకాలే పికఃకూజతి పంచమమ్ ।
ధైవతం హేషతేవాజీ నిషాదం బృంహతేగజః ॥

తా. నెమిలి షడ్జస్వరముఁ బలుకును; వృషభము ఋషభ స్వరమును ధ్వనించును; మేక గాంధారమును శబ్దించును; క్రౌంచము మధ్యమమును ప్రకటించును; వసంతమునందు కోకిలము పంచమ స్వరమును వెలయించును; గుఱ్ఱము ధైవతమును [illegible] సకిలించును; గజము నిషాదమును ఘీంకరించును.

సప్తస్వరకులాది విమర్శనము.

శ్లో॥ "గీర్వాణకులసంభూతాః షడ్జగాంధారమధ్యమాః ।
పంచమః పితృవంశోత్థో రిధావృషికులోద్భవౌ ॥
నిషాదోఽసురవంశోత్థో బ్రాహ్మణాస్సమపంచమాః ।
రిధౌతుక్షత్రియౌజ్ఞేయౌ వైశ్యజాతినిగౌమతౌ ॥
శూద్రావంతరకాకల్యౌ స్వరావర్ణాస్త్వమేక్రమాత్ ॥"

ఇట్లు సంగీతరత్నాకరాద్యనేక గ్రంథములలో సప్తస్వరములకు జాతి, వంశము, అధిదేవత మొదలుగాఁ గల లక్షణములను వ్రాసియున్నారు. గ్రంథ విస్తృత భీతిచే నా శ్లోకముల నిచట వ్రాయలేను. వానిని సంగ్రహించి ప్రక్క పథకములో వ్రాసియున్నాఁడను.

## సప్తస్వరముల జాత్యాదివివరములనుఁ జూపెడి పథకము.

| జాత్యాది వివరములు. | షడ్జము. | ఋషభము. | గాంధారము. | మధ్యమము. | పంచమము. | ధైవతము. | నిషాదము. |
|---|---|---|---|---|---|---|---|
| జాతి | బ్రాహ్మణ | క్షత్రియ | వైశ్య | బ్రాహ్మణ | బ్రాహ్మణ | క్షత్రియ | వైశ్య |
| వంశము | దేవ | ఋషి | దేవ | దేవ | పితృ | ఋషి | రాక్షస |
| అధిదేవత | అగ్ని | బ్రహ్మ | సరస్వతి | శివుడు | విష్ణువు | వినాయకుడు | సూర్యుఁడు |
| నక్షత్రము | శతభిష | చిత్త | ధనిష్ఠ | మఖ | ఉత్తర | పూర్వాషాఢా | అనూరాధ |
| వారము | ఆది | సోమ | మంగళ | బుధ | బృహస్పతి | శుక్ర | శని |
| ద్వీపము | జంబు | శాక | కుశ | క్రౌంచ | శాల్మలి | శ్వేత | పుష్కర |
| వృక్షము | మామిడి | ఖర్జూర | అరటి | నిమ్మ | దాడిమ | ద్రాక్ష | పొన్న |
| ఛందస్సు | అనుష్టుప్ | గాయత్రి | త్రిష్టుప్ | బృహతీ | పఙ్క్తి | ఉష్ణిక్ | జగతి |
| భోజనము | దధ్యన్నము | పాయసము | పిండివంటకము | చిత్రాన్నము | పిండి | శుద్ధాన్నము | బియ్యము |
| వస్త్రము | తెలుపు | పీతాంబరము | ఎఱుపు | నీల | పసుపు | చిత్ర | శ్యామల |
| విలేపనము | కుంకుమ | అగరు | కస్తూరి | పచ్చకర్పూరము | గోగోచనము | చందనము | కదంబపొడి |
| పుష్పము | జాజి | చంపకము | పొన్న | మల్లె | మొగలి | గన్నేరు | తామర |
| భూషణము | ముత్యము | నీలము | వజ్రము | వైడూర్యము | మరకతము | గోమేధికము | పుష్పరాగము |
| ఆయుధము | కత్తి | బాకు | గద | చక్రము | బిండిపాలము | నారాచము | అంకుశము |
| వాహనము | హంసము | సింహము | గండభేరుండము | జింక | సాళువము | చిలుక | గోరువంక |
| భార్య | గంధర్వస్త్రీ | కిన్నరస్త్రీ | యక్షస్త్రీ | కింపురుషస్త్రీ | నాగస్త్రీ | దేవస్త్రీ | రాక్షసస్త్రీ |
| దేహము | స్థూలము | సూక్ష్మము | స్థూలము | పొడుగు | సమపుష్టి | పొడుగు | అతిస్థూలము |
| రసము | రౌద్ర | వీర | కరుణా | హాస్య | శృంగార | బీభత్స | భయానక |
| సాదృశ్యధ్వని | నెమలి | ఋషభము | మేక | క్రౌంచము | కోకిలము | తురగము | గజము |

## స్వరములకు శ్రుతులు.

శ్లో॥ ప్రథమాదిచతుర్థాంతం షడ్జస్యస్థానముచ్యతే ।
పంచమాత్సప్తమాంతంచ రిషభస్యపదంవిదుః ॥
అష్టమంనవమంచాథ గాంధారస్యనికేతనమ్ ।
మధ్యమస్థానమాఖ్యాతం దశమాదాత్రయోదశమ్ ॥
చతుర్దశాత్పంచమస్తు శ్రయేత్సప్తదశావధి ।
అష్టాదశాచ్చవింశాంతం ధైవతస్థానమీరితమ్ ।
చరమేద్వేనిషాదస్య స్థానేగాయకసమ్మతే ॥

తా. మొదటినుండి నాలవశ్రుతివఱకు షడ్జస్థానములు; ఐదు మొదలు ఏడవవఱకు ఋషభస్థానములు; ఎనిమిది తొమ్మిది గాంధారస్థానములు. పదిమొదలు పదమూఁడు వఱకు మధ్యమస్థానములు; పదునాలుగు మొదలు పదునేడవఱకు పంచమస్థానములు; పదునెనిమిది మొదలు ఇరువదివఱకు ధైవతస్థానములు; ఇరువదియొకటి ఇరువదిరెండు నిషాదస్థానములు.

## నియతశ్రుతులు.

శ్లో॥ చతుర్థీనియతాషడ్జే రిషభేసప్తమీశ్రుతిః ।
నవమీకిలగాంధారే మధ్యమేచత్రయోదశీ ॥
పంచమేస్యాత్సప్తదశీ వింశీధైవతగోచరా ।
ద్వావింశీచనిషాదస్య శ్రుతయోనియతస్థితిః ॥

తా. షడ్జమునకు నాలవది. ఋషభమునకు ఏడవది. గాంధారమునకు తొమ్మిదవది. మధ్యమమునకు పదుమూఁడవది. పంచమమునకు పదునేడవది. ధైవతమునకు ఇరువదవది. నిషాదమునకు ఇరువదిరెండవది. ఇవి నియతశ్రుతులు.

## స్వర విభాగము.

శ్లో॥ శుద్ధాశ్చవికృతాశ్చేతి ప్రథమంద్వివిధాఃస్వరాః ।
నియతశ్రుతిసంపన్నాః స్వరాశ్శుద్ధా ఇతిస్మృతాః ।
శ్రుత్యుత్కృష్టాపకృష్టాస్తు వికృతాః ప్రతిపాదితాః ॥

తా. స్వరములు శుద్ధములు, వికృతములు అని రెండు విధములు. పైని నియతము లైన శ్రుతులతో కూడుకొన్న స్వరములు శుద్ధము లనంబడును. నియతములకు హెచ్చుగాని తక్కువగాని అయ్యేనేని వికృత మనఁబడును.

## వికృతస్వరముల పేళ్లు.

శ్లో॥ చ్యుతస్తథాచ్యుతషడ్జస్తథాసాధారణాంగిరా ।
అంతరోప్యథగాంధారో మధ్యమోఽపిచ్యుతాచ్యుతః ॥

త్రిశ్రుతిః కైశికశ్చాపి పంచమోథశ్చతుశ్రుతిః ।
కైశికః కాకలీచేతి నిషాదో ద్విప్రకారకః ॥

తా. చ్యుతషడ్జము, అచ్యుతషడ్జము, సాధారణ ఋషభము, సాధారణ గాంధారము, అంతర గాంధారము, చ్యుతమధ్యమము, అచ్యుత మధ్యమము, త్రిశ్రుతిపంచమము, కైశికిపంచమము, చతుశ్రుతి ధైవతము, కైశికీనిషాదము, కాకలీనిషాదము ఈ 12 ను వికృతస్వరములు.

## వికృతస్వర విమర్శనము.

శ్లో॥ తతఏవవికృతావస్థా ద్వాదశప్రతిపాదితాః ।
చ్యుతోఽచ్యుతో ద్విధాషడ్జో ద్విశ్రుతిర్వికృతోభవేత్ ॥
సాధారణ్యేకాకలీత్వే నిషాదస్యచదృశ్యతే ।
సాధారణేంశ్రుతింషాడ్జీం ఋషభశ్చేత్సమాశ్రయేత్ ॥
చతుశ్రుతిత్వమాయాతి తదేకోవికృతో భవేత్ ।
సాధారణేత్రిశ్రుతస్స్యా దంతరత్వేచతుశ్రుతిః ॥
గాంధారఇతితద్భేదా ద్వావిమ్యౌంకేనకీర్తితౌ ।
మధ్యమష్షడ్జవద్ద్వేధాం తరసాధారణాశ్రయాత్ ॥
పంచమోమధ్యమగ్రామే త్రిశ్రుతిః కైశికీపునః ।
మధ్యమస్యశ్రుతింప్రాప్య చతుశ్రుతిరితిద్విధా ॥
ధైవతోమధ్యమగ్రామే వికృతః స్యాచ్చతుశ్రుతిః ।
కైశికీకాకలీత్వేచ నిషాదస్త్రిచతుశ్రుతిః ॥
ప్రాప్నోతివికృతౌ భేదే ద్వావపిద్వాదశస్మృతాః ।
తైశ్శుద్ధైస్సభిస్తస్సార్థం భవత్యేకోనవింశతిః ॥

తా. షడ్జమునకుఁగల నాలుగు శ్రుతులలో మొదటిశ్రుతిని నిషాదమునకును నాలవ శ్రుతిని ఋషభమునకును యిచ్చి తన స్థానమునుండి చ్యుతమై ద్విశ్రుతియగుటచే నదియొక వికృతి. మొదటి రెండు శ్రుతులనుమాత్రము నిషాదమునకిచ్చి వెనుకటి రెండు శ్రుతులఁగల ధైవత స్థానమునుండి చ్యుతముకాకుండియు ద్విశ్రుతియగుటచే నదియొక వికృతి యగును. ఇట్లు ఋషభాది స్వరములు పూర్వోత్తర స్వరములకు తమ యాద్యంత శ్రుతుల నిచ్చుటచే పండ్రెండు భేదములయ్యె. అవి శుద్ధములతోచేరి పందొమ్మిది భేదంబులయ్యె. ఆ భేదముల నతి సూక్ష్మదృష్టిచే తెలియందగును.

శుద్ధవికృత స్వరములను నిశ్చయించుటకై ఒకని యభిప్రాయమును మఱియొక డనుసరింపక వారివారికి తోచినటుల చెప్పియున్నారు. రత్నాకర కారుఁడు వికృతస్వరములు 12 అనియును, పారిజాతాకారుఁడు 22 వికృత స్వరములనియును, రాగవిబోధకారుఁడు 10 వికృతులను, స్వరమేళకళానిధిలో

11 వికృతస్వరములను, చతుర్దండి ప్రకాశికలో 9 వికృతులను, సారామృతములో 10 వికృతములను చెప్పియున్నారు. శ్రుతులను చక్కఁగా పరిశీలనముచేయక గ్రామభేదములను చేసి అందు స్వరస్థానము లొకటితో నొకటి చేరకపోయినందువలన ఇట్టి వికృత భేదములు కలుగుటకు కారణమయినది. వానిని, ఈ దిగువఁ జూడుఁడు :

* ఈ గురుతులఁగలవి శుద్ధస్వర నామములనియును, గురుతులు లేనివి వికృతస్వర నామములనియు నెఱుంగునది.

## సంగీత రత్నాకర గ్రంథగత శుద్ధ వికృత స్వరములు.

| సంఖ్య. | శ్రుతుల పేళ్లు. | నియత శ్రుతులు. | స్వరముల పేళ్లు. |
|---|---|---|---|
| 1 | తీవ్రా | | కైశికీ నిషాదము. |
| 2 | కుముద్వతీ | | కాకలీ నిషాదము. |
| 3 | మన్దా | | చ్యుత షడ్జము. |
| 4 | ఛన్దోవతీ | స | శుద్ధ షడ్జము *; అచ్యుత షడ్జము. |
| 5 | దయావతీ | | |
| 6 | రఞ్జనీ | | |
| 7 | రతికా | రి | శుద్ధ ఋషభము *; వికృత ఋషభము; చతుశ్శ్రుతి ఋషభము. |
| 8 | రౌద్రీ | | |
| 9 | క్రోధీ | గ | శుద్ధ గాంధారము *. |
| 10 | వజ్రికా | | సాధారణ గాంధారము. |
| 11 | ప్రసారిణీ | | అంతర గాంధారము. |
| 12 | ప్రీతీ | | చ్యుత మధ్యమము. |
| 13 | మార్జనీ | మ | శుద్ధ మధ్యమము *; అచ్యుత మధ్యమము. |
| 14 | క్షితీ | | |
| 15 | రక్తా | | |
| 16 | సన్దీపినీ | | కైశికీ పంచమము; త్రిశ్రుతి పంచమము. |
| 17 | ఆలాపినీ | ప | శుద్ధ పంచమము *. |
| 18 | మదన్తీ | | |
| 19 | రోహిణీ | | |
| 20 | రమ్యా | ధ | శుద్ధధైవతము *; వికృతధైవతము, చతుశ్శ్రుతిధైవతము. |
| 21 | ఉగ్రా | | |
| 22 | క్షోభిణీ | ని | శుద్ధ నిషాదము *. |

* ఈ గురుతులుఁగలవి శుద్ధస్వర నామములనియును, గురుతులు లేనివి వికృతస్వర నామములనియు నెఱుంగునది.

## రాగవిబోధ గ్రంథగత శుద్ధ వికృత స్వరములు.

| సంఖ్య. | శ్రుతుల పేళ్లు. | నియత శ్రుతులు. | స్వరముల పేళ్లు. |
|---|---|---|---|
| 1 | తీవ్రా | | కైశికీ నిషాదము ; తీవ్రతమ ధైవతము. |
| 2 | కుముద్వతీ | | కాకలీ నిషాదము. |
| 3 | మన్దా | | మృదు షడ్జము. |
| 4 | ఛన్దోవతీ | స | శుద్ధ షడ్జము *. |
| 5 | దయావతీ | | |
| 6 | రఞ్జనీ | | |
| 7 | రతికా | రి | శుద్ధ ఋషభము *. |
| 8 | రౌద్రీ | | తీవ్ర ఋషభము ; చతుశ్రుతి ఋషభము. |
| 9 | క్రోధీ | గ | శుద్ధ (గ) * తీవ్రతర ఋషభము ; పంచశ్రుతి (ధ). |
| 10 | వజ్రికా | | తీవ్రతమ (రి) ; షట్శ్రుతి (రి) ; సాధారణ (గ). |
| 11 | ప్రసారిణీ | | అంతర గాంధారము. |
| 12 | ప్రీతీ | | మృదు మధ్యమము. |
| 13 | మార్జనీ | మ | శుద్ధ మధ్యమము * ; తీవ్రతమ గాంధారము. |
| 14 | క్షితీ | | తీవ్రతమ మధ్యమము. |
| 15 | రక్తా | | |
| 16 | సన్దీపినీ | | మృదు పంచమము. |
| 17 | ఆలాపినీ | ప | శుద్ధ పంచమము *. |
| 18 | మదన్తీ | | |
| 19 | రోహిణీ | | |
| 20 | రమ్యా | ధ | శుద్ధ ధైవతము. * |
| 21 | ఉగ్రా | | తీవ్ర ధైవతము ; చతుశ్రుతి ధైవతము. |
| 22 | క్షోభిణీ | ని | శుద్ధ నిషాదము * ; తీవ్రతర ధైవతము. |

* ఈ గురుతులుగలవి శుద్ధస్వర నామములనియును, గురుతులు లేనివి వికృతస్వర నామములనియు నెఱుంగునది.

## స్వరమేళకళానిధి గ్రంథగత శుద్ధ వికృత స్వరములు.

| సంఖ్య. | శ్రుతుల పేళ్లు. | నియత శ్రుతులు. | స్వరముల పేళ్లు. |
|---|---|---|---|
| 1 | తీవ్రా | | కైశికీ నిషాదము; షట్శ్రుతి ధైవతము. |
| 2 | కుముద్వతీ | | కాకలీ నిషాదము. |
| 3 | మన్దా | | చ్యుతషడ్జ నిషాదము. |
| 4 | ఛన్దోవతీ | స | శుద్ధ షడ్జము *. |
| 5 | దయావతీ | | |
| 6 | రఞ్జనీ | | |
| 7 | రతికా | రి | శుద్ధ (రి) *. |
| 8 | రౌద్రీ | | |
| 9 | క్రోధీ | గ | శుద్ధ (గ) *; పంచశ్రుతి (రి). |
| 10 | వజ్రికా | | సాధారణ (గ); షట్శ్రుతి (రి). |
| 11 | ప్రసారిణీ | | అంతర (గ) |
| 12 | ప్రీతీ | | చ్యుతమధ్యమ గాంధారము. |
| 13 | మార్జనీ | మ | శుద్ధ (మ) *. |
| 14 | క్షితీ | | |
| 15 | రక్తా | | |
| 16 | సన్దీపినీ | | చ్యుతపంచమ మధ్యమము. |
| 17 | ఆలాపినీ | ప | శుద్ధ (ప) *. |
| 18 | మదన్తీ | | |
| 19 | రోహిణీ | | |
| 20 | రమ్యా | ధ | శుద్ధ (ధ) *. |
| 21 | ఉగ్రా | | |
| 22 | క్షోభిణీ | ని | శుద్ధ (ని) *; పంచశ్రుతి (ధ). |

* ఈ గురుతులగలవి శుద్ధస్వర నామములనియును, గురుతులు లేనివి వికృతస్వర నామములనియు నెఱుంగునది.

---

## చతుర్దండి ప్రకాశిక గ్రంథగత శుద్ధ వికృత స్వరములు.

| సంఖ్య. | శ్రుతుల పేళ్లు. | నియత శ్రుతులు. | స్వరముల పేళ్లు. |
|---|---|---|---|
| 1 | తీవ్రా | | కైశికీ నిషాదము ; షట్శ్రుతి ధైవతము. |
| 2 | కుముద్వతీ | | కాకలీ నిషాదము. |
| 3 | మన్దా | | |
| 4 | ఛన్దోవతీ | స | శుద్ధ షడ్జము*. |
| 5 | దయావతీ | | |
| 6 | రఞ్జనీ | | |
| 7 | రతికా | రి | శుద్ధ (రి)*. |
| 8 | రౌద్రీ | | |
| 9 | క్రోధీ | గ | శుద్ధ (గ)* ; పంచశ్రుతి (రి) |
| 10 | వజ్రికా | | సాధారణ (గ) ; షట్శ్రుతి (రి) |
| 11 | ప్రసారిణీ | | అంతర (గ) |
| 12 | ప్రీతీ | | |
| 13 | మార్జనీ | మ | శుద్ధ (మ)* |
| 14 | క్షితీ | | |
| 15 | రక్తా | | |
| 16 | సన్దీపినీ | | వరాళి మధ్యమము ; వికృత పంచమ (మ) |
| 17 | ఆలాపినీ | ప | శుద్ధ (ప)* |
| 18 | మదన్తీ | | |
| 19 | రోహిణీ | | |
| 20 | రమ్యా | ధ | శుద్ధ ధైవతము |
| 21 | ఉగ్రా | | చతుశ్రుతి ధైవతము* |
| 22 | క్షోభిణీ | ని | శుద్ధ (ని)* ; పంచశ్రుతి (ధ) |

* ఈ గురుతులుఁగలవి శుద్ధస్వర నామములనియును, గురుతులు లేనివి వికృతస్వర నామములనియు నెఱుంగునది.

## సంగీత పారిజాతగత శుద్ధ వికృత స్వరములు.

| సంఖ్య. | శ్రుతుల పేళ్లు. | నియత శ్రుతులు | స్వరముల పేళ్లు. | | షరాలు. |
|---|---|---|---|---|---|
| | | | కోమల స్వరములు. | తీవ్ర స్వరములు. | |
| 1 | తీవ్రా | | | తీవ్ర-ని | శ్రుతులు 22-టికి [illegible] |
| 2 | కుముద్వతీ | | | తీవ్రతర-ని | |
| 3 | మన్దా | | | తీవ్రతమ-ని | |
| 4 | ఛన్దోవతీ | స | శుద్ధ-స * | | |
| 5 | దయావతీ | | పూర్వ-రి | | |
| 6 | రఞ్జనీ | | కోమల-రి | | |
| 7 | రతికా | రి | శుద్ధ-రి *; పూర్వ-గ | | |
| 8 | రౌద్రీ | | కోమల-గ | తీవ్ర-రి | |
| 9 | క్రోధీ | గ | శుద్ధ-గ * | తీవ్రతర-రి | |
| 10 | వజ్రికా | | | తీవ్ర-గ | |
| 11 | ప్రసారిణీ | | | తీవ్రతర-గ | |
| 12 | ప్రీతీ | | | తీవ్రతమ-గ | |
| 13 | మార్జనీ | మ | శుద్ధ-మ * | అతితీవ్రతమ-గ | |
| 14 | క్షితీ | | | తీవ్ర-మ | |
| 15 | రక్తా | | | తీవ్రతర-మ | |
| 16 | సన్దీపినీ | | | తీవ్రతమ-మ | |
| 17 | ఆలాపినీ | ప | శుద్ధ-ప * | | |
| 18 | మదన్తీ | | పూర్వ-ధ | | |
| 19 | రోహిణీ | | కోమల-ధ | | |
| 20 | రమ్యా | ధ | పూర్వ-ని ; శుద్ధ-ధ * | | |
| 21 | ఉగ్రా | | కోమల-ని | తీవ్ర-ధ | |
| 22 | క్షోభిణీ | ని | శుద్ధ-ని * | తీవ్రతర-ధ | |

## వాద్యాది స్వరములు.

శ్లో॥ ''చతుర్విధాః స్వరావాదీ సంవాదీచవివాద్యపి ।
అనువాదీచవాదీతు ప్రయోగేబహుళస్వరః ॥
శ్రుతయోద్వాదశాష్టౌవా యయోరంతరగోచరాః ।
మిధస్సంవాదినౌతౌస్తో రినిగావన్యావివాదినౌ ॥ (సం. ర.)
గనీవివాదినౌస్యాతాం రిధయోర్వాతుతౌతయోః ।
అనువాదీభవేచ్ఛేషా ఇతిపండితసమ్మతమ్ ॥
వాదీనృపస్తథామాత్య స్సంవాదీచవివాద్యరిః ।
నృపామాత్యానుసారిత్వా దనువాదీతుభృత్యవత్ ॥

తా. స్వరములు వాది, సంవాది, వివాది, అనువాది అని నాలుగు విధములు. అందు రాగాది నిశ్చయమును తెలిపి ప్రయోగమునందు విస్తారముగ నుండునది వాది; ఏ రెండు స్వరములకు మధ్య పండ్రెండు లేక ఎనిమిది శ్రుతు లుండునో అవి పరస్పరము సంవాదులు; తక్కినవి యనువాదులు; వాది రాజని, సంవాది మంత్రియని, వివాది శత్రువని, అనువాది భృత్యుఁడనియును చెప్పఁబడును.



ఎట్టియాపురము సంస్థానపండితులు బ్రహ్మశ్రీ సుబ్బరామ దీక్షిత విరచితంబైన ''సంగీత సాంప్రదాయ ప్రదర్శిని'' లోని
వాది, సంవాది, అనువాది, వివాదుల పద్ధతి.

శ్లో॥ ''వాదీసయః ప్రయోగే బహుళో రాజాః యయోస్తు మధ్యే స్యుః।
ద్వాదశ వాష్టౌ శ్రుతయో మాంత్యౌ సంవాదినౌతౌ స్తః ।
ఏక శ్రుత్యంతరితౌ వివాదినౌ వైరిణౌ మిథో భవతః ।
అనువాధి నస్తు శేషా భృత్యా ఇత్థం యథార్థాస్తే॥ (రాగవిబోధః)

తా. వాది: ఒక రాగమునగల అంశ స్వర [జీవస్వర] మును బోలి మాటిమాటికి నుపయోగపడుచెడి స్వరము వాది యనఁబడును. ఆ వాది రాజునకు సదృశమైనది. (2) సంవాది: రెండు స్వరములకు నడుమ నెనిమిది లేక పదిరెండు శ్రుతులుండిన ఆ రెండు స్వరములును పరస్పరము సంవాదు లనఁబడును. ఆ సంవాది వాదియైన రాజునకు మంత్రిని బోలినది.

శ్లో॥ సమౌ సపౌ రిధౌచైవ నిగౌ సంవాదినౌ మిథః ।
ఏవం శుద్ధస్వరేషూక్త స్సంవాది స్వర నిర్ణయః॥(చతుర్దండిప్రకాశిక)

తా. శుద్ధ స్వరములలో (స-మ), (స-ప), (రి-ధ), (ని-గ) ఇవి పరస్పరము సంవాదు లగును.

శ్లో॥ శుద్ధశ్చ మధ్యమ శ్శుద్ధ నిషాదశ్చే త్యుభౌస్వరౌ ।
శ్రుత్యష్టకేనాం తరితా వపి సంవాదినౌనహి ॥

తా. శుద్ధమధ్యమ శుద్ధనిషాదములు తమ నడుమ నెనిమిది శ్రుతులు గలిగియున్నప్పటికిని పరస్పరము సంవాదులు కానేరవు.

శ్లో॥ సాధారణాఖ్య గాంధార కైశికాఖ్య నిషాదయోః ।
తద్వైవాంతరకాకల్యో స్సంవాదో వికృతేష్వపి ।
శుద్ధర్షభేణ సంవాదీ వరాళీ మధ్యమ స్తథా ॥

తా. వికృతి స్వరములలో సాధారణ గాంధారమును కైశికీ నిషాదమును, అంతర గాంధారమును, కాకలీ నిషాదమును, శుద్ధ ఋషభమును, వరాళి మధ్యమమును పరస్పరము సంవాదులగును.

వివాది: రెండు స్వరముల నడుమ నొక శ్రుతియుండిన ఆ రెండు స్వరములును పరస్పరము వివాదులగును. ఆ వివాది శత్రువునకు సదృశమైనది.

శ్లో॥ రిగా ధనీ చతుర్థేషు స్వరాస్స్యాతాం వివాదినౌ ।
సాధారణాంతరౌ చైవ కైశికీకాకలీ స్వరౌ ।
మిథో వివాదినౌ జ్ఞేయౌ వికృతేషు స్వరేష్వపి ॥

తా. శుద్ధస్వరములలో (రి-గ); (ధ-ని) ఇవి పరస్పరము వివాదులగును. వికృత స్వరములలో సాధారణ గాంధారము లేక షట్ఛ్రుతి ఋషభమును, అంతర గాంధారమును; కైశికీ నిషాదము లేక షట్ఛ్రుతి ధైవతమును, కాకలీ నిషాదమును పరస్పరము వివాదులగును.

అనువాది:— వాది సంవాది వివాది కాని స్వరము అనువాది యగును. ఈ అనువాది భృత్యునివంటిది. ఈ వాది సంవాది అనువాది వివాదులను గనిపెట్టు మార్గమును యీ క్రింద నుదహరింపబడిన వీణా ప్రస్తార పథకమునం జూడుడు.

A

1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22

మీద జెప్పియుండుటను పరిశోధించిన డెబ్బదిరెండు మేళములలోనుండి గలిగెడు రాగములను పాడుటయందు, 1. శుద్ధ ఋషభమునుండి శుద్ధ గాంధారమునకు

ఎక్కుట; 2. శుద్ధగాంధారమునుండి శుద్ధ ఋషభమునకు దిగుట; 3. షట్శ్రుతి ఋషభమునుండి అంతరగాంధారమునకు ఎక్కుట; 4. అంతరగాంధారమునుండి షట్శ్రుతి ఋషభమునకు దిగుట; 5. శుద్ధధైవతమునుండి శుద్ధనిషాదమునకు ఎక్కుట; 6. శుద్ధనిషాదమునుండి శుద్ధధైవతమునకు దిగుట; 7. షట్శ్రుతి ధైవతమునుండి కాకలీ నిషాదమునకు ఎక్కుట; 8. కాకలీ నిషాదమునుండి షట్శ్రుతి ధైవతమునకు దిగుట. ఈ ఎనిమిది విధములయందును వివాది దోషములు గనఁబడుచున్నవి గావున, ఈ ఎనిమిది విధములుఁ దప్ప తక్కిన స్వరములను ఏ రీతిగా బట్టినను రంజనము చెడదు.

ఈ ఎనిమిది విధములయిన వివాది స్వర ఆరోహణ అవరోహణములు మొదటి చక్రమును చేరిన మొదటి ఆఱు మేళములందును, ఆఱవ చక్రమును జేరిన 31, 32, 33, 34, 35, 36-వ మేళములందును, ఏడవ చక్రమును జేరిన 37, 38, 39, 40, 41-వ మేళములందును, పండ్రెండవ చక్రమును జేరిన 67, 68, 69, 70, 71, 72-వ మేళములందును, ఒక్కొక్క చక్రముయొక్క మొదటిదియు కడపటిదియు నైన మేళములందును, అనఁగా మీఁదఁ జూపించిన మేళములలో 1, 6, 31, 36, 37, 42, 67, 72-వ మేళములుదప్ప తక్కిన 7, 12, 13, 18, 19, 24, 25, 30, 43, 48, 49, 54, 55, 60, 61-వ మేళములందును గనఁబడుచున్నవి. ఈ నలువది మేళములందును పాడునప్పుడు వాది వివాది లక్షణముల ననుసరించియే పాడుట సంప్రదాయముగా నున్నది. అది యెటులనిన, వివాది స్వరమును అనేకముగా వర్జించియైనను, లేక శత్రువునకు సదృశమైన వివాది స్వరమందు వాది సంవాది అనువాది స్వరములలో నేదైన నొక స్వరముయొక్క ఛాయను గమకముచే నెక్కించి (గమకములను కపటక్రియలచే) వివాదిని మిత్రునివలె జూపించియైనను పాడుట సంప్రదాయజ్ఞుల వాడుకగా నున్నది. ఇట్లు సేయనియెడల వివాది స్వర ప్రయోగముచే గానముయొక్క రంజనము చెడును. ఇవియే భరత మతంగాది మునుల మతము.

---

బ్రహ్మశ్రీ సుబ్బరామదీక్షితులుగారి వీణా ప్రస్తారపథకమును జూడుండు. సంగీత రత్నాకర గ్రంథములో నున్నటుల స్వరస్థానముల నీక్రిందఁ జూపెదను. దీక్షితులవారి పద్ధతిప్రకారముగ కాకలీ నిషాద షడ్జ అంతర గాంధార శుద్ధమధ్యమములు సరియైన స్థానములో లేవు. మఱియు శ్రుతులలో స్వరములను చెప్పుచున్నారే గాని ఆ యా శ్రుతులలో ఆ యా స్వరములు రాలేక యున్నవి. వీణలో నీ స్వరములను సమ్మేళనముఁ జేయునపుడు 12 సమ స్వరములనే జెప్పియున్నారు. 12 సమశ్రుతు లున్నయెడల వివాదులు రానేరవు. దానికి వివరముల నీ దిగువ వ్రాసెదను. అదియునుం గాక శుద్ధ ధైవత శుద్ధనిషాదములు యర్థస్వరములేగాని వివాదులు కానేరవు.

రత్నాకరప్రకారమని వాడుకలో చెప్పెడి స్వరస్థానము లించుమించుగఁ బుట్టెడి శ్రుతులనుఁ జూపెడి పధకము.

* ఈ గురుతులుగలవి గ్రంథగతములు కావు.

| సంఖ్య. | శ్రుతుల నామములు. | జాతులు. | సంకేత స్వరములు. | స్వర నామములు. |
|---|---|---|---|---|
| 1 | తీవ్రా | దీప్తా | కై-ని | కైశికీ నిషాదము ; షట్శ్రుతి ధైవతము. |
| 2 | కుముద్వతీ | ఆయతా | కా-ని | కాకలీ నిషాదము. |
| 3 | మన్దా | మృదూ | | |
| 4 | ఛన్దోవతీ | మధ్యా | స | శుద్ధ షడ్జము. |
| 5 | దయావతీ | కరుణా | | |
| 6 | రఞ్జనీ | మధ్యా | రి * | తోడి ఋషభము ; శుద్ధఋషభము. |
| 7 | రతికా | మృదూ | రి | రత్నాకరగత శుద్ధఋషభము. |
| 8 | రౌద్రీ | దీప్తా | రి * | చతుశ్రుతి ఋషభము. |
| 9 | క్రోధా | ఆయతా | రి-గ * | శుద్ధగాంధారము పఞ్చశ్రుతిఋషభ. |
| 10 | వజ్రికా | దీప్తా | గ-రి | సాధారణగాంధారము;షట్శ్రుతిఋష |
| 11 | ప్రసారిణీ | ఆయతా | గ | అంతరగాంధారము. |
| 12 | ప్రీతీ | మృదూ | | |
| 13 | మార్జనీ | మధ్యా | మ | శుద్ధమధ్యమము. |
| 14 | క్షితీ | మృదూ | | |
| 15 | రక్తా | మధ్యా | మ | ప్రతిమధ్యమము. |
| 16 | సన్దీపినీ | ఆయతా | | |
| 17 | ఆలాపినీ | కరుణా | ప | పంచమము. |
| 18 | మదన్తీ | కరుణా | | |
| 19 | రోహిణీ | ఆయతా | ధ * | శుద్ధధైవతము. |
| 20 | రమ్యా | మధ్యా | ధ | గ్రంథగత శుద్ధధైవతము. |
| 21 | ఉగ్రా | దీప్తా | ధ-ని | చతుశ్రుతి ధైవతము. |
| 22 | క్షోభిణీ | మధ్యా | ని | శుద్ధనిషాదము. |

పైఁ గనఁబడుచియుండు పధకములో వాడుకలోనుండు అన్ని స్వరములకును స్థానములు చెప్పఁబడెను. ఇందుకు వ్యత్యాసము గనుండు బ్రహ్మశ్రీ సుబ్బరామ దీక్షితుల స్వరనిర్ణయ పధకము A ను జూచుఁడు. ఒక స్థాయిలో నిరువది రెండు శ్రుతులనుఁ జేయునపుడు స్వరములు, కొంచెము యించుమించుగ నుండునేగాని సరిగనుండవు. ఎట్లనిన, ఒక స్థాయిలో 12 సమ భాగములను బడసిన యర్ధస్వరములున్నవి. ఈ యర్ధస్వరములను, సమాంతరమును

గల 1/4 స్వరములుగా చేయునపుడు 24 శ్రుతులగునే గాని 22 శ్రుతులు కానేరవు. ఒక స్థాయిని 22 సమభాగములుగాఁ జేయునపుడు శ్రుతియొకటింటికి సుమారు 4½ అంతర సెంట్సుల వ్యత్యాసము గలుగును. ఈ వ్యత్యాసము వ్యక్తముగ చెవులకు వినబడదు. తంబురను శ్రుతిఁజేయునపుడు సారణానుసారణల నొకటితో నొకటి చేర్చునపుడు వ్యత్యాసము సాధారణముగాఁ గలుగుచున్నను చెవులకు స్పష్టమైన వ్యత్యాసమును గలిగించలేదు. ఈ వ్యత్యాసము మంద్ర తంత్రినిగాని, పంచమతంత్రినిగాని సారణలతో చేర్చునపుడును గలుగుచున్నది. ఈ కారణములవలన శార్ఙ్గదేవుని 22 శ్రుతులు, షడ్జపంచమ భావప్రకారముగాఁ జెల్లునపుడు, 1 లేక 2 స్థాయిలలో స్పష్టమైన వ్యత్యాసమును కనిపించునేగాని గ్రామభేదములను చేయునపుడీ సమాంతర శ్రుతులలో వ్యత్యాసము గలుగదు. నిశ్శంకుడు 22 శ్రుతులనుజేసి గ్రామభేదమును జేసినపుడు, అందు షడ్జపంచమములకుఁ గలిగిన స్వల్ప వ్యత్యాసమునకు సారికలను లేక తంత్రులను స్వరములకు తగినట్లుగ నించుమించు ముందు వెనుకగఁ జేసియుండవచ్చుననియే చెప్పఁదగినది. ఆ పద్ధతు లెట్లుండినను శార్ఙ్గదేవుని యర్ధస్వరము లిపుడు వాడుకలోనుండు 12 యర్ధస్వరములకైనను కొంచె మధికమేగాని తక్కువకాదు. ఎట్లనిన, 22 శ్రుతులను 2-చే భాగించునపుడు 11 అర్ధస్వరములే వచ్చును. 1/12 సంఖ్యకు 1/11 పెద్దభాగమే కాని చిన్నది కాదు. వీణావాద్యములోనుండు పండ్రెండు యర్ధస్వరములను రాగముల లో వాడునపుడు ప్రక్కస్వరములు వివాదిగ నుండలేదు. ప్ర. మ.——ష ప——శు ధ ; కా.ని——స ; స——శు.రి ; ఇట్లన్ని స్వరములును పొందికఁగల విగ (అనువాదులుగ) నున్నవేకాని వివాదులు కానేరవు. పైనుదహరించియుండు సుబ్బరామదీక్షితులవారి స్వరనిరూపణ పథకములో, అంతర గాంధారమును మధ్యమమును వివాదిగ నున్నవి. ఈ రెండు స్వరములును గ్రంథములలోను వాడుకలోను యనువాది స్వరములుగనే నున్నవి. శార్ఙ్గదేవునిపద్ధతిలోని మధ్యమము వాడుకలోనుండు మధ్యమమునకు పెద్దదిగాను, అంతరగాంధారము వాడుకలోనుండు గాంధారమునకు చిన్నదిగాను నున్నది యను విషయము లెక్కఁజేయువారికి స్పష్టముగ తెలుసును.

అట్లుండియును బ్రహ్మశ్రీ సుబ్బరామదీక్షితులవారి కీ యంతరగాంధారము వివాదిగ చ్యుతమధ్యమస్థానమునం దెట్లు వచ్చెనో తెలియలేదు. ఇట్లే

కా.ని-స. స్వరములు నున్నవి. శుద్ధధైవత శుద్ధనిషాదములను వివాదులుగఁ
జెప్పియున్నారు. శ్రుతికి మూఁడవస్వరము 1/2 స్వరమేగాక 1/4 స్వరముగ
నెట్లుండవచ్చునో తెలియలేదు. ప్రక్కన వచ్చెడి శ్రుతు లొకటికొకటి
(1-2; 2-3, 3-4;) వివాదు లగునేగాని మూఁడవశ్రుతి (1-3; 3-5;)యందు
వచ్చు స్వరము లెట్లు వివాదులగునో తెలియలేదు. వీరి లెక్కప్రకారముగ
ప్రతిమధ్యమమునకు పంచమమును, పంచమమునకు శుద్ధ ధైవతమును,
ఇట్లొక స్థాయినందుగల 12స్వరములును వివాదులేయగును. వీరి పద్ధతి వెంకట
మఖి పద్ధతి యని తెలియుచున్నది. వీరుగాని వీరి పూర్వీకులైన వెంకట
మఖిగాని వివాదిస్థానముల నెఱింగినవారు కారు. వీరీ యస్పష్టపద్ధతినిచేకొని,
22 శ్రుతులలో బుట్టక వీణయందును అనుభవమునందును వివాది దోష
ములేక స్వీకరింపఁబడిన 12 అర్ధస్వరములమీద కల్పనముజేసి వాడియున్న
మేళకర్త రాగములలో, 40 రాగములకు వివాది దోషములనుఁ జెప్పి
యున్నారు. వీరి పొరపాటుపద్ధతిని యనుసరించిన యీ విషయము
లిప్పుడు ప్రచురింపఁబడియున్న యనేకపుస్తకములలోఁజూడవచ్చును. వీరి పద్ధతి
ప్రకారముగ 72 కర్తారాగము లన్నియును వివాదులే యగును. ఆర్యులారా!
ఇట్టి గొప్ప గ్రంథములలోని పెద్ద పొరపాటులను మీరే జూడుఁడు. మేళ
కర్త రాగములలో వివాదు లున్నవనియును, అవి గానయోగ్యంబు కావని
యును కొందఱు చెప్పుచున్నారు. ఇది సరికాదు, ఎట్లనిన, ప్రతిమధ్యమ
మునకును పంచమమునకును, పంచమమునకును శుద్ధ ధైవతమునకును
నైకమత్యము గలిగియుండునపుడు, ఈ స్వరములవలెనే సమాంతరములను
బడసిన షట్శ్రుతిఋషభ అంతరగాంధారమునకును, షట్శ్రుతి ధైవత
కాకలీ నిషాదమునకును మైకమత్యము లేక నెట్లుండవచ్చునో మీరే
జూడుఁడు. ప్రతిమధ్యమ రాగములయందు గలిగెడి రాగపుష్టియును రంజక
మును పైఁజెప్పిన (ష.రి.అం.గ ; ష. ధ-కా.ని.) స్వరములను బడసియున్న
రాగమునకున్ను గలగకుండ నెట్లుండును ? ఇట్టి రాగములను గానముచేయు
టకు మంచి యనుభవమును చక్కని స్వరజ్ఞానమును సాధకమును నుండవలసి
నది యత్యావశ్యకము. ఒక స్థాయిలో 12 అర్ధస్వరములను వరుసగ పాడుటకు
యోగ్యులు కానివారల కిట్టి రాగములను పాడుట సాధ్యముకాదు. అట్లు
తెలిసి గానము చేయువారు కొందఱే యున్నారు ; అందుచేతనే యీ కాల
ములో నాట, వరాళి, పంతువరాళి, ద్విజావంతి, నవరోజు మొదలగు

యనేక ఘనరాగములును దేశ్యరాగములును తమ తమ నియతగతిని విడిచి సుదూరము తొలగిపోయెను. అనేక రాగములు స్వర్గలోకము నలంకరించెను. ఇంకను నీ సంగీతవిద్య కేమి విపరీతములు గలుగునో మన మెఱుఁగలేక యున్నాము.

---

## గ్రామములు.

శ్లో॥ గ్రామస్స్వరసమూహస్స్యా న్మూర్ఛ నాదే స్సమాశ్రయః ।
తౌ ద్వౌధరాతలేతత్ర స్యాత్షడ్జగ్రామ ఆదిమః ।
ద్వితీయో మధ్యమగ్రామ స్తయోర్లక్షణ ముచ్యతే ॥ (సం. ర.)

తా. స్వరసమూహములు గ్రామమనియును, అవి మూర్ఛనాదులచే నాశ్రయింపఁ బడినదనియును, వానిలో రెండు భూలోకములో నున్నవనియును, అందులో మొదటిది షడ్జగ్రామ మనియును, రెండవది మధ్యమగ్రామ మనియును గ్రంథకర్త చెప్పుచున్నాఁడు.

"యథాకుటుంబిన స్సర్వే ఏకీభూతాభవంతిహి । తథాస్వరాణాం సప్తానాం గ్రామ ఇత్యభిధీయతే॥" అనేక కుటుంబములుచేరి గ్రామమగునట్లే స్వరసమూహములుచేరి గ్రామమగుచున్నది. రత్నాకరాది సమస్తగ్రంథముల లోను మూఁడుగ్రామములను జెప్పియున్నారు. వానిలో మొదటిది శుద్ధ స్వరయుక్తమైన షడ్జగ్రామ మనియును, రెండవది వికృతస్వరయుక్తమైన మధ్యమగ్రామ మనియును, ఈ రెండు గ్రామములే భూలోకమునం దున్న వనియును, మూఁడవదైన గాంధారగ్రామము స్వర్గలోకములో నున్నదని యును చెప్పియున్నారు.

కొన్ని పురాతనమైన గ్రంథములలో సప్తగ్రామము లున్నవని చెప్పు చున్నారు. అయినను యీ సప్తగ్రామములును గానయోగ్యంబు కావని తెలియుచున్నది. "శిలప్పధికారము" అను ద్రావిడ పురాతన గ్రంథములో, షడ్జగ్రామము, పంచమగ్రామము, మధ్యమగ్రామము, తారగ్రామ మని నాలుగు గ్రామములు చెప్పఁబడెను. అందులో తారగ్రామమే గాంధార గ్రామమని కొందఱ అభిప్రాయపడుచున్నారు. అరవములో తారమను శబ్దమునకు నిషాదమని భావము. అందుచేతనే నీ తారగ్రామము నిషాద గ్రామమనియే చెప్పఁదగినది.

## గ్రామత్రయములను జూపెడి పధికము
### రత్నాకర పరిశిష్టపద్ధతికి కొంచెము వ్యత్యాసమైన పద్ధతి.

| సంఖ్య. | శ్రుతులు. | జాతులు. | షడ్జ గ్రామము. | మధ్యమ గ్రామము. | గాంధార గ్రామము. | షరాలు. |
|---|---|---|---|---|---|---|
| 1 | తీవ్రా | దీప్తా | | | | |
| 2 | కుముద్వతీ | ఆయతా | | | | |
| 3 | మన్దా | మృదు | | | | |
| 4 | ఛన్దోవతీ | మధ్యా | స | స | స | |
| 5 | దయావతీ | కరుణా | | | | |
| 6 | రఞ్జనీ | మధ్యా | | | రి | |
| 7 | రతికా | మృదు | రి | రి | | |
| 8 | రౌద్రీ | దీప్తా | | | | |
| 9 | క్రోధా | ఆయతా | గ | గ | | |
| 10 | వజ్రికా | దీప్తా | | | గ | |
| 11 | ప్రసారిణీ | ఆయతా | | | | |
| 12 | ప్రీతి | మృదు | | | | |
| 13 | మార్జనీ | మధ్యా | మ | మ | మ | |
| 14 | క్షితి | మృదు | | | | |
| 15 | రక్తా | మధ్యా | | | | |
| 16 | సందీపినీ | ఆయతా | | ప | | |
| 17 | ఆలాపినీ | కరుణా | ప | | | |
| 18 | మదన్తీ | కరుణా | | | | |
| 19 | రోహిణీ | ఆయతా | | | ధ | |
| 20 | రమ్యా | మధ్యా | ధ | ధ | | |
| 21 | ఉగ్రా | దీప్తా | | | | |
| 22 | క్షోభిణీ | మధ్యా | ని | ని | ని | |

పైని కనబఱచియుండు పట్టికములో షడ్జగ్రామమున గల సప్త స్వరములును వాని నియతశ్రుతులందే యున్నయవి. కనుక, అవి యన్నియు శుద్ధస్వరములు. శుద్ధస్వర సప్తక యుక్తమైన యీషడ్జగ్రామము గానయోగ్యంబైనది. రెండవదైన మధ్యమగ్రామమున పంచమము మాత్ర మొక శ్రుతి తక్కువగ నున్నది. తదితర స్వరములన్నియును శుద్ధస్వరములే కనుక నీ మధ్యమ గ్రామమున్ను గానయోగ్యమైనదియే. మూఁడవదైన గాంధార గ్రామములో షడ్జ మధ్యమ నిషాదములుతప్ప తదితరములైన, ''రి, గ, ప, ధ''

స్వరములు తమ నియతశ్రుతులలోనుండి తొలఁగి 7-వ శ్రుతిలో నుండ వలసిన ఋషభము 6-వ శ్రుతిలోను, 9-వ శ్రుతిలో నుండవలసిన గాంధారము 10-వ శ్రుతిలోను, 17-వ శ్రుతిలో నుండవలసిన పంచమము 16-వ శ్రుతిలోను, 20-వ శ్రుతిలో నుండవలసిన ధైవతము 19-వ శ్రుతిలోను వచ్చియున్నవి. అందుచేత నీ గాంధారగ్రామము గాన యోగ్యంబు గాకపోయెను. ఈ కారణముచేతనే యీ గ్రామమును స్వర్గలోకమునకు పంపివేసినారని తెలియుచున్నది.

ఈ గ్రామ నిర్ణయమును చూపుటకై సంగీతరత్నాకరమునందుఁ గల పరిశిష్టములో నొక పథకము వ్రాయఁబడియున్నది. దానినిఁ దిగువఁజూడుఁడు:

రత్నాకర పరిశిష్టములోని పద్ధతి.

| సంఖ్య. | శ్రుతులు. | జాతులు. | షడ్జ గ్రామము. | మధ్యమ గ్రామము. | గాంధార గ్రామము. | వగాలు. |
|---|---|---|---|---|---|---|
| 1 | తీవ్రా | దీప్తా | | | ని | మధ్యమగ్రామమునందు దైవతము 20-వ శ్రుతియందును 19-వ శ్రుతియందున్నది. ఇది గ్రంథాంతర దైవతమని వ్రాసినారు. |
| 2 | కుముద్వతీ | ఆయతా | | | | |
| 3 | మందా | మృదుః | | | | |
| 4 | ఛందోవతీ | మధ్యా | స | స | స | |
| 5 | దయావతీ | కరుణా | | | | |
| 6 | రంజనీ | మధ్యా | | | | |
| 7 | రతికా | మృదుః | రి | రి | రి | |
| 8 | రౌద్రీ | దీప్తా | | | | |
| 9 | క్రోధా | ఆయతా | గ | గ | | |
| 10 | వజ్రికా | మృదుః | | | గ | |
| 11 | ప్రసారిణీ | మధ్యా | | | | |
| 12 | ప్రీతీ | మృదుః | | | | |
| 13 | మార్జనీ | మధ్యా | మ | మ | మ | |
| 14 | క్షితీ | మృదుః | | | | |
| 15 | రక్తా | మధ్యా | | | | |
| 16 | సందీపినీ | ఆయతా | | ప | ప | |
| 17 | ఆలాపినీ | కరుణా | ప | | | |
| 18 | మదన్తీ | కరుణా | | | | |
| 19 | రోహిణీ | ఆయతా | | ధ | ధ | |
| 20 | రమ్యా | మధ్యా | ధ | | | |
| 21 | ఉగ్రా | దీప్తా | | | | |
| 22 | క్షోభిణీ | మధ్యా | ని | ని | | |

ఇందు మధ్యమ గ్రామములో ధైవతమున కొకశ్రుతి తక్కువగ వ్రాయఁబడియున్నది. మూలములో (సం. రత్నాకరము, సంపుటము 1, పుట 46 లోఁ జూడుఁడు), "స్వోపాన్త్యశ్రుతి సంస్థోఽస్మిన్మధ్యమ గ్రామ ఇష్యతే" పంచమమున కొకశ్రుతి తక్కువగ నుంచినచో షడ్జగ్రామము మధ్యమగ్రామ మగునని చెప్పినారేకాని ధైవతమునుకూడ నొకశ్రుతి తక్కువగ నుంచుమని చెప్పలేదు. అటులనే గాంధారగ్రామములో ఋషభమున కొకశ్రుతి తగ్గించక నిషాదమున కొకశ్రుతి యధికముగ వ్రాసియున్నారు. ఇవి మతాంతరములై యున్నదని కొందఱు చెప్పియున్నారు. అయినను ఇది లెక్కకు సరిగ నుండలేదు.

సంగీత సాంప్రదాయ ప్రదర్శినిలోని పద్ధతి.

| సంఖ్య. | శ్రుతులు. | జాతులు. | షడ్జ గ్రామము. | మధ్యమ గ్రామము. | గాంధార గ్రామము. | రాగాలు. |
|---|---|---|---|---|---|---|
| 1 | తీవ్రా | దీప్తా | | | | |
| 2 | కుముద్వతీ | ఆయతా | | | | |
| 3 | మన్దా | మృదుః | | | స | |
| 4 | ఛన్దోవతీ | మధ్యా | స | స | | |
| 5 | దయావతీ | కరుణా | | | | |
| 6 | రఞ్జనీ | మధ్యా | | | రి | |
| 7 | రతికా | మృదుః | రి | రి | | |
| 8 | రౌద్రీ | దీప్తా | | | | |
| 9 | క్రోధీ | ఆయతా | గ | గ | గ | |
| 10 | వజ్రికా | దీప్తా | | | | |
| 11 | ప్రసారిణీ | ఆయతా | | | | |
| 12 | ప్రీతీ | మృదుః | | | మ | |
| 13 | మార్జనీ | మధ్యా | మ | మ | | |
| 14 | క్షితీ | మృదుః | | | | |
| 15 | రక్తా | మధ్యా | | | | |
| 16 | సన్దీపినీ | ఆయతా | | ప | ప | |
| 17 | ఆలాపినీ | కరుణా | ప | | | |
| 18 | మదన్తీ | కరుణా | | | | |
| 19 | రోహిణీ | ఆయతా | | | ధ | |
| 20 | రమ్యా | మధ్యా | ధ | ధ | | |
| 21 | ఉగ్రా | దీప్తా | | | | |
| 22 | క్షోభిణీ | మధ్యా | ని | ని | ని | |

ఎట్టియాపురము బ్రహ్మశ్రీ సుబ్బరామదీక్షితులు వ్రాసియున్న "సంగీత సంప్రదాయ ప్రదర్శిని" యను గ్రంథములో షడ్జ మధ్యమ గ్రామములను మొదటి పథక ప్రకారముగనే వ్రాసినారు. గాంధార గ్రామములో స, మ, ని అను 3 స్వరములను మాత్రమే వాని నియత శ్రుతులలో వ్రాయవలయును. అట్లు చేయక, గాంధార నిషాదములను నియత శ్రుతులలో వ్రాసి షడ్జమున కొక శ్రుతియును, ఋషభమున కొక శ్రుతియును, మధ్యమమున కొక శ్రుతియును, పంచమమునకు రెండు శ్రుతులును, ధైవతమునకు రెండు శ్రుతులును, తక్కువగ వ్రాసియున్నారు. ఇదియును సరియైన పద్ధతి కాదు. ఈ పద్ధతిని పైఁ గనంబఱచియున్న పథకములోఁ జూడుఁడు.

"సంగీతచంద్రిక" యను లక్షణగ్రంథములో మిస్టరు మాణిక్యమొదలారు గ్రామచర్చను జేయునపుడు షడ్జగ్రామము మంద్రస్థాయి మూర్ఛనలను గలదనియును, మధ్యమ గ్రామము మధ్యస్థాయి మూర్ఛనలను గలదనియును, గాంధారగ్రామము తారస్థాయి మూర్ఛనలను గలదనియును, ఈ గాంధారగ్రామ మూర్ఛనలు యతి తారస్థాయిలోను వచ్చుచున్నది కనుక మనుష్యశారీరములో పలుకదనియును, ఆ మూర్ఛనలు గంధర్వ శారీరములో పలుకుననియును, అందుచేత గాంధారగ్రామము స్వర్గగతమై యున్నదనియును చెప్పియున్నారు ఇది గ్రంథోక్త పద్ధతి కానేరదు, మొదలారిగారి స్వకపోలకల్పనము.

ఇట్లు నాకు గోచరంబులై యుండు యనేక తత్కాలగ్రంథగతంబులైన పొరపాటులను వ్రాయవలయునేని యది యొక భారతమగును. గొప్ప సముద్రమువంటిదియును, కొలతలేని లోతుగలదియును, అగాధ శాస్త్ర పరిచయమువలనను, అనుభవ పాటవమువలనను మాత్ర మెఱుంగ దగినదియునైన యీ సంగీతశాస్త్రమునకు సంగీతశాస్త్ర శిరోపుచ్ఛము లివియని తెలియనివారలు లక్షణ గ్రంథములను వ్రాయుట కారంభించియున్నారు. తెలియనివారు తమకుఁ దెలిసినంతవఱకే వ్రాయవలయును. అట్లు గాక, తమకు తెలియని విషయములను వ్రాయ నారంభించి శాస్త్రానర్థమును గావించుచున్నారు. ఇట్టి గ్రంథములు వృద్ధిఁ జెందినచో గాంధారగ్రామము స్వర్గలోకమును జెందిన తీరున సంగీతశాస్త్రము కుటుంబసమేతముగ పాతాళలోక ప్రవేశముఁ జేయక మానునా?

ఇంకనైనను గ్రంథకర్తలు తమకు గోచరముగాని విషయములలో స్వకల్పన
మును జేయక యుందురుగాక.

## గ్రామరహస్యము.

గ్రామములను గుఱించి వ్రాయఁబడిన యనేక పద్ధతులు నాకబ్బి
యున్నవి. అందులో కొన్ని గొప్ప గ్రంథకారుల యభిప్రాయముల నిప్పై
నుదహరించియున్నాను. శ్రుతుల విషయమై చాల ప్రయత్నముఁ జేసి పరి
శీలనముఁ గాంచిన రావుసాహేబు ఏబ్రహామ్ పండితులును, యీ గ్రామవిష
యమైన రహస్యముల నుచక్కఁగ కనిపెట్టలేదని తెలియుచున్నది. వారేనా
యొక పద్ధతితో మఱియొకటిని సమరసముఁ జేసి, ఇట్లుండవచ్చునని యొక
యభిప్రాయమును చెప్పియున్నారేగాని, ఇందలి విషయము లివియని
చెప్పలేదు. మఱియు పండితులుగారు, వారు చెప్పిన పద్ధతికై యించుకైనను
సంతసిల్లినట్లును తెలియలేదు. ఈ గ్రామ సంబంధమైన రహస్యము లితరుల
కును తెలియకనే యున్నవి. ప్రాచీన గ్రంథకారులైన నారదుఁడు, శార్ఙ్గ
దేవుఁడు మొదలుగాగల యందఱి మతములఁ జూచునపుడు, కొందఱు
గాంధార గ్రామమునకును, మఱికొందఱు గాంధార, మధ్యమ గ్రామముల
కును చరమశ్లోకములఁ జదివియున్నారేగాని మఱేమియులేదు. సంగీత
రత్నాకర వ్యాఖ్యానకారుఁడైన చతురకల్లినాథుఁడు, ఈ గ్రామరహస్యముల
నూహించుటకైన యొక యంశమును చెప్పియున్నాఁడు. "ద్వౌగ్రామౌ
విశ్రుతౌ లోకే షడ్జమధ్యమ సజ్ఞికౌ" ఇతి మునివచనాచ్చ. "శుద్ధాశ్ర
యత్వాత్ షడ్జగ్రామ ఆదిమో వికృతాశ్రయత్వాత్ ద్వితీయో మధ్యమగ్రామ
ఇత్యుపపద్యత ఇతి." ఇందుచేత షడ్జగ్రామము శుద్ధస్వరములను బడసిన
దనియును, మధ్యమగ్రామము వికృతస్వరములఁ బడసినదనియును వెల్లడి
యగుచున్నది. అయినను, యిందులకు స్వరూపము లివియనియును,
ఆ స్వరూపము లీ కారణములచే గలిగినవనియును తెలిసికొనుటకైన
యంశము లివియని తెలియలేదు. కల్లినాథుఁడు శ్రుతులను బరిష్కరించి
వ్యాఖ్యానమును వ్రాయలేదు. మూలముమీఁద వ్యాఖ్యానముఁ జేయు
నపుడు తనకు తోఁచిన యభిప్రాయమును వ్రాసినాఁడనిదో తెలియుచున్నది.
కనుక గ్రామభేదము నెట్లు చేయవలయునని యిపుడు చర్చఁజేసెదము.

ఒక టే కొలతలనుగల రెండు వీణలయందును నొకే సమాంతరము ననుసరించి యిరువదిరెండు చొప్పున శ్రుతులను జేయునపుడు వానిలోని శ్రుతులు షడ్జపంచమ భావమునకు సరిగ నుండకపోయినను గ్రామభేదముఁ జేయునపుడు సరిగనే యుండును. ఎట్లనిన, ఒక టే కొలతలను గల మెట్లను బడసిన 2 నిశ్రేణులను సరిగ జేర్చి కట్టినను, 4 లేక 5 మెట్లను ముందు వెనుకఁ బెట్టి మెట్టకు మెట్టుమాత్రము సరిగ నుండునటుల బంధించినను, అంతుమొత్తపు నిశ్రేణి నిడివిలో గల మెట్లొకే యంతరమును బడసినవి గానే యున్నచందంబున, సమాంతరములను బడసిన శ్రుతులు గ్రామభేద ములో నొకటితో నొకటి సరిగనే యుండును. ఒక స్థాయిలో నిట్టి సమాం తరములు గల వేయి శ్రుతులనైనను చేయవచ్చునేగాని యా శ్రుతులలో షడ్జపంచమ భావ ప్రకారముగఁ గలుగు గానయోగ్యంబులైన స్వరములను బుట్టించుట సాధ్యముకాదు. శార్ఙ్గదేవుని రెండు వీణలలోని శుద్ధస్వర నిరూ పణ పద్ధతి నింతకుమునుపే చెప్పఁబడెను. (ఈ గ్రంథముయొక్క 13-వ పుట లోఁ జూడుఁడు.) పైఁ జెప్పిన శుద్ధస్వరములుగాక వచ్చెడి స్వరములు వికృతస్వరము లగును.

గ్రామమనగా, "గ్రామస్స్వర సమూహస్స్యా న్మూర్ఛనాదే స్సమాశ్ర యః". మూర్ఛనాదులతో కూడుకొన్న స్వరసమూహములను గలదియని తాత్పర్యము. "సరిగమపధని" యను స్వరసప్తకము మూర్ఛన యనం బడును. ఈ గ్రంథముయొక్క 13-వ పుటలోఁ జూడుఁడు. చలవీణయందు తారషడ్జమునకుఁ గల నాలుగుశ్రుతుల నొకటొకటిని క్రమముగ దిగువఁ దెచ్చునపుడు దానియందుగల శుద్ధస్వర సప్తకములు ధ్రువ వీణయందు గల శుద్ధస్వర సప్తకములతో చేరి యొక గ్రామ మగుచున్నది.

పైని జెప్పిన స్వరసప్తకమును కనిపెట్టుటకైన ప్రథమప్రయత్నము ధ్రువవీణయందుగల తారషడ్జముయొక్క 4-వ శ్రుతిలోనుండి చేయఁబడి నది. ఆ కారణముచేత నిందుకు షడ్జగ్రామమని పేరువచ్చెను. ప్రథమ ప్రయ త్నముచే చిక్కిన యీ స్వర సప్తకములకు శుద్ధస్వర సప్తకము లని పేరు.

గాంధారగ్రామము ఋషభగ్రామము లేదనుటకు కారణము.

పైని జెప్పిన షడ్జగ్రామములోని శుద్ధసప్తకములను కనిపెట్టుటకై నాలుగు శ్రుతులను క్రమేణ తగ్గించవలసి వచ్చెను. అందులో మూఁడవ శ్రుతిని తగ్గించునపుడే చలవీణయందు గల తారస్థాయి శుద్ధఋషభము

ధ్రువ వీణయందు గల తారషడ్జమునకు సరిగ తగ్గెను. అందుచే ఋషభ గ్రామ ముండుటకు కారణములేదు. 4-వ ప్రస్తారములో చలవీణలోని తారగాంధార గ్రామమునకు గల శ్రుతులలో నొకటి ధ్రువ వీణలోని షడ్జమునకు సరిగ తగ్గిపోయెను. స్వరసమూహములో సప్తకము గలుగుటకు మునుపు గ్రామము కానేరవు. ధ్రువ వీణయందు షడ్జగ్రామములో స్వర సప్తకము పూర్తియగుటకు మునుపే చలవీణయందు ఋషభగ్రామము లోని శ్రుతులకు లోపము గలిగినందువలన ఋషభగ్రామ మనుటకు నేదియు కారణములేదు. ఇట్లు స్వర సప్తకములు లభించువఱకును చేయు భేదములు శ్రుతులభేదము లనఁబడును. స్వరసప్తకము లభించినవెనుకఁ జేయఁబడు భేదములు మాత్రమే గ్రామభేదము లనఁబడును. నాలుగవశ్రుతిని భేదించు నపుడే షడ్జగ్రామములోని స్వరసప్తకములు శుద్ధములని బరిష్కరింపఁ బడెను. ఇంకను చేయవలసి యుండు ప్రస్తారము 5-వ భేద ప్రస్తారమే యగు చున్నది. స్థాయిలో 5-వ శ్రుతి గాంధారగ్రామమును చేరినది కనుక నీ 5-వ ప్రస్తారము గాంధారగ్రామ మగుచున్నది. షడ్జగ్రామములో శుద్ధ సప్తకములు లభ్యమయ్యెను. గాంధార గ్రామములోని స్వరసప్తకములు షడ్జపంచమ శుద్ధనిషాద శుద్ధగాంధారములు తప్పఁ దక్కినవి నేదియును ధ్రువవీణ సప్తకములతో చేరలేవు. ఈ స్వరములన్నియును షడ్జగ్రామము లోనే చిక్కినవి కనుక ఈ గ్రామభేదమువల్ల నుపయోగము లేదని చెప్పుటకు బదులు శ్లేషగా స్వర్గలోకగతము లైనది యని చెప్పియున్నారు.

పైని జెప్పిన ప్రస్తారమును క్రమముగ నిషాదమువఱకు తెచ్చి చూడ వలయుననియునుఁ అచ్చట వికృతస్వరములను నిర్ణయించుటకైన హేతువు లున్నవనియును, తెలియుచున్నది. ఈ మధ్యమ, నిషాదగ్రామముల పరిశీల నముజేయుటకు మునుపు, ఈ పద్ధతి సరియైన పద్ధతిగ నున్నదా యని విచా రింతము. రత్నాకరములో "షడ్జగ్రామః పంచమేస్వ చతుర్థశ్రుతి సంస్థితే" అని చెప్పియున్నది. "స్వచతుర్థశ్రుతి సంస్థితే" యనుటకు "స్వకీయచతుర్థ శ్రుతౌ కరుణా జాతిభేద ఆలాపిన్యామాదితః సప్తదశ్యాంస్థితేసతి షడ్జ గ్రామః" అని కల్లినాథుఁడు వ్యాఖ్యానముఁ జేసియున్నాఁడు. తనకు స్వకీయ మైన 4-వ శ్రుతిలో, అనఁగా కరుణాజాతి ఆలాపిని యను శ్రుతిలో 17-వ స్థానములో నున్నయెడల షడ్జగ్రామమగును యని భావము. ఇందుచేత నీ స్వరము పంచమమని తెలియుచున్నది. మూలములోని యర్థ మిదికాదు.

చలవీణయందుఁ గల తారస్థాయి 5-వ శ్రుతి ధ్రువవీణయందు తారస్థాయి 1-వ శ్రుతికి సమముగా తగ్గునపుడు షడ్జగ్రామ మగుచున్నదని భావము. ఎట్లనిన, షడ్జగ్రామమును చెప్పునపుడు షడ్జమునకు స్థానమును చెప్ప వచ్చునేగాని పంచమమునకు స్థానముఁ జెప్పి యందుచే షడ్జనిరూపణముఁ జేయుట యనవసరము. ధ్రువవీణ చలవీణలను చేకొని స్వరనిర్ణయములను జేయునపుడు అవరోహణముగ చలవీణ స్వరములు దిగుచున్నదేగాని ఆరోహణముగ పైకిఁ జెల్లలేము. మూఁడుస్థాయిలు లేక గ్రామభేదముఁ జేయుట సాధ్యము కాదు. "చతుః చతుః చతుశ్చైవ..." అను శ్లోకప్రకారముగ 4-వ భేదములో మనకు సప్తస్వరములును లభించి షడ్జగ్రామ మగునపుడు చలవీణయందుఁ గల తారస్థాయిలోని 5-వ శ్రుతి అవరోహణముగ ధ్రువవీణయందు గల 1-వ శ్రుతిలో (తారషడ్జ శ్రుతిలో) నిలుచును. అందుచేత చలవీణలోని షడ్జమునకు 5-వ శ్రుతి ధ్రువవీణలోని షడ్జస్థానమును జెందునపుడు షడ్జగ్రామ మగుననుయర్థమే గలుగుచున్నది. ఇందులో నొక యాక్షేపణముఁ గలుగును. ఎట్లనిన, షడ్జములోనుండి 1-వ గాంధారమునకు నాలుగు శ్రుతులు మాత్రమే యున్నవి; అట్లుండునపుడు పంచమస్థాన మెట్లగును; అనినచో, అందుకు సరియైన సమాధానము కలదు. ఎట్లనిన, తారషడ్జమును మేషరాశిగ స్వీకరించునపుడు అందుకు 1-వ గాంధారము సింహరాశి యగును. మేషరాశికి సింహరాశి పంచమస్థానమగునేగాని చతుర్థస్థానము కానేరదు.

ఇప్పుడు మధ్యమగ్రామమును నిశ్చయించెడి శ్లోకపాదమును జూతము. "సోపాంత్యశ్రుతి సంస్థోస్మిన్మధ్యమగ్రామ ఇష్యతే", పైని చెప్పియున్న చలవీణయందలి తారషడ్జమము ధ్రువవీణయందుఁగల పంచమాంత్యశ్రుతినిఁ (పంచమ నియతస్థానమును) జెందునపుడు(అనఁగా పంచమమునకు సమముగా షడ్జము తగ్గునపుడు) మధ్యమగ్రామ మగుచున్నది యని చెప్పియున్నాఁడు. ఈమూలమును "స్వోపాంత్య" అని దిద్దుకొని పంచమము తనయొక్క ఉపాంత్యస్థానమును జేరినపుడు మధ్యమగ్రామమగుచున్నదని వ్యాఖ్యానమును వ్రాసియున్నాఁడు. వ్యాఖ్యానకారుఁడు పదములనుబట్టి వ్యాఖ్యానముఁ జేసినాఁడే కాని భావమును తెలిసి వ్యాఖ్యానమును వ్రాయలేదని తెలియుచున్నది.

పైని చెప్పిన గ్రామరహస్యమును జూపెడి పధకముల ప్రక్కపుటయందు జూడుఁడు :

## A. గ్రామరహస్యములను జూపెడి పథకము.

| | 19 | 20 | 21 | 22 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ధ్రువవీణాస్వరములు. | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | | * |
| చలవీణ భేదములు. 1 | | | | | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | * | |
| 2 | | | | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | * | | |
| ఋషభలోపము. 3 | | | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | * | | | |
| షడ్జగ్రామము. 4 | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | | |
| 5 | | | | | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | | | |
| 6 | | | | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | | | | |
| ఋషభగ్రామము. 7 | | | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | | | |
| 8 | | | | | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | | | | |
| గాంధారగ్రామ. 9 | | | | | గ | | | | మ | | | | [illegible] | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | |
| 10 | | | | | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | | |
| 11 | | | | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | | | |

A. గ్రామముల స్వరములను జోడించు విధము — (Continued).

| | | 19 | 20 | 21 | 22 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 12 | | | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | | | | |
| మధ్యమగ్రామ. | 13 | | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | |
| | 14 | | | | | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | | |
| | 15 | | | | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | | | |
| | 16 | | | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | | | | |
| పంచమగ్రామ. | 17 | | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | | |
| | 18 | | | | | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | | | |
| | 19 | | | | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | | | | |
| ధైవతగ్రామ. | 20 | | | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | | | |
| | 21 | | | | | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | | | | |
| నిషాదగ్రామ. | 22 | | | | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | |
| | 23 | | | | | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | | |

B. గ్రామభేదములో చలవీణయందు స్వరస్థానభేదములను జూపెడి పథకము.

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 1 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ధ్రువవీణ. | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | మధ్యషడ్జ గ్రామము. |
| 4-వ భేదము. చలవీణ. | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | మధ్యషడ్జ గ్రామము. |
| 7-వ భేదము. | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | ఋషభ గ్రామము. |
| 9-వ భేదము. | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | గాంధార గ్రామము. |
| 13-వ భేదము. | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | మధ్యమ గ్రామము. |
| 17-వ భేదము. | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | పంచమ గ్రామము. |
| 20-వ భేదము. | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | ధైవత గ్రామము. |
| 22-వ భేదము. | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | నిషాద గ్రామము. |
| 26-వ భేదము. | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | మంద్రషడ్జ గ్రామము. |

C. గ్రామభేదములో చలవీణయందు స్వరస్థానములను షడ్జాదిగఁ జూపెడి పథకము.

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 1 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 4-వ భేదము. | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | మధ్యషడ్జ గ్రామము. |
| 7-వ భేదము. | స | | రి | | | | గ | | | | మ | | | ప | | ధ | | | | ని | | | స | ఋషభ గ్రామము. |
| 9-వ భేదము. | స | | | | రి | | | | గ | | | మ | | ప | | | | ధ | | | ని | | స | గాంధార గ్రామము. |
| 13-వ భేదము. | స | | | | రి | | | గ | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | మధ్యమ గ్రామము. |
| 17-వ భేదము. | స | | | రి | | గ | | | | మ | | | ప | | ధ | | | | ని | | | | స | పంచమ గ్రామము. |
| 20-వ భేదము. | స | | రి | | | | గ | | | మ | | ప | | | | ధ | | | | ని | | | స | ధైవత గ్రామము. |
| 22-వ భేదము. | స | | | | రి | | | గ | | మ | | | | ప | | | | ధ | | | ని | | స | నిషాద గ్రామము. |
| 26-వ భేదము. | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | మంద్రషడ్జ గ్రామము. |

పైని గనఁబఱచియుండు మూఁడు పథకములనుఁ జూడుఁడు. అందులో మొదటి పథకము గ్రామభేదముఁ జేయుటకైన సులభమైన మార్గమును జూపునది. ఈ పథకములో చలవీణయొక్క 4-వ భేదములో షడ్జగ్రామమును, 7-వ భేదములో ఋషభగ్రామమును, 9-వ భేదములో గాంధారగ్రామమును, 13-వ భేదములో మధ్యమ గ్రామమును, 17-వ భేదములో పంచమ గ్రామమును, 20-వ భేదములో ధైవత గ్రామమును, 22-వ భేదములో నిషాద గ్రామమును, వరుసగా లభ్యమగుచున్నవి. ఈ సప్తగ్రామములును వరుసగా ధ్రువవీణ, షడ్జగ్రామముతో, రెండవ పథకములో వ్రాయఁబడి యున్నవి. మూఁడవ పథకములో నీ సప్తగ్రామములును షడ్జాదిగ వ్రాయఁబడెను.

ఉ. రెండవ పథకములో మధ్యమ గ్రామములో "మ ప ధ ని స రి గ మ" అను స్వరములున్న స్థానములలోనే 3-వ పథకములో, ఆ మధ్యమ గ్రామ మాధార మధ్యమమును షడ్జముగఁ జేసికొని, "స రి గ మ ప ధ ని స" అని వ్రాయఁబడెను. ఈ మూఁడవ చక్రమును పరిశీలించునపుడు షడ్జమధ్యమ నిషాదగ్రామములు మాత్రమే గానయోగ్యంబైనవని యందఱికిని స్పష్టముగఁ దెలియవచ్చును.

మనకు షడ్జగ్రామములో శుద్ధసప్తకములు లభ్యమయ్యెను. మధ్యమ గ్రామములో చతుశ్శ్రుతిఋషభ, అంతరగాంధారములు లభ్యమయ్యెను. నిషాదగ్రామములో చతుశ్శ్రుతిధైవత, కాకలీనిషాదములు లభ్యమయ్యెను. ఇట్లు గలుగు మూఁడు గ్రామములు తప్ప తక్కిన గ్రామము లన్నియును గానయోగ్యంబులు కానేరవు. అందుచేతనే వానిని గ్రంథకర్త చెప్పలేదు.

షడ్జమధ్యమ గ్రామములను మాత్రముఁ జెప్పియున్నవాఁడు, ఈ రెండు గ్రామములకన్న చక్కనిదియును, షడ్జ స్వరములను బడసినదియు నైన నిషాదగ్రామమును చెప్పక వదలినందుకు కారణమేమి యనినచో, గ్రామ భేదము శుద్ధ వికృత స్వరములకై చేసిన ప్రయత్నమేకాని మఱేమియుఁ గాదు. షడ్జగ్రామములో శుద్ధసప్తకములు లభ్యమయ్యెను, మధ్యమ గ్రామములో వికృతస్వరములను కనిపెట్టుటకైన త్రోవలన్నియును గ్రంథకర్తకు లభించెను. అందుచేత తదితర గ్రామములను గ్రంథకర్త పాటింపలేదు.

మధ్యమ గ్రామములో నన్ని వికృతస్వరములను కనిపెట్టు విధ మెట్టిదియనిన, గ్రంథకర్త మధ్యమగ్రామమును చేసినపుడే షడ్జమునకు 8-వ శ్రుతిలో

అంతరగాంధారము పలుకుచున్నదని గ్రహించినాఁడు. (షడ్జములోనే అంతరగాంధార పంచమ తారషడ్జములు స్వకీయముగఁ బలుకు నను విషయ మిదివఱకే చెప్పఁబడెను). షడ్జమునకు 5-వ శ్రుతిలో చతుశ్శ్రుతి ఋషభము పలికి, " స రి గ మ " అని శ్రావ్యమైన యొక ఛాయను గలుగఁ జేసెను. అందుచేత నీ ఋషభ గాంధారములకు పరస్పరము సంవాదములైన చతుశ్శ్రుతిధైవత కాకలీనిషాదములు గానయోగ్యంబులైన స్వరములని గుణించుట కేదియును శ్రమములేదు. ఇదివఱకును గానయోగ్యంబులైన 11-స్వరములు 1-స్థాయిలో మనకు లభ్యమయ్యెను. ఇవిగాక మఱియొక స్వరమును మనము లభించినయెడల స్థాయి సంపూర్తియగుచున్నది. ఈ కడ పటి ప్రయత్నము నెచ్చట చేయవలయు ననినచో మధ్యమ పంచమ స్వర ములకు మధ్యలో మాత్ర మీ ప్రయత్నము చేయఁదగినది. షడ్జమునకుఁ గల 4-శ్రుతులకు మధ్యలో కాకలీ నిషాదమును, మధ్యమమునకు గల 4-శ్రుతు లకు మధ్యలో అంతరగాంధారమును చాల మైకమత్యము గల స్వరములుగ నున్నవి. అట్లే పంచమమునకు గల 4 శ్రుతులకు మధ్యలో నొక స్వరము నుంచునపుడు ఆస్వర మైకమత్యముఁ గలదిగ నుండుటకు నెంతయు సందేహ ములేదు. అందుచేత ప్రతిమధ్యమము కడపటి ప్రయత్నములో లభించిన స్వరము. మేళకర్తరాగములను కల్పనము చేసినవాఁ డీ రహస్యము నెఱిఁగి శుద్ధమధ్యమ రాగములు 36 అనియును, ప్రతిమధ్యమ రాగములు 36 అని యును విభజించి యున్నాఁడు.

పైనిచెప్పిన కారణములచే మధ్యమగ్రామములోనే మనకు వికృత స్వరము లన్నియును లభ్యమయ్యెను.

గానములో 1/2 స్వరములకన్న 3/4 స్వరములు గానయోగ్యం బైనయవి. ఇందుకన్న పూర్ణస్వరములు శ్రావ్యమైనయవి. ఈ కారణముచేత శుద్ధగాంధార శుద్ధనిషాదములను వాడునపుడు వాని కొక్కొక్క శ్రుతుల నిచ్చి సాధారణ గాంధార కైశికినిషాదములుగ వాడియున్నారని తెలియు చున్నది. ఈ తీరుననే గానకాలమునందు రంజనమును గలిగించుటకై సమ యోచితముగ స్వరములకు పూర్వోత్తరములయం దొక శ్రుతిని దగ్గించి యైనను నెక్కించియైనను పాడుట వాడుకగ నుండెననీ తెలియుచున్నది. ఇది మా ప్రాజ్ఞాభిప్రాయము.

(సంగీత సంప్రదాయ ప్రదర్శిని, పుట 26 & 27 జూడుఁడు.)

## "అంతరగాంధార కాకలీనిషాద నిరూపణము.

ప్రాచీన పద్ధతిలో శార్ఙ్గదేవుని మతమున జెప్పిన శ్రుతి పథకమందు 14 స్థానములలో 19 శుద్ధ వికృతి స్వరములు గలిగినవి యనుటనుఁ గానవచ్చును. శార్ఙ్గదేవుని కాలమందే మధ్యమముయొక్క రెండవశ్రుతిని పొందిన అంతరగాంధారమును, షడ్జముయొక్క రెండవశ్రుతిని పొందిన కాకలీనిషాదమును అల్పప్రయోగములు గలవియని సంగీతరత్నాకరమందు జెప్పఁబడియున్నది. ఇటులనే రామామాత్యులును జెప్పియున్నారు. శార్ఙ్గదేవునికి వెనుకటివారును వెంకటమఖికి ముందటివారునైన రామామాత్యుల కాలమునకు మునుపే మధ్యమ షడ్జముల రెండవశ్రుతులను పొందిన అంతరగాంధార కాకలీనిషాదములు వాడుకలోనుండి తొలఁగినవనియు, పిమ్మట నవి (అంతరగాంధార కాకలీనిషాదములు) మధ్యమ షడ్జముల మూఁడవ శ్రుతిస్థానములను పొందినవి యనియు, రామామాత్యులు వీణలో పండ్రెండు స్థానములను జెప్పుటవల్లను, చ్యుతమధ్యమ గాంధారమును అంతరగాంధారమునకును, చ్యుతషడ్జ నిషాదమును కాకలీనిషాదమునకును ప్రతినిధిగా జెప్పియుండుటవల్లను స్పష్టమగును.

శ్లో॥ చ్యుత మధ్యమ గాంధార చ్యుత షడ్జ నిషాదకౌ ।
క్రమాదంతర కాకల్యాః స్థానే ప్రతినిధిం విదుః ॥ [స్వరమేళకళానిధి]

రామామాత్యులకు వెనుకటివారైన వెంకటమఖి, చ్యుతమధ్యమ గాంధారమును అంతరగాంధారమునకును, చ్యుతషడ్జ నిషాదమును కాకలీనిషాదమునకును జెప్పఁబడుచు వచ్చిన నామములు తన కాలమునకుమునుపే లేకుండినందువలన చ్యుతమధ్యమ గాంధారము, చ్యుతషడ్జ నిషాదము అని చెప్పనోపక మధ్యమ షడ్జముల మూఁడవ శ్రుతులయందు గాంధార నిషాదములు ధ్వనించుటచేత అంతరగాంధారము కాకలీనిషాదము అను నామములనే నిర్ణయించినట్లుగా తెలియవచ్చుచున్నది. అవి నేఁటి కాలమునను వాడుకఁగా వచ్చుచున్నవి.

## 14 పంచశ్రుతి ఋషభ ధైవత నిరూపణము.

పూర్వకాలములో పంచశ్రుతి ఋషభమనియు పంచశ్రుతి ధైవతమనియు జెప్పఁబడిన రెండు స్వరములను ఈ కాలమున "చతుశ్రుతి ఋషభము" అనియు, "చతుశ్రుతి ధైవతము" అనియుఁ జెప్పుచున్నారు. వానికి ఆ నామములు [చతుశ్రుతి ఋషభ చతుశ్రుతి ధైవతములు] ఆదికాలములో నేర్పడి పిమ్మట తొలగిపోయిన వివరమును ఇచట కొంత వివరింతము. పూర్వకాలములో శార్ఙ్గదేవుని మతమందు షడ్జము తన నియత శ్రుతిని విడిచి తన మూఁడవ శ్రుతి స్థానమందు చ్యుతషడ్జమైనప్పుడు శుద్ధఋషభము తన నియత శ్రుతియందే యుండుకొని తన మూఁడు శ్రుతులలో షడ్జముయొక్క నాలుగవ శ్రుతియైన యొక శ్రుతిని జెంది చతుశ్రుతి ఋషభము అను వికారమును, పంచమము తన నియత శ్రుతిని విడిచి తన మూఁడవ శ్రుతి స్థానమందు చ్యుతపంచమమైనప్పుడు శుద్ధ

ధైవతము తన నియత శ్రుతియందే యుండి తన మూఁడు శ్రుతులతో పంచమముయొక్క నాలుగవ శ్రుతియైన యొక శ్రుతిని జెంది చతుశ్శ్రుతి ధైవతము అను వికారమును పొందినది. అవి బొత్తిగా తొలగిన వెనుక ఋషభము తన స్థానమును విడిచి తనకు పైనిగల శుద్ధగాంధారస్థానమును ఆశ్రయించి తన మూఁడు శ్రుతులతో ఆ శుద్ధగాంధారముయొక్క రెండు శ్రుతులను జెంది "పంచశ్రుతి ఋషభము" అను నామమును, ధైవతము తన స్థానమును విడిచి తనకు పైనిగల శుద్ధనిషాద స్థానమును నాశ్రయించి తన మూఁడు శ్రుతులతో ఆ శుద్ధనిషాదముయొక్క రెండు శ్రుతులఁ జేర్చుకొని, "పంచశ్రుతి ధైవతము" అను నామమును జెందినవి. ఇటులనే రామామాత్యులును,

"శ్లో॥ లక్ష్యేతు శుత్ర చిచ్ఛుద్ధ గాంధార స్థానమాశ్రయన్ ।
ఋషభః కీర్త్యతే స్మాభిః పంచశ్రుత్యృషభాహ్వయ ।
శుద్ధేనిషాదే నామాన్య త్వాన్య త్పంచశ్రుతి ధైవతః" (స్వరమేళకళానిధి)

అను శ్లోకరీతిగా పంచశ్రుతి ఋషభ పంచశ్రుతి ధైవతములని తన స్వరమేళకళానిధిలో కారణముతోఁ జెప్పియున్నారు.

14. A. వేఱొకరు స్కాందములో తృతీయాధ్యాయమున సంగ్రహచూడామణి యందు పరమశివుఁడు పార్వతికి ఉపదేశించినట్లు తెనుగున వచనరూపముగా ఎవరో వ్రాసియున్నారు. అది యెటులనిన, ఋషభము మొదలు షడ్జమువఱకు గల 12 స్థానములలో ఒక్కొక్క స్థానమునకును రెండేసి శ్రుతులుగా శుద్ధఋషభము మొదలు వరాళి [ప్రతి] మధ్యమ స్థానమువఱకు గల 6 స్థానములకు $6 \times 2 = 12$ శ్రుతులును, శుద్ధధైవతము మొదలు కాకలీనిషాదమువఱకు గల 4 స్థానములకు $4 \times 2 = 8$ శ్రుతులును, పంచమ షడ్జములు రెంటికిని ఒక్కొక్క శ్రుతివంతున $1 + 1 = 2$ శ్రుతులును, అంతు 22 శ్రుతులుగా లెక్కచేసి, ఈ లెక్కప్రకారము శుద్ధగాంధార స్థానమును జెందినది చతుశ్శ్రుతి ఋషభమనియు, శుద్ధనిషాద స్థానమును జెందినది చతుశ్శ్రుతి ధైవతమనియు చెప్పియున్నారు. ఈ వివరమును క్రింద గనుపింపఁబడియున్న పథకమునఁ జూడుఁడు :

1 2 3 4 5 6 7 8 9 10 11 12

ఈ సంగ్రహచూడామణిలోఁ గల ఈ విషయములు స్కాందమున గనఁబడమింజేసియు, ఈ మార్గము సంగీత రత్నాకరము మొదలయిన ప్రాచీన గ్రంథములలో లేనందునను, భరత మతంగాది మునులు ఇరువదిరెండు శ్రుతులలో ఏ యే శ్రుతులయందు ఏ యే స్వరము లుద్భవించినట్లు చెప్పియున్నారో అట్లు లేనందునను ఒక్కొక స్వరమునకును వివాదిదోషము లేర్పడుటవల్లను ఈ మతము నిజమని నమ్మదగినది కాదని యెంచుటకు సందేహమే లేదు.

పైని చెప్పఁబడియున్న అంతరగాంధార కాకలీనిషాద నిరూపణమును చదువరులు చక్కఁగా గమనించవలయును. స్వరమేళ కళానిధిలోని యంతర గాంధార కాకలీనిషాదములను బ్రహ్మశ్రీ, సుబ్బరామదీక్షితు లావాహించినారు తన పుస్తకములో అంతరగాంధార కాకలీనిషాదములను చ్యుతమధ్యమ చ్యుతషడ్జ స్థానములలోఁ జెప్పియున్నారని స్పష్టముగఁ దెలియుచున్నది. 14 A. దీనిఁ జదివి చూడుఁడు. ఈ పద్ధతిని స్కాందములో నెవరో వ్రాసియున్న ట్లుఁ జెప్పియున్నారు. ఇది సరియైన పద్ధతి కాదనియును, ఇందుఁగల స్వరములన్నియును వివాదులనియును దీక్షితులుగారు చెప్పుచున్నారు. చ్యుత మధ్యమ స్థానములోను చ్యుతషడ్జ స్థానములోను దీక్షితులుగారు చెప్పియున్న అంతరగాంధార కాకలీనిషాదము లైకమత్యముగల స్వరములుగ నున్నప్పుడు స్కాందములోని పైని చెప్పియున్న పద్ధతి యెట్లు వివాదులగునో తెలియ లేదు. ఇందుచేత స్కాందములోని పద్ధతిని సరియని నేను చెప్పఁబూనలేదు. దీక్షితులవారికి శ్రుతి స్వర నిరూపణ విషయములో స్వగతమైన యభిప్రాయము లేదని తెలిపించుటకై యిచ్చట నీ విషయము లుదహరింపఁబడెను.

---

మూర్ఛనలు.

శ్లో॥ క్రమాత్స్వరాణాం సప్తానా మారోహశ్చావరోహణమ్ ।
మూర్ఛనేత్యుచ్యతే గ్రామ ద్వయే తా స్సప్త సప్త చ ॥ (సం. ర.)

తా. స్వరములయొక్క ఆరోహణావరోహణములు మూర్ఛన లనబడును. అట్టి మూర్ఛనలు గ్రామమొకటికి 7 చొప్పున నుండును.

పైని చెప్పిన గ్రామమూర్ఛనలు షడ్జగ్రామమునకు 7 ను, * మధ్యమ గ్రామమునకు 7 ను, గాంధార గ్రామమునకు 7 ను, ఉన్నవని గ్రంథములలో చెప్పఁబడియున్నది. షడ్జగ్రామమునకు షడ్జాదిగ 7 మూర్ఛనలను, మధ్యమ గ్రామమునకు మధ్యమాదిగ 7 మూర్ఛనలను, గాంధార గ్రామమునకు గాంధారాదిగ 7 మూర్ఛనలను గ్రంథకర్త చెప్పియున్నాఁడు. వానికి వరుసగ, ఉత్తరమంద్రాదిగాఁగల 21 పేళ్లను గ్రంథములో వ్రాసియున్నారు.

---

* "మూర్ఛనాధార భూతాస్తే షడ్జగ్రామ స్త్రిషూత్తమః", ఈ పారిజాత శ్లోకము వలన మధ్యమ గ్రామము 400 సంవత్సరములకు మునుపే వాడుకయందు లేదని తెలియుచున్నది. మఱియు పంచమమున కొక శ్రుతి తగ్గినచో, అది వరాళిమధ్యమ మగుచున్నదనియును, ఆ స్వరము షడ్జగ్రామముగనే యున్నదనియును, అందుచేత షడ్జగ్రామ మొకటియే చాలుననియును వేంకటముఖి చెప్పియున్నాఁడు.

## 21 మూర్ఛనలను జూపెడి పథకము.

| సంఖ్య. | మూర్ఛనల పేళ్లు. | ఉదాహరణము. | |
|---|---|---|---|
| | | ఆరోహణము. | అవరోహణము. |
| 1 | ఉత్తరమంద్రము | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 2 | రజనీ | రిగమపధనిసరి | రిసనిధపమగరి |
| 3 | ఉత్తరాయతము | గమపధనిసరిగ | గరిసనిధపమగ |
| 4 | శుద్ధషడ్జము | మపధనిసరిగమ | మగరిసనిధపమ |
| 5 | మత్సరికృత్ | పధనిసరిగమప | పమగరిసనిధప |
| 6 | అశ్వక్రాంతము | ధనిసరిగమపధ | ధపమగరిసనిధ |
| 7 | హృద్గతము | నిసరిగమపధని | నిధపమగరిసని |
| 8 | సౌవీరీ | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 9 | హారిణాశ్వము | రిగమపధనిసరి | రిసనిధపమగరి |
| 10 | కలోపనతము | గమపధనిసరిగ | గరిసనిధపమగ |
| 11 | శుద్ధమధ్యము | మపధనిసరిగమ | మగరిసనిధపమ |
| 12 | మార్గము | పధనిసరిగమప | పమగరిసనిధప |
| 13 | పౌరవి | ధనిసరిగమపధ | ధపమగరిసనిధ |
| 14 | హృష్యకము | నిసరిగమపధని | నిధపమగరిసని |
| 15 | నన్దము | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 16 | విలాసము | రిగమపధనిసరి | రిసనిధపమగరి |
| 17 | సుముఖి | గమపధనిసరిగ | గరిసనిధపమగ |
| 18 | చిత్రము | మపధనిసరిగమ | మగరిసనిధపమ |
| 19 | చిత్రవతీ | పధనిసరిగమప | పమగరిసనిధప |
| 20 | సుఖము | ధనిసరిగమపధ | ధపమగరిసనిధ |
| 21 | ఆలాపము | నిసరిగమపధని | నిధపమగరిసని |

మూఁడు గ్రామములకును గల 21 మూర్ఛనలను పైని గనఁబఱచి యుండు పథకమునఁ జూడుఁడు. మొదటి 7 మూర్ఛనలు షడ్జమును షడ్జముగ నుంచుకొనియును, రెండవ 7 మూర్ఛనలు గాంధారమును షడ్జముగ నుంచుకొనియును, మూఁడవ 7 మూర్ఛనలు మధ్యమమును షడ్జముగ నుంచుకొనియును ప్రస్తరింపబడియున్నవి.

## స్వరప్రస్తారము.

స్వరసమూహములలో స్వరములను హెచ్చు తక్కువలేక లెక్కకు సరిగా ప్రస్తరించుట స్వరప్రస్తార మనఁబడును. ఆ ప్రస్తారము 7 భేదములగును.

| సంఖ్య. | నామములు. | ప్రస్తరింపఁబడు స్వరములు. | ప్రస్తార మొత్తం | ప్రస్తరించు విధము. | ప్రస్తారము |
|---|---|---|---|---|---|
| 1 | ఆర్చికము | స | 1 | $1 \times 1 =$ | 1 |
| 2 | గాధికము | సరి | 2 | $1 \times 2 =$ | 2 |
| 3 | సామికము | సరిగ | 6 | $1 \times 2 \times 3 =$ | 6 |
| 4 | స్వరాంతము | సరిగమ | 24 | $1 \times 2 \times 3 \times 4 =$ | 24 |
| 5 | ఔడవము | సరిగమప | 120 | $1 \times 2 \times 3 \times 4 \times 5 =$ | 120 |
| 6 | షాడవము | సరిగమపధ | 720 | $1 \times 2 \times 3 \times 4 \times 5 \times 6 =$ | 720 |
| 7 | సంపూర్ణము | సరిగమపధని | 5040 | $1 \times 2 \times 3 \times 4 \times 5 \times 6 \times 7 =$ | 5040 |

వాని నామములను భేదములను ప్రస్తారసంఖ్యలను పైగుర్తులఁ జూడుఁడు:

ప్రస్తారసమూహములో స్వరములు జంటగ వచ్చునపుడు మొత్తము ప్రస్తార సంఖ్యను జంట సంఖ్యలచే భాగించినచో ప్రస్తారసంఖ్య యిదియని తెలియును.

(1) ఉ. స స రి.

(a) $\dfrac{1 \times 2 \times 3}{1 \times 2} = 6/2 = 3$-వ భేదము లున్నవని యెఱుంగునది.

స స రి రి గ గ మ

(b) $\dfrac{1 \times 2 \times 3 \times 4 \times 5 \times 6 \times 7}{1 \times 2,\ 1 \times 2,\ 1 \times 2,} = 630$

వివరము.

(1) "స స రి" అను ప్రస్తారములో మూఁడు స్వరము లున్నవి. కనుక $1 \times 2 \times 3 = 6$ అను ఉత్తరము వచ్చును. ఇందులో "స స" అని షడ్జస్వరము రెండుమారు వచ్చియున్నది. కనుక $1 \times 2 = 2$ అను ఉత్తరము వచ్చును. $6 \div 2 = 3$, కనుక "ససరి" యను స్వరసమూహములలోఁ గల మొత్తప్రస్తారము మూఁడని భావము. ఇట్లన్నియు నూహ్యంబులు.

(2) ఒకే స్వరము మూఁడో లేక యధికమైన స్థానములలో వరుసగా వచ్చునపుడు ప్రస్తారసంఖ్యను కనిపెట్టుటకు విధి.

"స స స రి రి గ గ గ గ మ" ఈ ప్రస్తార చోద్యమునకు త్తరము:

$$\frac{1 \times 2 \times 3 \times 4 \times 5 \times 6 \times 7 \times 8 \times 9 \times 10}{1 \times 2 \times 3,\ 1 \times 2,\ 1 \times 2 \times 3 \times 4,} = \frac{3628800}{288} = 12600$$ ప్రస్తారములు.

ఎట్లనిన, ప్రస్తరింపఁదగిన మొత్తము 10 స్వరములు. ఈ పదిస్వరములను 1 మొదలు 10 వఱకు హెంచునపుడు 3628800 వచ్చును. పైని కనఁబఱచియుండు 10 స్వరము

లలో మూఁడు షడ్జములు వరుసగా వచ్చియున్నవి; వానికి సంఖ్య $1 \times 2 \times 3 = 6$. రెండు ఋషభములు వరుసగా వచ్చియున్నవి; వానికి సంఖ్య $1 \times 2 = 2$. గాంధారములు 4 వరుసగా వచ్చియున్నవి; వానికి సంఖ్య $1 \times 2 \times 3 \times 4 = 24$. వీనికి మొత్తము సంఖ్య $6 \times 2 \times 24 = 288$. "3628800" ఈ సంఖ్యను 288-చే భాగించునపుడు 12600 ఉత్తరమువచ్చును. ఇట్లన్నియు నూహ్యంబులు.

(3) స్వరములు జంటలేక 3, 4, 5 వరుసగ రాని ప్రస్తారములలో నిన్నవ ప్రస్తారమిదియని తెలిసికొనుటకు విధి.

ప్రస్తారముయొక్క మొదటి స్వరమునకు ప్రక్కను వచ్చెడి స్వరములను వరుసగా 1 మొదలుగా నెంచి పైని చెప్పిన తీరుననే పెంచవలయును.

తరువాత పెంచఁబడు స్వరమునకు క్రింద నెన్ని స్వరములు వరుసగా రావచ్చునో యీ సంఖ్యవల్ల పైని పెంచిన మొత్తమును పెంచవలయును.

ఇట్లన్ని స్వరములను వేఱువేఱుగ పెంచవలయును. ఇట్లు వచ్చెడి సంఖ్యలతో, (1) అను సంఖ్యను జేర్చి కూర్చినచో ప్రస్తారసంఖ్య యగును.

"మరిగస" అను ప్రస్తారములో

మధ్యమమునకు వెనుక మూఁడుస్వరము లున్నవి. కనుక $1 \times 2 \times 3 = 6$; మధ్యమమునకు వెనుక నుండు స్వరములు వరుసగ "సరిగ" యనునపుడు మధ్యమమునకు తగ్గినవియే. కనుక మధ్యమమునకు వెనుకనుండు 3 స్వరములును, మధ్యమమునకు క్రింది స్వరములే యగును.

పైని వచ్చియున్న 6-వ సంఖ్యను 3-వ సంఖ్యతో పెంచునపుడు "6 = 3 = 18" అగును. ఇట్లన్నియును జేయుఁడు.

1 2 3 4
"మ రి గ స"

(1) $1 \times 2 \times 3, \times 3 = 18$
(2) $1 \times 2 \times, \quad \times 1 = 2$
(3) $1, \quad , \times 1 = 1$
(4) $0, \quad + 0 = 0$

21

1 సంఖ్యను గూర్చునపుడు 1

22 ఉత్తరము.

స్వరాంత ప్రస్తారములో "మరిగస" యనునది 22-వ ప్రస్తారమగును.

ఇట్లే, "సమనిధస"

| | | |
|---|---|---|
| స | $1 \times 2 \times 3 \times 4,$ | $\times 0 = 24$ |
| మ | $1 \times 2 \times 3,$ | $\times 1 = 6$ |
| ని | $1 \times 2,$ | $\times 2 = 4$ |
| ధ | $1,$ | $\times 1 = 1$ |
| స | $0$ | $\times 0 = 0$ |

$35 + 1 = 36$ ఉత్తరము.

ఇట్లన్నియు నూహ్యంబులు.

స్వరప్రస్తారములను తెలిసికొనుటకును, నష్టోద్దిష్టములను కనిపెట్టుటకును పైని చూపిన ప్రకారముగ సులభమైన గణిత శాస్త్రిపు ప్రోవలుండునపుడు, అనవసరముగ ప్రస్తారములను వరుసగా వ్రాసి గ్రంథవిస్తారము జేయుటవల్ల ఫలమేదియు లేదు. కనుక ప్రస్తారక్రమములను వ్రాయలేదు.

---

అలంకారము :—శ్లో॥ విశిష్టవర్ణ సందర్భ మలంకారం ప్రచక్షతే ।
తత్రభేదా బహువిధా స్తత్ర స్థాయిగతాన్బ్రువే ॥ (ర.ర.)

పై శ్లోకమువలన వర్ణము ననుసరించి క్రమముగఁ జేర్చఁబడు స్వరము లలంకారమనియును, అవి యనేకవిధము లనియును చెప్పియున్నాఁడు. అలంకారములేని గీతము ప్రయోజనము లేదని భరతుఁడు చెప్పియున్నాఁడు.

"శశినారహితేన నిశా విజలేవనదీ లతా విపుష్పేవ ।
అవిభూషితేవ కాంతా గీతి రలంకారహీనా స్యాత్ ॥ (భరత)

రత్నాకరములో స్థాయిగతాలంకారము, ఆరోహ్యలంకారము, అవరోహ్యలంకారము, సంచార్యలంకారము, సప్తాలంకారం మను 5 అలంకార పద్ధతులును, వానికి లక్షణములును జెప్పఁబడియున్నవి. చతుర్దండిప్రకాశికలో సప్తతాళమునకు సప్తాలంకారములను ఝంపటాలంకార మను ఆది తాళాలంకారముతో చేర్చి 8 అలంకారములు జెప్పఁబడియున్నవి. గ్రంథ విస్తరభీతిచే నిచ్చట వానికి నుదాహరణములను వ్రాయలేదు.

---

తానము :—శుద్ధతానమనియును, కూటతానమనియును రెండు విధము లగుచున్నది. ఒక రాగమును మాత్రము ప్రకాశించునట్లుచేయుట శుద్ధతాన మనఁబడును. ఉ. శంకరాభరణము.

రెండు రాగకళలనో లేక యధికమైన వేఱు రాగకళలనో స్ఫురింపఁ జేయు తానము కూటతాన మనఁబడును. ఉ. కాంభోజి–ఝంఝూటి మొదలైనయవి.

వర్ణము:—వర్ణ మనునది గానక్రియ. అది నాలుగు విధములు. వానికి వరుసగ స్థాయి, ఆరోహి, అవరోహి, సంచారి యని పేర్లు.

ప్రారంభించిన స్వరములలోనే వచ్చి నిలిచెడి క్రియ "స్థాయి" వర్ణ మగును. ఉదాహరణము. స స స. Etc.

ప్రారంభించిన స్వరమునుండి క్రమముగఁ బైనిఁ జెల్లు క్రియ "ఆరోహి" యగును. ఉ. సరిగమప, రిగమపధా, Etc.

అట్లే క్రిందికి దిగెడు క్రియ "అవరోహి" యగును.

ఉ. సనిధపమ – నిధపమ, Etc.

పైని చెప్పిన క్రియలకు సంకరము జేరినది, "సంచారి" యనంబడును.

---

## సంగీతరత్నాకరగత జాత్యాది విమర్శన పధకము.

| సంఖ్య. | జాతి నామములు. | అంశ స్వరములు. | న్యాస స్వరములు. | అపన్యాస స్వరములు. | మూర్ఛనలు. | షాడవకారి స్వరములు. | ఔడవకారి స్వరములు. | షరాలు. |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | షాడ్జీ | సగమపధ | స | గమ | ఉత్తరాయతా | ని | ० | |
| 2 | ఆర్షభీ | రిధని | రి | రిధనీ | శుద్ధషడ్జా | స | సప | |
| 3 | గాంధారీ | సగమపని | గ | సప | పౌరవి | రి | రిధ | |
| 4 | మధ్యమా | సరిమపధ | మ | సరిమపధ | కలోపనతా | గ | గని | |
| 5 | పంచమీ | రిప | ప | రిపని | కలోపనతా | గ | గని | |
| 6 | ధైవతీ | రిధ | ధ | రిమధ | అభిరుద్గతా | ప | సప | |
| 7 | నైషాదీ | సగని | ని | సగని | అభిరుద్గతా | ప | సప | |
| 8 | షడ్జకైశికీ | సగప | గ | సపని | .. | ० | ० | |
| 9 | షడ్జోదీచ్యవా | సమధని | మ | సధ | అశ్వక్రాన్తా | రి | రిధ | |
| 10 | షడ్జమధ్యమా | సరిగమపధని | సమ | సరిగమపధని | మత్సరికృతా | ని | గని | |
| 11 | గాంధారోదీచ్యవా | సప | మ | సధ | పౌరవి | రి | ० | |
| 12 | రక్తగాంధారి | సగమపని | గ | గ | కలోపనతా | రి | రిధ | |
| 13 | కైశికీ | సగమపధని | గపని | సగమపధని | హారిణాశ్వా | రి | రిధ | |
| 14 | మధ్యమోదీచ్యవా | ప | మ | సధ | సౌవీరీ | ० | ० | |
| 15 | కార్మారవి | రిపధని | ప | రిపధని | శుద్ధమధ్యా | ० | ० | |
| 16 | గాంధారపంచమీ | ప | గ | రిప | హారిణాశ్వా | ० | ० | |
| 17 | ఆంధ్రి | రిగపనీ | గ | రిగపని | సౌవీరీ | స | ० | |
| 18 | నంధ్యయన్తీ | ప | గ | మప | హారిణాశ్వా | స | ० | |

*జాతులకును గ్రహాదిగా గల 13 భేదము లున్నవి. వానిని, సం. ర. స్వర ప్రకరణములో జూడుఁడు.

## గమకములు.

సంగీతరత్నాకరములో ప్రకీర్ణకాధ్యాయములో గమకములను జెప్పి యున్నాఁడు. వానిలోఁ గొన్నిటి నీ దిగువ వివరింతము.

శ్లో॥ స్వరస్యకంపోగమకః శ్రోతృచిత్తసుఖావహః ।
తస్యభేదాస్తుతిరిపః స్ఫురితః కంపితస్తథా ॥

లీన ఆందోలిత వలీ స్త్రిభిన్నకురులాహతాః ।
ఉల్లాసితః ప్లావితశ్చ గుంఫితో ముద్రిత స్తథా ।
నామితో మిశ్రితః పంచ దశేతి పరికీర్తితః ॥ (సం. రత్నా.)

స్వరముయొక్క కదలింపు గమక మనఁబడును. ఆ గమకము శ్రోత్ర మునకును చిత్తమునకును సుఖము నిచ్చునట్టిదై యుండవలయును. అవి 15 విధములు. వాని పేళ్లును వాని నుపయోగించు విధములును నీదిగువ జూడుఁడు.

(1) తిరిపము : ఒక స్వరములో నిలిచి, ఆ స్వరము నదిమి దాని డాసిన మఱియొక స్వరకళనుఁ బలికించుట.

(2) కంపితము : ఒక స్వరములో నిలిచి దానిని కదలించుట. అట్లు కదలించునపుడు దానికి డాసిన స్వరచ్ఛాయ రాకుండ నుండవలయును.

(3) స్ఫురితము: ఒక స్వరమును జంటగ పలికించునపు డా స్వరమునకు దిగువనుండు స్వరమును సూక్ష్మముగ మధ్యలో పలుకునటులఁ జేయుట. ఉ॥ "స స" అను జంటస్వరమును "స ని స" అని నిషాదము సూక్ష్మముగ పలుకునటులఁ జేయుట. ఇట్టి ప్రయోగముల నుపయోగించునపుడు ప్రయోగింపఁబడు స్వరములకు క్రిందిస్వరమునుండియే ప్రయత్నము చేయవలయును.

(4) లీనము : ఒక స్వరమునందు నిలిచి దానికి డాసిన స్వరములో నాదమును లయింపఁజేయుట. ఉ. "సా ; ; రి. "

(5) ఆన్దోలితము: ఒక స్వరములోనే 4 లేక 5 అక్షరకాలములు నిలిచి తిన్నగ నా స్వరము నూఁగించి దానికి డాసిన స్వరచ్ఛాయను సూక్ష్మముగ పలికించుట.

(6) వలీ : ఒక స్వరమున నుండి తంత్రినీడ్చి దానికి డాసిన స్వరకళను పలికించుట.

(7) త్రిభిన్నము : "త్రిభిన్నస్తు త్రిషుస్థానే ష్వావిశ్రాంత ఘనస్వరః". ఏకకాలమున మూఁడు తంత్రులపై వ్రేలినిడి మీటి, మూఁడు స్వరములును బలుకునటులఁ జేయుట. ఈ ప్రయోగమును వీణలో సాధారణముగఁ జేయుచున్నారు.

(8) కురుళము : ఒక స్వరస్థానములోనుండి డాసిన మఱియొక స్వరచ్ఛాయను బిగితో పలికించు నొరయిక కురుళ మనఁబడును.

ఉ. "సీధాపామా" యనుటకు "సీ, స ధా, ని పా, ధ మా" యని పలికించుట. (ఒక స్వరమునుండి దానికి డాసిన రెండు మూఁడు స్వరముల

నేక కాలమున నొకే యొదిగింపుచే పలుకునటుల చేయుటయును కురుళ మనఁబడును.)

(9) ఆహతము :—(దీనిని రవజాతి యని చెప్పుదురు) ఏదైన నొక స్వరమును పలికించుకొని మఱియొక స్వరమునకు దిగునపుడు డాసిన స్వర చ్ఛాయను సూక్ష్మముగ పలికించుకొని దిగుట.

ఉ. "గరి" అని దిగునపుడు "గగరి" అని మఱియొక గాంధార మును సూక్ష్మముగఁ బలికించుకొని దిగుట.

(10) ఉల్లసితము:—ఇదియే జారు యనునది. ఇందులో ఎక్కుజారు, డిగుజారు అని రెండువిధము లున్నవి. ఒక స్వరముననుండి దానికి పైనుండు మఱియొక స్వరమున కేఁగునపుడు మధ్యలోనుండు స్వరములమీఁద వ్రేలిని రాచుకొని పోవుట. "పసా" అనునపుడు "పధనిసా" అని ధైవత నిషాదము లతిసూక్ష్మముగ నుండునటుల పలికించుట నెక్కుజా రనఁబడును. ఇట్లే యవరోహణముగ వచ్చుట డిగుజారు అనఁబడును.

(11) ప్లావితము :—ఒక స్వరమునందే కొన్ని మాత్రలకాలము తేలియుండి దానికి డాసిన స్వరకళను రప్పించుట. (12 అక్షరములకాలము తేలియుండవలయు ననునది గ్రంథాంతరగతాభిప్రాయము.)

(12) గుంఫితము :—ఇందుకు గ్రంథాంతరములో హుంఫితమనియు నొక పేరు గనఁబడుచున్నది. దీనిని గుంభిత మని సంగీతసంప్రదాయ ప్రదర్శి నిలో వ్రాసియున్నారు. ఇది ఫభయోా రభేదత్వమని తెలియుచున్నది. ఆరో హణావరోహణములయందు "హుంంంం" అని శబ్దించునటుల నాదమును బుట్టించుట గుంఫిత మనఁబడును.

(13) ముద్రితము :—నోటిని మూసికొని పాడునపుడు గలుగు గమకమునకు ముద్రిత మని పేరు.

(14) నామితము :—నాదమును తగ్గించు సూక్ష్మధ్వనితో పాడు నపుడు గలుగు స్వరముల కదలింపు నామిత మనఁబడును.

(15) మిశ్రితము :—పైని కనఁబఱచియుండు గమకములు రెండు మూఁడు చేరి పలుకుట మిశ్రిత మనఁబడును.

పైని చెప్పఁబడిన 15 గమకములకును నిశ్శంకుఁడు సంగీతరత్నాకర ములో మాత్రాకాలములను చెప్పియున్నాఁడు. మఱియు, "ఏతేషాం మిశ్రణా

న్మిశ్ర స్తస్యాస్యుః ర్బ్యారయోభిధాః” అని పైని చెప్పియున్న గమకము నొకటితో నొకటి చేరి మిశ్రగమకము లగుచున్నదనియును, అవి యనేక మనియును జెప్పియున్నాఁడు. “తాసాంతు స్థాయవాగేషు వివృతి స్సంవిధా స్వతే॥” అని యీ గమకములు స్థాయవాగములో నుపయోగింపఁబడుచున్న వనియును చెప్పియున్నాఁడు. స్థాయ మను శబ్దమునకు రాగావయవమని యర్థము ; వాగ మను శబ్దమునకు గమకము అని యర్థము. స్థాయవాగ మనఁగా గమకముల నవయవముగఁ బడసిన రాగమని తాత్పర్యము. నిశ్శంకుఁడు రత్నాకరములో 96 స్థాయములను, రాగావయవములను వానికి సంకీర్ణాసంకీర్ణ లక్షణములను జెప్పియున్నాఁడు. వానిని రత్నాకరము ప్రకీర్ణకాధ్యాయములోఁ జూడుఁడు.

## ప్రకృతపు గ్రంథగత దశవిధ గమకములు.

శ్లో॥ ఆరోహశ్చావరోహశ్చ ఢాలు స్ఫురితకంపితాః ।
ఆహతః ప్రత్యాహతశ్చ త్రిపుచ్ఛాందోళ మూర్ఛనాః ॥

ఆరోహణము, అవరోహణము, ఢాలు, స్ఫురితము, కంపితము, ఆహతము, ప్రత్యాహతము, త్రిపుచ్ఛము, ఆందోళనము, మూర్ఛన యని పది గమకములను, ఇప్పటి గ్రంథములలో గ్రంథకర్తలు వ్రాసియున్నారు. ఇందు ఆరోహణావరోహణముల మూర్ఛన గమకములు కానేరవు. ఈ మూఁడును మధ్యకాల త్రికాల శైలిలోనే మిక్కుటముగ వాడఁబడు చున్నవి ; కనుక, వీనికి కంపము కలుగుట లేదు. పైనిచెప్పిన దశవిధ గమకములు ప్రాచీనగ్రంథగతపద్ధతి కాదు. ప్రాచీనగమకములలోఁ గొన్నిఁటినిఁ జేర్చి యీ దశవిధ గమకముల నెవరో కల్పించియున్నా రనియే చెప్పఁదగినదిగా నున్నది. మఱియు, నీ దశవిధ గమకములవల్ల రాగములను సంపూర్ణముగ పోషించుట సాధ్యముకాదు. నిశ్శంకుఁడు చెప్పిన తీరున గమకము లనేకములుగ నుండినఁగాని రాగస్ఫూర్తి కలుగదని స్పష్టముగ తెలియుచున్నది. రాగములను పాడునపు డందు వచ్చెడి గమక సంయుక్తమైన కళ లిన్నియని లెక్కఁజేయుటకు సాధ్యము లేక యుండుటయే యిందులకు ప్రత్యక్ష ప్రమాణ మగును.

---

## రాగము.

శ్లో॥ యోఽసౌ ధ్వని విశేషస్తు స్వరవర్ణ విభూషితః ।
రఞ్జకోజన చిత్తానాం సరాగః కథితో బుధైః ॥

తా. స్వరవర్ణములచే నలంకరింపఁబడినదియును, వినువారి మనస్సునకు రంజకమును కలిగించునదియు నైన ధ్వనివిశేషము రాగ మనఁబడును.

శ్లో॥ గ్రహాంశ మంద్రతారాణాం న్యాసాపన్యాసయో స్తథా
అల్పత్వస్య బహుత్వస్య షాడవౌడువయోరపి ।
అభివ్యక్తిర్యత్ర దృష్టా సరాగాలాప ఉచ్యతే ॥

(సంగీత రత్నాకరము, రాగవివేకాధ్యాయము.)

శ్లో॥ గ్రహాంశతారమన్ద్రాశ్చ న్యాసాపన్యాసకౌతథా ।
అపి సన్యాస విన్యాసౌ బహుత్వంచాల్పతా తతః ॥
ఏతాన్యన్తరమార్గేణ సహాలక్ష్మాణిజాతిషు ।
షాడవౌడువితే శ్చాపీ త్యేవమాహు స్త్రయోదశ ॥

(సంగీత రత్నాకరము, స్వరాధ్యాయము 7-వ ప్రకరణము.)

పైని చెప్పియున్న శ్లోకములచే గ్రహాంశన్యాసాది లక్షణములను రత్నాకరకారుఁడు రెండుతావులలోఁ జెప్పియున్నాఁడు. జాతులను గుఱించిన పట్టికను ఈ గ్రంథముయొక్క 79-వ పుటలో జూడుఁడు. పైని చెప్పిన గ్రహాంశన్యాసాది లక్షణములను గ్రంథకర్త జాతిప్రకరణములోనే చెప్పియున్నాఁడు. రాగాధ్యాయములోను మఱియొకమాఱు జెప్పియున్నాఁడు. అందుచేత గ్రహాంశాది లక్షణములు జాతులకును రాగములకునుఁ గలదని తెలియుచున్నది. రత్నాకర గ్రంథగత రాగములన్నిఁటికిని జాతులే యాధారముగ నున్నవి. జాతులలోని రహస్యములను తెలిసికొనుటకుమునుపు రాగములను పాడుట సాధ్యముకాదు. జాతులలోని విషయము లివి యని తెలిసికొనుటకు సాధ్యములేక యున్నవి. ఎందుచేతననఁగా, గ్రంథకర్తయొక్క శుద్ధ వికృత స్వరనిరూపణములు షడ్జపంచమ భావమునకు సరిగా నుండలేదు. స్వరములను ముందువెనుకగఁ జేసి వానిపై జాతినిర్ణయమును చెప్పియున్నాఁడు. ఆ జాతులమీఁద రాగములను జెప్పియున్నాఁడు. అందుచేత జాత్యానుసారముగ రాగమును లెక్కచేయునపుడు ప్రకృతపు వాడుకకు నేదియును సరిగా నుండలేదు.

ఇచ్చట నొక విషయమును మన మిత్రులకుఁ దెలుపుట యవశ్యకమని యెంచెదను. 1916-వ సంవత్సరము మార్చి నెలలో గూడిన బరోడా సంగీత

సభలో (All-India Music Conference) మిస్టరు దేవాలుగారును, మిస్టరు క్లెమెన్సు (I C. S) దొరవారును ద్వావింశతి హార్మోనియమని యొక హార్మోనియమును సిద్ధపఱచి నా యార్మోనియములో సంగీతరత్నాకరములోని రాగము లన్నియును వాయించవచ్చునని చెప్పి సదరు హార్మోనియమును కాన్ఫరన్సులో నిదర్శనము చూపుటకై తెచ్చిరి. ఆ హార్మోనియము ద్వావింశతి శ్రుతుల పద్ధతి కాదనియును, అందు రత్నాకర రాగములను వాయించుట వట్టి స్వప్నావస్థయగుననియును, ఋజువు జేయఁబడెను. రత్నాకరములోని జాతులను కనిపెట్టుట యసాధ్యము కాదని మిస్టరు క్లెమెన్సుగారును, మిస్టరు దేవాలుగారును జెప్పినారు. రత్నాకరములోని శ్రుతు లివియనియును శుద్ధ వికృత స్వరము లివియనియును తెలిసికొనలేక యుండునపుడు వానిమీఁద నేర్పఱుపఁబడిన జాతులను తెలిసికొనుటకు ప్రయత్నించుట నెంతయు నుచితము కాదనియును, రత్నాకర రాగములను వాయించుట సాధ్యము కాదనియును మిస్టరు భాత్కండె (Mr. V N. Bhatkande) గారును నేనును నిరూపించితిమి. మా యభిప్రాయమును సభ్యు లంగీకరించిరి. మిస్టరు క్లెమెన్సుగారును మిస్టరు దేవాలుగారును సోమనాథుని శుద్ధస్వరములు కాఫిస్వరము లనియును, అది యార్షభిజాతి యనియును చెప్పినారు. మఱియు,రత్నాకర శుద్ధస్వరములకు సోమనాథుని శుద్ధస్వరపద్ధతి సరిగా నుండలేదనియు చెప్పినారు. ఇట్లు వీరు చెప్పిన పద్ధతి సరికాదని ఋజువు చేయఁబడెను. మిస్టరు దేవాలును, మిస్టరు క్లెమెన్సుగారును, రత్నాకరము లోని జాతు లివియని చక్కఁగ నెఱిఁగక రాగములను నిర్ణయము చేయ నారంభించినందువలన వారి కిట్టి తప్పులు శుద్ధస్వరములోనే కలిగెను. సంగీతరత్నాకరములోని జాతు లెంతయును వ్యక్తముగ లేవు. అందుచేత రత్నాకరములోని రాగములు వాఁడుకలోనుండి తొలఁగిపోయెను.

(1) గ్రహము :—గ్రహస్వర మని తాత్పర్యము. రాగములకో, లేక సంగతులకో ప్రారంభస్థానమై యున్న స్వరము గ్రహ స్వర మనఁబడును. రాగములో షడ్జమునే గ్రహాంశన్యాసముగఁ గొనవలయునని కొందఱి యభిమతము.

(2) అంశము :—అంశస్వర మని తాత్పర్యము. రాగములనుగాని, సంగతులనుగాని పాడునపుడు రాగకళను చూపుటకై మాటిమాటికిని వచ్చెడి స్వరము అంశస్వర మనఁబడును.

(3) న్యాసము :—న్యాసస్వరమని చెప్పఁదగినది. రాగములలో నైనను సంగతులలోనైనను గల చివర స్వరము న్యాస స్వర మనఁబడును.

(4) మంద్రము :—మంద్రగతిగఁ బాడఁబడు స్వరము. తగ్గుగఁ బాడఁబడు స్వరములు మంద్రస్వరము లగును. ఈ మంద్రస్వరములు మంద్రస్థాయి స్వరములే యగునని కొంద అభిప్రాయపడుచున్నారు.

(5) తారము :—ఉచ్చస్వరము. ఉచ్చమైన ధ్వనితో పాడఁబడు స్వరము తారస్వరమగును. తారస్థాయిలోని స్వరములే తారస్వరము లని కొందఱి యభిమతము.

(6) అపన్యాసము :—మధ్యలో ముగించెడి స్వరము. ఒక రాగమును పాడునపుడు మధ్యమధ్యలో ముగించెడి స్వరము అపన్యాస మనఁబడును.

(7) సన్యాసము :—ఖండములను సన్యసించు స్వరము. ఒక రాగమును పలుఖండములుగ విభజించి పాడునపుడు ఆయా ఖండమును ముగించుట సన్యాస మనఁబడును.

(8) విన్యాసము :—ఖండముల కవయవమైన స్వర మని భావము. ఒక రాగమును పలుఖండములుగఁ జేసి పాడునపుడు ఆయా ఖండములో రాగకళను జూపుటకై మాటిమాటికి వచ్చెడి స్వరము విన్యాస స్వర మనఁబడును.

(9) అల్పత్వము :—రాగములో నల్పప్రయోగము గల స్వరము. ఈ యల్పత్వము అనభ్యాసము, లంఘన మని రెండు విధము లగును. అందు అనభ్యాస మనఁగా ఒక స్వరము నేదో యొకసమయమున నుచ్చరించుట. లంఘన మనఁగా నొక స్వరమును మధ్యలో విడిచి దానికి డాసిన స్వరమునకు దాఁటుట.

(10) బహుత్వము :—రాగములో పలుమాఱు నుపయోగింపఁబడు స్వరము. ఇది అభ్యాసమనియును, అలంఘన మనియును నిరు తెఱంగు లగును. అభ్యాస మనఁగా ఒక స్వరము నెడతెగకనైనను మాటిమాటికైనను ఉచ్చరించుట. అలంఘన మనఁగా రాగములో నెప్పుడును విడువక పాడఁబడు స్వరము.

పైని చెప్పఁబడిన దశవిధ రాగ లక్షణములును ఇప్పటి వాడుకలో నున్నదను విషయము చక్కఁగ పరిశీలనముఁ జేయువారికి స్పష్టమగును. అట్లుండియును, గ్రహాంశ న్యాసములుతప్ప తదితర లక్షణములు ప్రాచీన

రాగములలో మాత్ర ముపయోగింపఁబడె ననియును, ఇప్పటి కాలములో నవి వాడుకలో లేవనియును వెంకటమఖి చెప్పియున్నట్లు తెలియుచున్నది.

## ప్రాచీన రాగములు.

రత్నాకరములో మార్గరాగములు స్వర్గములో నున్నవని చెప్పఁబడి యున్నది. అందుచేత ఈ మార్గరాగములు గాంధారగ్రామ కుటుంబములని మనము సులభముగ నూహింపవచ్చును. షడ్జమధ్యమ గ్రామములకు సంబంధమైన 264 రాగములను నిశ్శంకుఁడు చెప్పియున్నాఁడు. ఈ రాగములలో నిప్పటి వాఁడుకలోనుండు అనేకరాగముల పేళ్లున్నవి. ఈ రాగములను పరిశీలనము చేయునపుడు గ్రంధగత పద్ధతికిని వాడుకకును చాల వ్యత్యాసము గలుగుచున్నది. అందుచేత రత్నాకరములోని దేశ్యరాగములును గ్రామ రాగ ఉపరాగ భాషావిభాషా అంతరభాషాది మార్గరాగములతోఁ జేరి స్వర్గము నలంకరించిన వనియే చెప్పఁదగినది. ఇట్లు స్వర్గగతంబులై యున్న రాగములను శ్రమపడి భూలోకమునకు తెప్పించుటకన్న ఇప్పుడు భూలోకమునుండి స్వర్గప్రయాణమును జేయుటకు సిద్ధమైయుండు రాగములను పోనీయక కాపాడుటయే యుక్తము. గ్రంథవిస్తరభీతిచేత వానిని ఇచట విస్తరింపలేదు.

## దేశ్యరాగములు.

దేశ్యరాగము : రాగాంగము, ఉపాంగము, భాషాంగము, క్రియాంగము అని నాలుగు విధముల నొప్పును.

(1) రాగాంగరాగములు :—జన్యరాగములకు జనకస్థానమై యుండు అన్ని సంపూర్ణరాగములును రాగాంగరాగము లనఁబడును. ప్రకృతములో నుండెడి 72 మేళకర్తరాగములును రాగాంగమనియే చెప్పఁదగినవి.

(2) ఉపాంగ రాగములు :—రాగాంగరాగములో (మేళకర్త రాగములో) జనించు జన్యరాగములు ఉపాంగరాగము లనఁబడును.

(3) భాషాంగములు :—ఒక రాగాంగములో జనించి తన రాగాంగమునకుఁ గల ప్రకృతి వికృతి స్వరములచే మఱియొక రాగాంగ వికృతి స్వరములలో నొకటియో లేక అధికమైన స్వరములనో స్వీకరించుకొని స్ఫురించునది భాషాంగ మనఁబడును.

(4) క్రియాంగము :—"కరుణోత్సాహ సంయుక్తం క్రియాంగం తేన హేతునా" అని సంగీతదర్పణములోఁ జెప్పియున్నాఁడు. ఇంద్రియములకు ఉత్సాహమును గలిగించునది క్రియాంగ మనఁబడును. గొప్పకార్యములను చేయునపుడు ఇంద్రియములకు ఉత్సాహమును గలుగఁజేయు రాగములు. ఉదాహరణము : యుద్ధము చేయునపుడు శూరులను ప్రోత్సాహపఱచుటకై నుపయోగించు రాగములు మొదలగునవి.

మతంగుఁడు, "శుద్ధాశ్ఛాయాలగాః ప్రోక్తాః సంకీర్ణశ్చ తథైవచ" అని రాగములో మూఁడు భేదములను చెప్పియున్నాఁడు. శాస్త్రోక్త నియమ ప్రకారముగ నొకే రాగకళతో స్ఫురించునది శుద్ధ మనియును, అన్యరాగ చ్ఛాయను స్వీకరించుకొనివచ్చు రాగములు ఛాయాలగ మనియును, అనేక రాగచ్ఛాయలతో స్ఫురించునది సంకీర్ణ మనియును తెలియుచున్నది. సంగీత దర్పణములో, "శివశక్తిసమాయోగా ద్రాగాణాం సంభవేభవేత్ । పంచా స్యాత్పంచ రాగాస్యుః షష్ఠస్తు గిరిజాముఖాత్ ॥ సద్యోవక్త్రాత్తు శ్రీరాగో వామదేవాద్వసంతకః । అఘోరాద్భైరవోఽభూత్తత్పురుషాత్పంచమో ఽభవేత్ ॥ ఈశానాఖ్యా న్మేఘరాగో నాట్యారంభే శివాదభూత్ । గిరిజా యాముఖాల్లాస్యే నట్టనారాయణోభవేత్ ॥" శివశక్తి సమాగమముచే రాగము గలిగినదనియును, శివునియొక్క సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము అను పంచవక్త్రములయందును క్రమముగ శ్రీరాగము, వసంతము, భైరవము, పంచమము, మేఘరాగము అను రాగములు బుట్టినవనియును, పార్వతిముఖములో నట్టనారాయణి రాగము పుట్టినదనియును చెప్పఁబడియున్నది.

స్త్రీరాగ పురుషరాగ నిరూపణమును, రాగములకు గాన కాల నిరూపణమునుఁ జెప్పునపుడు నానావిధములైన యభిప్రాయములను పూర్వ గ్రంథకారులు చెప్పియున్నారు. ఈ తీరుననే పూర్వప్రసిద్ధ మేళములను చెప్పి యున్నారు. కొందఱు పూర్వప్రసిద్ధ మేళకర్త రాగములు 18 అనియును, కొందఱు 20 అనియును చెప్పియున్నారు. ఇట్లే పూర్వగ్రంథగతమైన యనేక విషయము లొకటితో నొకటి సంబంధములేక యున్నవి.

సంగీతదర్పణములో స్త్రీరాగ పురుషరాగ, గానకాల నిరూపణ మును పరమశివుఁడు పార్వతికి చెప్పినటులు వ్రాయఁబడియున్నది.

### ఈశ్వర ఉవాచ.

శ్రీరాగోఽథ వసన్తశ్చ భైరవః పంచమస్తథా ।
మేఘరాగో బృహన్నాట షడైతే పురుషాహ్వయాః ॥

శ్రీరాగము, వసంత, భైరవ, పంచమ, మేఘ, బృహన్నాట ఈ 6 న్ను పురుషరాగములు.

### శ్రీరాగమునకు భార్యలు.

మాలశ్రీ, త్రివణీ, గౌరీ, కేదారీ, మధుమాధవీ, పాహటీ ఇవి 6 న్ను శ్రీరాగమునకు భార్యలు.

ఇట్లన్ని పురుషరాగములకును భార్యలును, రాగములకు గానకాలములును జెప్పఁబడియున్నవి. వానిని సంగీతదర్పణములోఁ జూడుఁడు.

### హనుమన్మతమునందు

భైరవః కౌశికశ్చైవ హిందోళోదీపకస్తథా ।
శ్రీరాగో మేఘరాగశ్చ షడైతే పురుషాహ్వయాః ॥

భైరవము, కౌశికము, హిన్దోళము, దీపకము, శ్రీరాగము, మేఘరాగము అని 6 రాగములను పురుషరాగములుగఁ జెప్పఁబడియున్నవి. ఈ పురుషరాగములకు పైని చెప్పిన సంగీతదర్పణములోని పద్ధతికి వ్యత్యాసమైన రాగిణులను (స్త్రీరాగములను) చెప్పఁబడెను.

శ్రీమాఙ్గతచ్ఛూరి సింగరాచార్య ప్రణీతంబగు గాయకలోచనమను గ్రంథములో మఱియొక పద్ధతి రాగవిమర్శనమును జెప్పియున్నారు. ఈ రాగవిమర్శన పద్ధతి ఏ గ్రంథగత పద్ధతియో తెలియలేదు. ఈ దిగువ జూడుఁడు :

### రాగ విమర్శనము.

శ్లో॥ భైరవశ్చాపిభూపాలః శ్రీరాగః ఫలమంజరీ ।
వసంతోమాళవశ్చాపి బంగాళోనాటకస్తథా ।
ఏతేఽష్టరాగాస్సర్వత్ర పుం రాగా ఇతి కీర్తితాః ॥
శంభుర్విష్ణుశ్శారదాచ లక్ష్మీర్భాస్కరనారదా ।
గణేశ స్తుంబురు ర్దేవా రాగాణాంచ యథాక్రమమ్ ॥
విప్రౌ భైరవభూపాలౌ కీర్తితౌ సామవేదినౌ ।
పార్థివౌసామగాప్రోక్తౌ శ్రీరాగః ఫలమంజరీ ॥

వసంతో మాళవశ్చాపి ఋగ్వేదీవైశ్యకస్స్మృతః
అథర్వవేదినా శూద్రా స్యాతాం బంగాళనాటకౌ ॥

| పురుషరాగ ములు. | అధిదేవతలు. | కులములు. | వేదములు. | రసములు. | గుణములు. |
|---|---|---|---|---|---|
| భైరవి | శివుఁడు | బ్రాహ్మణ | సామ | రౌద్ర | రాజసము |
| భూపాలము | విష్ణువు | ,, | ,, | శృంగార | ,, |
| శ్రీరాగము | సరస్వతి | క్షత్రియ | యజుస్సు | భీభత్స | తామసము |
| ఫలమంజరి | లక్ష్మి | ,, | ,, | కరుణ | ,, |
| వసంత | సూర్యుఁడు | వైశ్య | ఋక్కు | హాస్య | సాత్త్వికము |
| మాళవము | నారదుఁడు | ,, | ,, | భయానక | ,, |
| బంగాళ | వినాయకుఁడు | శూద్ర | అథర్వణము | అద్భుత | రాజసము |
| నాట | తుంబురుఁడు | ,, | ,, | వీర | ,, |

## స్త్రీ రాగములు.

దేవక్రియా, మేఘరంజీ, కురంజీ, ఇవి భైరవి రాగమునకు భార్యలు.
బిలహరీ, మలహరీ, ఖాండీ, ఇవి భూపాల రాగమునకు భార్యలు.
ఆంధాళీ, భల్లాతీ, సాహుళీ, ఇవి శ్రీరాగమునకు భార్యలు.
దేశీ, ముఖారీ, లలితా, ఇవి ఫలమంజరి రాగమునకు భార్యలు.
రామక్రియా, వరాళీ, గౌళా, ఇవి వసంత రాగమునకు భార్యలు.
గుండక్రియా, ఘూర్జరీ, జాళీ, ఇవి మాళవ రాగమునకు భార్యలు.
కల్యాణీ, ఆహిరీ, సావేరీ, ఇవి బంగాళ రాగమునకు భార్యలు.
ఘంటారవము, కాంభోజీ, శంకరాభరణము, ఇవి నాట రాగమునకు భార్యలు.

సూతిరాగములు :— భైరవికి కన్నడా; భూపాలమునకు దేశాక్షీ, దేవగాంధారి; శ్రీరాగమునకు దేశీ; ఫలమంజరికి అసావేరి: వసంతకు మోహనా; మాళవమునకు హిందోళము; బంగాళకు భోగీ; నాటకు వేళావళీ.

సంకరరాగముల కుదాహరణము :— మేఘరంజీ, మలహరీ, మందారీ, ఘూర్జరీ, ఘంటారవము, లలితా, గౌళా, సావేరీ.

పుత్త్రరాగముల :— కాపీ, రేగుప్తీ, నీలాంబరీ * మారువా, రామగిరీ * సారంగా, మందారీ; సౌరాష్ట్రి, కేదారా * ముఖారీ, లలితా, తోడీ, ధన్యాసీ, నారాయణీ, గౌరీ * పంతువరాళీ, వరాళీ, గౌళా * పూర్వీ, సావేరీ, తేగడా, జాళీ * మనోహరీ, యమునా.

నామభిన్నముచే వ్యవహరింపఁబడునవి మిత్త్రరాగము అనఁబడును.

ఉ. మల్లారు :— సామంతమల్లారు, గౌడమల్లారు, చెంచుమల్లారు మొదలగునవి.

భైరవి:—ఆనందభైరవి, వసంతభైరవి మొదలగునవి.

వరాళి:—నాగవరాళి, పున్నాగవరాళి, శోకవరాళి, వసంతవరాళి మొదలగునవి.

కాంభోజీ:—సుమ్మకాంభోజీ, గోపికాకాంభోజీ, చెంచుకాంభోజీ, నంది కాంభోజీ, యదుకులకాంభోజీ మొదలగునవి.

నాటా:—ఛాయానాటా, గంభీరనాటా, సారంగనాటా, సాళంగనాటా, ప్రతాపనాటా మొదలగునవి.

గౌళా:—మాళవగౌళా, రీతిగౌళా, నారాయణగౌళా, కేదారగౌళా, ఛాయా గౌళా ఇత్యాగులు మిశ్రరాగము లనఁబడును.

శుద్ధరాగముల కుదాహరణము:—దేవక్రియా, కల్యాణీ, కాంభోజీ, సాహుళీ, ఘాండీ, గుండక్రియా, వరాళి, ముఖారి.

(సాలగము) ఛాయారాగముల కుదాహరణము:—దేశి, కురంజీ, భల్లాతీ, శంకరా భరణము, బిలహరీ, బౌళీ, రామక్రియా, ఆహిరి.

"ఉమ్మిడిసెట్టి వెంకటసామి నాయుడుగారిచే వ్రాయఁబడిన సంగీత విద్యాదర్పణము.లోఁ గల శ్లోకములలో పెక్కులు సంగీతదర్పణ శ్లోకములు గనే యున్నవి. రాగకాల నిర్ణయమును జేయునపుడు, శ్రీమార్గ సింగరా చార్యుల గాయకలోచనములోని శ్లోకములనే తాత్పర్యముతో వ్రాసి యున్నారని తెలియుచున్నది. వానిని దిగువఁ జూడుఁడు:

## రాగకాల నిర్ణయము.

శ్లో॥ అథవక్ష్యామి హేతాత కాలరాగ ననుక్రమాత్
దేశాక్షీ దేవగాంధారీ ఘాండీ ధన్యాసి మాళవా ॥
దేవక్రియాచ మందారీ గౌరీ భూపాల ఏవచ
స్వస్వరైశ్చ ప్రవర్తంతే ప్రాతఃకాలే దినేదినే ॥

తా. దేశాక్షీ, దేవగాంధారీ, ఘాండీ, ధన్యాసీ, మాళవా, దేవక్రియా, మందారీ, గౌరీ, భూపాలము అను నీ రాగములు ప్రాతఃకాలమునందు అనఁగా, వేకువజామున 3 ఘంటలు మొదలు 6 ఘంటలవఱకు పాడఁదగినవి.

శ్లో॥ కురంజీ సాహుళీ ఘంటారవా రామక్రియా తథా ।
బిలహారీ మలహారీ ముఖారీ యమునాతథా ।
రేగుప్తి భైరవశ్చైవ వర్తంతే సంగమేదినే ॥

తా. కురంజీ, సాహుళీ, ఘంటారవము, రామక్రియా, బిలహరీ, మలహరీ, ముఖారీ, యమునా, రేగుప్తి, భైరవి అను నీ రాగములు సంగమకాలమందు అనగా, ఉదయము 6 ఘంటలవఱకు పాడఁదగినవి,

శ్లో॥ మేఘరంజీచ సారంగా భల్లాతీ మధ్యమావతీ ।
దేశీ నీలాంబరీ చైవ తథా మంగళదేశికా ।
శ్రీరాగశ్చతు మధ్యాహ్నే వర్తంతేఽను దినేదినే ॥

తా. మేఘరంజీ, సారంగా, భల్లాతీ, మధ్యమావతీ, దేశీ, నీలాంబరీ, మంగళదేశికా, శ్రీరాగము అను నీ రాగములు మధ్యాహ్న కాలమందు అనఁగా, పగలు 9 ఘంటలు మొదలు 12 ఘంటలవఱకు పాడఁదగినవి.

శ్లో॥ మోహనా చైవ కల్యాణీ కాపీ ఘూర్జరికా తథా ।
శంకరాభరణా పూర్వీ వసంతశ్చాపరే దినే ॥

తా. మోహనా, కల్యాణీ, కాపీ, ఘూర్జరీ, శంకరాభరణము, పూర్వీ, వసంతా అను నీ రాగములు పరేదినే అనఁగా, పగలు 12 ఘంటలు మొదలు 3 ఘంటలవఱకు పాడఁదగినవి.

శ్లో॥ నారాయణీచ హిందోళీ సౌరాష్ట్రీ తోడి రామళీ ।
గౌరీ వరాళి కాపంతు ఉసేనీ మాళవ స్తథా ।
సాయంకాలే ప్రవర్తంతే లలితాచ తథైవచ ॥

తా. నారాయణీ, హిందోళీ, సౌరాష్ట్రీ, తోడీ, రామళీ, గౌరీ, వరాళి, పంతువరాళీ, ఉసేనీ, మాళవీ, లలితా అను నీ రాగములు సాయంకాలమునందు అనఁగా, మధ్యాహ్నము 3 ఘంటలు మొదలు 6 ఘంటలవఱకు పాడఁదగినవి.

శ్లో॥ వేళావళీచ కాంభోజీ సావేరీ బేగడా తథా ।
పూర్వరాత్రౌ ప్రవర్తంతే పున్నాగో నాటకాదయః

తా. వేళావళీ, కాంభోజీ, సావేరీ, బేగడా, పున్నాగా, నాటా అను నీ రాగములు పూర్వరాత్రియందు అనఁగా, సాయంత్రము 6 ఘంటలు మొదలు 9 ఘంటలవఱకు పాడఁదగినవి.

శ్లో॥ గుండక్రియా మనోహారీ తథా మంగళకైశికా ।
కేదార్యాహిర్యసావేర్యః బంగాళో జాళికా తథా ।
ఏతే రాగాః ప్రవర్తంతే మధ్యరాత్రౌ దినేదినే ॥

తా. గుండక్రియా, మనోహారీ, మంగళకైశికా, కేదారీ, ఆహిరీ, అసావేరీ, బంగాళా, జాళీ అను నీ రాగములు మధ్యరాత్రియందు అనఁగా, రాత్రి 9 ఘంటలు మొదలు 12 ఘంటలవఱకు పాడఁదగినవి.

శ్లో॥ జోగినీ చిత్రవేళాచ కర్ణాట సురటీ తథా ।
మంజరీ చ ప్రవర్తంతే పరరాత్రౌ దినేదినే ॥

తా. జోగినీ, చిత్రవేళా, కర్ణాటా, సురటీ, మంజరీ అను నీ రాగములు పరరాత్రౌ అనఁగా, రాత్రి 12 ఘంటలు మొదలు 3 ఘంటలవఱకు పాడఁదగినవి.

## రాగభేదములు.

రాగములు :—సంపూర్ణము, షాడవము, ఔడవము అని మూఁడు భేదములను బడసియున్నవి.

సంపూర్ణరాగము :—ఆరోహణావరోహణములయందు సప్తస్వరములను వరుసగాఁ బడసియుండు రాగములు సంపూర్ణరాగము లనఁబడును. వాని మొత్తముసంఖ్య 72 ; ఇవి మేళకర్త* రాగములు.

మేళకర్త రాగములు :—72 మేళకర్తలు గలిగిన విధము నీ దిగువ వివరింతము :

ఒక స్థాయిలోఁగల 12 అర్ధస్వరములలో షడ్జము, శుద్ధమధ్యమము, ప్రతిమధ్యమము, పంచమము ఈ 4 స్వరములుతప్ప తదితర స్వరములైన ఋషభ, గాంధార, ధైవత, నిషాదములకు అవస్థాభేదము గలుగుచున్నవి. ఈ అవస్థా భేదములు ఋషభగాంధారములలో 6 ను, ధైవత నిషాదములలో 6 ను గలవు. ఎట్లనిన,

శుద్ధఋషభముమీఁద మూఁడు గాంధారములు వచ్చును. కనుక శుద్ధఋషభ భేదములు మూఁడు. చతుశ్శ్రుతిఋషభమే శుద్ధగాంధారమగుటవలన ఆ చతుశ్శ్రుతి ఋషభముమీఁద రెండు గాంధారములు వచ్చును. కనుక చతుశ్శ్రుతిఋషభ భేదములు రెండు. సాధారణగాంధారమే షట్శ్రుతి ఋషభమైనందువలన ఆ ఋషభముమీఁద అంతరగాంధార మొకటిమాత్రము వచ్చును. కనుక షట్శ్రుతిఋషభ భేద మొకటి. ఇట్లు 6 భేదములు కలుగుచున్నవి. ఇటులనే ధైవత నిషాదములలో 6 భేదములుఁ గలుగుచున్నవి. ఋషభ గాంధార భేదములను ధైవత నిషాద భేదములచే పెంచినచో 6 × 6 = 36 భేదము లగును. ఈ 36 భేదములను శుద్ధమధ్యమ ప్రతిమధ్యమ మను రెండు భేదములచే పెంచునపుడు 36 × 2 = 72 మేళకర్త రాగములగును. ఈ వివరము నీ ప్రక్కనుండు పట్టికములలోఁ జూడుఁడు :

---

* మేళకర్త రాగములు రత్నాకరములో లేవు. అయినను వెంకటమఖి కాలమునకు మునుపే ఈ పద్ధతి వాఁడుకలో నుండెను. కనుక ఇది చాలపురాతనమైన పద్ధతియే యగును. శార్ఙ్గదేవుని కాలమున మేళకర్త రాగములు లేవనుటకు నేఁడియును సరియైన కారణము లేదు. ఆ కాలములోనే దాక్షిణాత్య సంగీతములో నీ మేళకర్త పద్ధతి యుండెనని చెప్పుట కనేక హేతువు లున్నవి.

**(1) ఋషభ గాంధార భేదములు.**

| సంఖ్య. | భేదములు. |
|---|---|
| 1 | శు. రి.—శు. గ. |
| 2 | శు. రి.—సా. గ. |
| 3 | శు. రి.—అం. గ. |
| 4 | చ. రి.—సా. గ. |
| 5 | చ. రి.—అం. గ. |
| 6 | ష. రి.—అం. గ. |

**(2) ధైవత నిషాద భేదములు.**

| సంఖ్య. | భేదములు. |
|---|---|
| 1 | శు. ధ.—శు. ని. |
| 2 | శు. ధ.—కై. ని. |
| 3 | శు. ధ.—కా. ని. |
| 4 | చ. ధ.—కై. ని. |
| 5 | చ. ధ.—కా. ని. |
| 6 | ష. ధ.—కా. ని. |

## 72 మేళకర్త రాగములను జూపెడి పధకము.

| సంఖ్య. | రాగములకు ప్రాచీన నామములు. | వెంకటమఖి పెట్టిన నామములు. | స | రి | గ | మ | ప | ధ | ని |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | కనకాంగీ | కనకాంబరీ | ,, | శు | శు | శు | ,, | శు | శు |
| 2 | రత్నాంగీ | ఫేనద్యుతీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కై |
| 3 | గానమూర్తీ | గానసామవరాళీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 4 | వనస్పతీ | భానుమతీ | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై |
| 5 | మానవతీ | మనోరంజనీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 6 | తానరూపీ | తనుకీర్తీ | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా |
| 7 | సేనావతీ | సేనాగ్రణీ | ,, | శు | సా | శు | ,, | శు | శు |
| 8 | హనుమతోడీ | జనతోడీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కై |
| 9 | ధేనుకా | ధునిభిన్నషడ్జము | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 10 | నాటకప్రియా | నటాభరణము | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై |
| 11 | కోకిలప్రియా | కోకిలారవము | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 12 | రూపవతీ | రూపవతీ | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా |

| సంఖ్య. | రాగములకు ప్రాచీన నామములు. | వెంకటమఖి పెట్టిన నామములు. | స | రి | గ | మ | ప | ధ | ని |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 13 | గాయకప్రియా | గేయహెజ్జజ్జీ | ,, | శు | అం | శు | ,, | శు | శు |
| 14 | వకుళాభరణము | వాటీవసంతభైరవీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కై |
| 15 | మాయామాళవగౌళ | మాయామాళవగౌళ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 16 | చక్రవాకము ✱ | తోయవేగవాహినీ | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై |
| 17 | సూర్యకాంతము | ఛాయావతీ | ,, | ,, | ,, | ,, | ,, | చ | కా |
| 18 | హాటకాంబరీ | జయశుద్ధమాళవీ | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా |
| 19 | ఝంకారధ్వనీ | ఝంకారభ్రమరీ | ,, | చ | సా | శు | ,, | శు | శు |
| 20 | నటభైరవీ | నారీరీతిగౌళ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కై |
| 21 | కీరవాణీ | కిరణావళీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 22 | ఖరహరప్రియా | శ్రీరాగము | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై |
| 23 | గౌరీమనోహరీ | గౌరీవేళావళీ | ,, | ,, | ,, | ,, | ,, | చ | కా |
| 24 | వరుణప్రియా | వీరవసంతము | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా |
| 25 | మారరంజనీ | శరావతీ | ,, | చ | అం | శు | ,, | శు | శు |
| 26 | చారుకేశీ | తరంగిణీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కై |
| 27 | సరసాంగీ | సౌరసేనా | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 28 | హరికాంభోజీ | హరికేదారగౌళ | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై |
| 29 | ధీరశంకరాభరణము | ధీరశంకరాభరణము | ,, | ,, | ,, | ,, | ,, | చ | కా |
| 30 | నాగానన్దినీ | నాగాభరణము | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా |
| 31 | యాగప్రియా | కలావతీ | ,, | ష | అం | శు | ,, | శు | శు |
| 32 | రాగవర్ధనీ | రాగచూడామణీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కై |
| 33 | గాంగేయభూషణీ | గంగాతరంగిణీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 34 | వాగధీశ్వరీ ✱ | భోగచ్ఛాయానాటా | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై |
| 35 | శూలినీ | శైలదేశాక్షీ | ,, | ,, | ,, | ,, | ,, | చ | కా |
| 36 | చలనాటా | చలనాటా | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా |

| సంఖ్య. | రాగములకు ప్రాచీన నామములు. | వెంకటమఖి పెట్టిన నామములు. | స | రి | గ | మ | ప | ధ | ని |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 37 | సాలగము | సౌగంధినీ | ,, | శు | శు | ప్ర | ,, | శు | శు |
| 38 | జలార్ణవము | జగన్మోహనము | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కై |
| 39 | ఝాలవరాళీ | ధాలివరాళీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 40 | నవనీతము | నభోమణీ | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై |
| 41 | పావనీ | కుంభినీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 42 | రఘుప్రియా | రవిక్రియా | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా |
| 43 | గవాంభోధీ | గీర్వాణీ | ,, | శు | సా | ప్ర | ,, | శు | శు |
| 44 | భవప్రియా | భవానీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కై |
| 45 | శుభపంతువరాళీ | శివపంతువరాళీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 46 | షడ్విధమార్గిణీ | స్తవరాజము | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై |
| 47 | సువర్ణాంగీ | సౌవీరము | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 48 | దివ్యమణీ * | జీవంతినీ | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా |
| 49 | ధవళాంబరీ | ధవళాంగము | ,, | శు | అం | ప్ర | ,, | శు | శు |
| 50 | నామనారాయణీ | నామదేశీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కై |
| 51 | కామవర్ధనీ | కాశిరామక్రియా | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 52 | రామప్రియా | రమామనోహరీ | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై |
| 53 | గమనాశ్రమా | గమనక్రియా | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 54 | విశ్వంబరీ * | వంశవతీ | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా |
| 55 | శ్యామళాంగీ | శ్యామళా | ,, | చ | సా | ప్ర | ,, | శు | శు |
| 56 | షణ్ముఖప్రియా | చామరము | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కై |
| 57 | సింహేంద్రమధ్యమము | సుమద్యుతీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 58 | హేమవతీ | దేశిసింహారవము | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై |
| 59 | ధర్మవతీ | ధామవతీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 60 | నీతిమతీ | నిషదము | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా |

| సంఖ్య. | రాగములకు ప్రాచీన నామములు. | వెంకటమఖి పెట్టిన నామములు. | స | రి | గ | మ | ప | ధ | ని |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 61 | కాంతామణీ | కుంతలము | ,, | చ | అం | ప్ర | ,, | శు | శు |
| 62 | ఋషభప్రియా * | రతిప్రియా | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కై |
| 63 | లతాంగీ | గీతప్రియా | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 64 | వాచస్పతీ | భూషావతీ | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై |
| 65 | మేచకల్యాణీ | శాంతకల్యాణీ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 66 | చిత్రాంబరీ * | చతురంగిణీ | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా |
| 67 | సుచరిత్రా | సంతానమంజరీ | ,, | ష | అం | ప్ర | ,, | శు | శు |
| 68 | జ్యోతిస్వరూపిణీ | జ్యోతిరాగము | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కై |
| 69 | ధాతువర్ధనీ | ధాతపంచమము | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 70 | నాసికాభూషణీ | నాసామణీ | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై |
| 71 | కోసలము | కుసుమాకరము | ,, | ,, | ,, | ,, | ,, | ,, | కా |
| 72 | రసికప్రియా | రసమంజరీ | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా |

* ఈ గురుతుగల రాగములు కటపయాది సంఖ్యలకు సరిగ లేవు.

పైని కనఁబఱచియుండు మేళకర్తచక్రములు 12–కిని వెంకటమఖి 12 నామములను చెప్పియున్నాఁడు : (1) ఇందు, (2) నేత్ర, (3) అగ్ని, (4) వేద, (5) బాణ, (6) ఋతు, (7) ఋషి, (8) వసు, (9) బ్రహ్మ, (10) దిశి, (11) రుద్ర, (12) ఆదిత్య అను ఈ నామములు సంకేతముగ నేర్పఱుపఁబడినవి. ఇటులనే మూఁడు ఋషభములు, మూఁడు గాంధారములు, రెండు మధ్యమములు, మూఁడు ధైవతములు, మూఁడు నిషాదములు వీనికి వరుసగ ర, రి, రు; గ, గి, గు ; మ, మి ; ద, ది, దు ; న, ని, ను ; అను సంకేతాక్షరములను వెంకటమఖి చెప్పియున్నాఁడు. మేళకర్త రాగములకును, కటపయాది సంఖ్యలకు సరిగా నుండునటుల, వేఱువేఱు నామములను చెప్పియున్నాఁడు.

షాడవరాగము : ఆరోహణావరోహణములలో 6 స్వరములుగల రాగము షాడవరాగ మనఁబడును. ఉ॥ సరిగమపనిస – సనిపమగరిస. ఆరోహణావరోహణములలో నొకే స్వరమును వర్జించి యుండు రాగములు శుద్ధషాడవ మనఁబడును. ఆరోహణావరోహణములయందు వేఱువేఱు స్వరములను వర్జించి యుండునది సంకీర్ణషాడవ మనఁబడును. ఉ॥ సరిగమపనిస–సధపమగరిస; ఇందు ఆరోహణములో ధైవతము వర్జింపఁబడెను.

అవరోహణములో నిషాదము వర్జింపఁబడెను. ఇట్లన్నియు నెఱుంగునది. ఆరోహణావరోహణములయందు ఆఱు స్వరములను బడసి స్వరములు వరుసగ ప్రయోగింపఁబడక వక్రముగ ప్రయోగింపఁబడునది వక్రషాడవ మనఁబడును. ఉ॥ సరిగమరిమపధస – సధపమరిమగరిస.

ఔడవరాగము : ఆరోహణావరోహణములయందు 5 స్వరములను గల రాగము ఔడవరాగ మనఁబడును. ఈ ఔడవరాగములోను షాడవ రాగమునకుఁ గలిగియుండుతీరున శుద్ధ ఔడవము, సంకీర్ణ ఔడవము, వక్ర ఔడవము అని మూఁడు భేదము లున్నవి.

ఉ॥ (1) సరిగపనిస – సనిపగరిస = ఇది శుద్ధఔడవము.
(2) సరిగపనిస – సధపగరిస = ఇది సంకీర్ణఔడవము.
(3) సరిగపరిపస – సపనిపగరిస = ఇది వక్రఔడవము.

సంపూర్ణము ఒక్క భేదమును, షాడవము 6 భేదములను, ఔడవము 15 భేదములను బడసియుండును.

ఉదాహరణములు :

| | | | |
|---|---|---|---|
| షాడవములు (6) :— | 1. | స రి గ మ ప ధ స | – స ధ ప మ గ రి స |
| ,, | 2. | స రి గ మ ప ని స | – స ని ధ మ గ రి స |
| ,, | 3. | స రి గ మ ధ ని స | – స ని ధ మ గ రి స |
| ,, | 4. | స రి గ ప ధ ని స | – స ని ధ ప గ రి స |
| ,, | 5. | స రి మ ప ధ ని స | – స ని ధ ప మ రి స |
| ,, | 6. | స గ మ ప ధ ని స | – స ని ధ ప మ గ స |
| ఔడవములు (15) :— | 1. | స రి గ మ ప స | – స ప మ గ రి స |
| ,, | 2. | స రి గ మ ధ స | – స ధ మ గ రి స |
| ,, | 3. | స రి గ మ ని స | – స ని మ గ రి స |
| ,, | 4. | స రి గ ప ధ స | – స ధ ప గ రి స |
| ,, | 5. | స రి ప ని గ స | – స ని ప గ రి స |
| ,, | 6. | స రి గ ధ ని స | – స ని ధ గ రి స |
| ,, | 7. | స రి మ ప ధ స | – స ధ ప మ రి స |
| ,, | 8. | స రి మ ప ని స | – స ని ప మ రి స |

ఔడవములు (15):— 9. స రి మ ధ ని స - స ని ధ మ రి స
,, 10. స రి ప ధ ని స - స ని ధ ప రి స
,, 11. స గ మ ప ధ స - స ధ ప మ గ స
,, 12. స గ మ ప ని స - స ని ప మ గ స
,, 13. స గ మ ధ ని స - స ని ధ మ గ స
,, 14. స గ ప ధ ని స - స ని ధ ప గ స
,, 15. స మ ప ధ ని స - స ని ధ ప మ స

మేళకర్తరాగ మొక్కొకటికిని పైనిచెప్పిన సంపూర్ణ షాడవ ఔడవ భేదముల సంయోగమువలనఁ గలిగెడి భేదములు 484. ఎట్లనిన :

| | |
|---|---|
| సంపూర్ణ సంపూర్ణ భేదములు | 1 |
| సంపూర్ణ షాడవ భేదములు | 6 |
| సంపూర్ణ ఔడవ భేదములు | 15 |
| షాడవ సంపూర్ణ భేదములు | 6 |
| ఔడవ సంపూర్ణ భేదములు | 15 |
| షాడవ షాడవ భేదములు | 36 |
| షాడవ ఔడవ భేదములు | 90 |
| ఔడవ షాడవ భేదములు | 90 |
| ఔడవ ఔడవ భేదములు | 225 |
| అంతుమొత్తము, | 484 |

వక్రసంపూర్ణములు : ఆరోహణావరోహణములలో సప్తస్వరము లుండియును అవి వరుసగ రాకుండ క్రమము తప్పి వచ్చుట వక్రసంపూర్ణ మనఁబడును. ఉ. స రి గ మ ప ధ ని రి ప స - స ని ధ ప ని ప మ గ రి స.

ఇట్లు 72 మేళకర్తలకు, వక్రప్రయోగములేక, శుద్ధప్రయోగముల వలన మాత్రము గలుగు మొత్తము : $72 \times 484 = 34848$ రాగము లగు చున్నవని నవీన గ్రంథకర్తలు చెప్పుచున్నారు. ఈ భేదములను వక్రసంపూర్ణ, వక్రషాడవ, వక్రఔడవములచే పెంచునపుడు సంఖ్యలేని రాగము లగుచున్న వనియును చెప్పియున్నారు. ప్రస్తార బహుళముచే సంఖ్యలేని రాగములు గలుగుట యుక్తమే యగును. అయినను 72 మేళకర్త రాగములలో 34848

రాగములు గలుగునని చెప్పుట అసంభావితము. ఎట్లనిన, చతుశ్రుతిఋషభ శుద్ధగాంధారమును, షట్శ్రుతిఋషభ సాధారణగాంధారమును, చతుశ్రుతి ధైవత శుద్ధనిషాదమును, షట్శ్రుతిధైవత కైశికీనిషాదమును నామము లలోమాత్రము వ్యత్యాసముఁ జెందియున్న వేగాని స్వరతత్త్వములో వ్యత్యాస మును జెందలేదు. కనుక మొదటి చక్రములోని "సగమ" అను ప్రస్తారము 4-వ చక్రములో "సరిమ" అని ప్రస్తరింపఁబడును. అందుచేత, షాడవ ఔడవ రాగములలో ననేకరాగములు పునరుక్త దోషములను జెందుచున్నవి.

మఱియొక రాగవిభాగము : రాగములు "ఘన, నయ, దేశీ" అని మూఁడు విధములగును.

ఘనరాగము : నాభితానముచేతఁ జేయఁబడు గానక్రియను గలది యును, యుద్ధరంగములోనుండు మహాశూరునిఁబోలి గాంభీర్యమును జెంది నదియు నైనది ఘనరాగ మనఁబడును. పూర్వాచార్యులు రాగములలో 10 రాగములను ఘనరాగములని చెప్పియున్నారు. వాని నీదిగువఁ జూడుఁడు:

| | |
|---|---|
| 1. నాటా | 6. కేదారః |
| 2. గౌళా | 7. నారాయణగౌళా |
| 3. వరాళీ | 8. రీతిగౌళా |
| 4. ఆరభీ | 9. సారంగనాటా |
| 5. శ్రీరాగః | 10. బౌళీ |

నయరాగము : వినువారి మనస్సున విశేషరంజకత్వమును గలుగఁ జేయునది నయరాగ మనఁబడును. దీనిని రక్తిరాగ మనియును, మార్గరాగ మనియును చెప్పుదురు. ఈ నయరాగములు, పురుషులను స్త్రీలు తమ రూపలావణ్యాదులచేతను, ఇంపుమాటలచేతను, వీక్షణాదులచేతను, అంగ పరిష్వంగాదులచేతను మోహింపఁజేయు చందమున, వినువారి మనసును పర వశము నొందునటులఁ జేయునని చెప్పఁబడి యున్నది. ఘనరాగములును దేశ్యరాగములును తప్ప తక్కినరాగము లన్నియును నయరాగములని కొందఱు చెప్పుచున్నారు.

దేశ్యరాగములు : ఉత్తరదేశముననుండి స్వీకరింపఁబడిన కొన్ని రాగకళలతో స్ఫురించునది దేశ్యరాగ మనఁబడును. ఉ॥ ఫరజు, కమాసు, కాఫి, దర్బారు మొదలగు రాగములు.

పైని చెప్పఁబడియున్న ఘన, నయ, దేశ్య రాగములకు పూర్వా చార్యులు శ్లోకపూర్వముగ లక్షణములను, నామములను జెప్పియున్నారు. గ్రంథవిస్తరభీతిచే వానినిచట వ్రాయలేదు.

రాగరసములు : రాగములు రసయుక్తమైనవి యనియును, కొన్ని రాగములచే శృంగారరసమును, కొన్ని రాగములచే హాస్యరసమును, మఱి కొన్ని రాగములచే కరుణారసమును, ఇట్లు రాగములను పాడి నవరసములను కల్పింపవచ్చునని గ్రంథములలో చెప్పఁబడియున్నది.

ఇందులో గ్రంథకర్తల యభిప్రాయములు ఒకటితోనొకటి సంబంధించకనే యున్నవి.

సంగీతచంద్రికలో, శృంగారరసమునకు భూపాళరాగమును, హాస్యరసమునకు వసంతరాగమును, కరుణారసమునకు ఫలమంజరియును, వీరరసమునకు నాటరాగమును, భయానకరసమునకు మాళవిరాగమును, శోకరసమునకు శ్రీరాగమును, రౌద్రరసమునకు భైరవియును. అద్భుతరసమునకు బంగాళరాగమును, శాంతరసమున కన్నిరాగములను పాడవచ్చుననియును చెప్పఁబడియున్నది. ఇది పూర్వాచార్యుల పద్ధతిలో నెవరికో దెలియలేదు.

సంగీత విద్యాదర్పణములో మఱియొక పద్ధతి చెప్పఁబడియున్నది :—

"శ్లో॥ సాయంగేయా రసేవీరే శృంగారే చేతికీర్తితం ।
సంగ్రామే వీరతారూపం లాలయ న్గుణకీర్తనం ।
గానే షాడవరాగాణాం కథితం పూర్వసూరిభిః ॥
వ్యాధినాశే శత్రునాశే భయశోక వినాశనే ।
ఔడవాస్తు ప్రగాతన్యా గ్రహ శాన్త్యర్థ కర్మణి ॥

తా. సంపూర్ణరాగములు వీర, శృంగార, కరుణ, హాస్యరస ప్రతిపాదకములు. షాడవరాగములు యుద్ధమునందు వీరరస ప్రధానమగునట్లు నుపయోగింపవలయుననియు, ఔడవరాగములు శత్రు, వ్యాధి, భయ, శోక వినాశనమందును, గ్రహశాంతి ప్రయోజనాది కర్మములయందును ఉపయుక్తములని చెప్పఁబడియె. అనఁగా, రసయుక్తములయిన రాగములనుబట్టి పదకీర్తనలు మొదలగునవి చేయవలయుననియు, పదకీర్తనలు మొదలగు వానియొక్క భావార్థములనుబట్టిరాగముల నుపయోగింపవలయుననియు నెఱుంగునది."

సంగీత దర్పణములో రాగములకు స్వరూపములను, రసములను చెప్పఁబడియున్నవి. ఉదాహరణము :—

## భూ పా లి రా గ ము.

శ్లో॥ గౌరద్యుతిః కుంకుమలిప్త దేహా తుంగస్తనీచంద్రముఖీమనోజ్ఞా ।
కాంతంస్మరన్తీ విరహేణదూనా భూపాలికేయం రసశాంతియుక్తా ॥

తా. గౌరవర్ణము గలదియును, కుంకుమ విలేపనమును గల శరీరశోభను గలదియును, ఉత్తుంగమైన స్తనభారము గలదియును, పూర్ణచంద్రునిఁ బోలిన ముఖము గలదియును, అతిమనోజ్ఞమైనదియును, విరహము నోర్వలేక కాంతుని స్మరించుచున్నదియును, శాంతిరసయుక్తమైనదియునై భూపాలిరాగము వెలయుచున్నది.

ఇట్లు రాగ రాగిణులకు పూర్వాచార్యులు లక్షణములను వ్రాసియున్నారు. మఱియు, పూర్వాచార్యులు రాగములకు రసములను చెప్పునపుడు నానావిధమైన యభిప్రాయములను చెప్పియున్నటులు రాగముల నుపయోగించునపుడు వ్యత్యాసములైన యభిప్రాయములను జెప్పియున్నారు.

ఉదాహరణముగ నీ దిగువ కనఁబఱచియున్న మధ్యమావతిరాగమును జూడుఁడు :

### సంగీతప్రకాశిక (Vol-I, Part-II)

మధ్యమావతి రాగము.

"శ్లో॥ మధ్యమాదిస్సురాగోయం మధ్యమగ్రహ సంయుతః ।
గధలోపాదౌఢవ స్యాత్సాయంకాలేప్రగీయతే॥" (చతుర్దండిప్రకాశిక.)

ఇది భాషాంగ రాగము. శుద్ధకర్నాటక రాగము. ఔడవము. గాంధార ధైవతములు వర్జ్యంబులు. సాయంకాలమునందు గానము సేయఁదగినది. మధ్యమ గ్రహము. 28-వ మేళము, హరికాంభోజి జన్యము. ఈ శ్లోక పూర్వముగ నీ రాగమునకు, "మధ్యమాది" అను పేరు చెప్పఁబడినను, మధ్యమావతి యను నామమే లోకప్రసిద్ధమైనది. చతుశ్రుతిఋషభ శుద్ధమధ్యమ కైశికీనిషాదములు రాగచ్ఛాయా స్వరములు. ఈ రాగమును సురాగ మని చెప్పియున్నారు. రాగములు కాలానుగుణములుగానే పాడఁదగినవి. రాగములను అకాలములందు పాడుటచేఁ గలిగెడి దోషంబులను పోగొట్టుటకై పూర్వకులు సకల శుభప్రదంబైన మధ్యమావతి రాగమును గానము ముగించు సమయమునందు పాడుచు వచ్చిరని తెలియుచున్నది. ఇందుచేత ఈ రాగము కాలనియమములేక ఎల్లప్పుడును పాడఁదగినదని తెలియుచున్నది. ఇందుకు సంగీత దర్పణమునందుఁ దెలుపు ప్రకారము :—

"భైరవిరాగిణీ మధ్యమావతిః"

శ్లో॥ మధ్యమాదిశ్చ రాగాంగా గ్రహాంశన్యాస మధ్యమా ।
సత్తస్వరైస్తు గాతవ్యా మధ్యమాదికమూర్ఛనా ।
సంపూర్ణా కథితాతజ్ఞైః రిధహీనాక్వచిన్మతా॥

ఈశ్లోకమువలన నీ రాగము రాగాంగమనియును, ఇందుగల మధ్యమ స్వరమే గ్రహాంశ న్యాస మనియును, సప్తస్వర సంపూర్ణ రాగమనియును, మధ్యమ స్వరమే మూర్ఛనా స్వర మనియును తెలియుచున్నది. మఱియు "రిధహీనా క్వచిన్మతా" అనుటచే ఈ రాగమునకు ఋషభ ధైవతములు వర్జ్యంబులని కొందఱ మతమనియును తెలియుచున్నది.

ఈ రాగము స్త్రీరాగమనియును భైరవి రాగమునకు భార్య యనియును గ్రంథకర్త చెప్పుచున్నాఁడు.

దర్పణకారుఁడు చెప్పియున్న ప్రకారము ఈ రాగమును ఋషభ ధైవత హీనముగా పాడినయెడల ఇప్పటివాడుకకు ఉదయరవిచంద్రిక రాగ మగుచున్నది. వెంకటమఖి మతము ననుసరించు గాంధార ధైవత హీనముగా పాడుటయే వాఁడుకగా నున్నది.

## రాగాలాపనము.

శ్లో॥ రాగాలాపనమాలప్తిః ప్రకటీకరణం మతం ।
సాద్విధాగదితా రాగ రూపకాభ్యాం విశేషణాత్ ॥
రాగాలాప్తిస్తు సాయాస్యా దనపేక్ష్యైవరూపకమ్ ।
స్వస్థానైః సా చతుర్భిః స్యా దితి గీతవిదోవిదుః ॥ (లక్ష్యసంగీతమ్)

తా. రాగాలాపనము, "ఆలప్తి" యనఁబడును. ఆ యాలాపనము రాగమనియును రూపకమనియును రెండువిధము లగును. అందు "రూపకము", అనఁగా రూపకాలాపము చాల శ్లాఘ్యమైనయది. అపేక్షింపకయే ఈ రూపకాలాపనము ఆలప్తిలోను ఉండును. ఈ రూపకాలాపనము నాలుగు విధము లగును.

శ్లో॥ తత్రాలాపేషు సర్వత్రా ప్యాదావాక్షిప్తికా స్మృతా ।
ఆక్షిప్తికైవలోకేస్మి న్నాయిత్త మితిగీయతే ॥ (చతుర్దండిప్రకాశిక).

తా. ఆలాపనములో మొదటిది "ఆక్షిప్తికా" అను ఆలాపనమనియును, లోకములో "ఆక్షిప్తిక" అను ఆలాపనమునే "ఆయిత్త" మని చెప్పుచున్నారనియును తాత్పర్యము.

రాగమును విస్తరించుట ఆలాపన మనఁబడును. రాగమును ప్రారంభించునపుడే యా రాగకళలు విలసిల్లునట్లు కొంచెముగ విస్తరించి నిలుపుట ఆలప్తి యనియును, రాగమును విశేషముగ ప్రస్తారములచే పోషించి పాడుట ఆలాపన మనియును కొన్ని పురాతన గ్రంథకర్తల యభిప్రాయము. చతుర్దండి ప్రకాశికలో రాగాలాపనమే యాలప్తి యనియును, రాగమును స్వల్పముగ పాడుట "ఆక్షిప్తికా" లేక "ఆయిత్తము" అనియును చెప్పఁబడియున్నది. ఆయిత్త మనఁగా రాగమును పాడుటకైన ప్రథమ ప్రయత్నము.

రత్నాకరములో నిశ్శంకుఁడు "ఆక్షిప్తికా" అనునది యొక నిబద్ధ గీతభేద మని చెప్పియున్నాఁడు :—

శ్లో॥ చచ్చత్పుటాది తాళేన మార్గత్రయ విభూషితా ।
ఆక్షిప్తికా స్వరపద గ్రథితా కథితా బుధైః ॥

ఇందులకు చతురకల్లినాథుని వ్యాఖ్యానములో —

"ఆక్షిప్తికేతి నిబద్ధగీతభేదః । సాచ చచ్చత్పుటాదితాళేన । ఆదిశబ్దేన చాచత్పుటాదయో మార్గతాళాగృహ్యన్తే । తేష్వన్యతమేన । మార్గత్రయ విభూషితా మార్గత్రయే పూర్వోక్తే చిత్రాదౌ విభూషితాఽలంకృతా । జాత్యుక్తౌ నియమేనేతిద్రష్టవ్యం । స్వరపద గ్రథితా షడ్జాది స్వరభూషితైః పదైః పదార్థవాచకైః శబ్దైర్గ్రథిత రచితా పదతాలాద్యాక్షిప్తత్వాదాక్షిప్తికేత్యన్వర్థా । బుధైః మతంగాదిభిః కథితా ॥"

చచ్చత్పుటాది మార్గతాళములతోఁ గూడుకొనినదియును, దక్షిణము, వార్తికము, చిత్రము అను మార్గత్రయములతోఁ గూడుకొనినదియును, స్వరములతోను, పదార్థ వాచకములతోను గూడుకొనినదియునై యుండు గీతవిశేషము ఆక్షిప్తిక యనఁబడును. సంగీత సంప్రదాయ ప్రదర్శినియందు రాగమును స్వల్పముగ పాడుటయే ఆక్షిప్తిక యని చెప్పియున్నారు. దాని నీ దిగువఁ జూడుఁడు :

శ్లో॥ కీనత్వేనయథాక్షిప్తం స్వనిర్వాహాయ భోజనం ।
రాగేణాపితథాక్షిప్తే త్యాదావాక్షిప్తికామతా ॥ [చతుర్దండిప్రకాశిక)

ఒకఁడు తాను పెరుగుటకయి ఎట్లు భోజనము నపేక్షించునో అటులనే రాగము తాను వృద్ధిఁజెందుటకై ఆక్షిప్తికను అపేక్షించుచున్నది. గనుక రాగముయొక్క ఆరంభమందు మధ్యషడ్జమును ఆక్షిప్తికగాఁ గొని మంద్రస్థాయియందును, మధ్యస్థాయి ఋషభ గాంధార స్వరములో సలుపు గానముయొక్క క్రియను (వ్యాపారమును) జేసి రాగమున కుగాయకుని శక్తికినిఁ దగినట్లు తారస్థాయి ఋషభ గాంధార మధ్య పంచముదాఁక నొకసారి పాడుచుపోయి, మఱియుఁ దిరిగి మధ్యస్థాయి షడ్జమునకు వచ్చి పూర్తి చేయవలయును. ఇట్లు పాడఁబోయి వచ్చుటకు ఆక్షిప్తిక, లేక ఆయిత్తము అని జెప్పుదురు. (ఆక్షిప్తిక = కొంచెము ముందుగా ఉవ్వట). (ఆయిత్తము = ఆరంభించుటకు గల సన్నద్ధము, లేక ప్రయత్నము).

పైని కనఁబఱచియుండు పద్ధతిలో పదార్థ వాచక సంయోగములను చెప్పియుండునటులు తెలియలేదు. పదార్థవాచక సంయోగములేని రాగాయిత్తము ఆక్షిప్తిక కానేరదు. ఇందుల కుదాహరణములను రత్నాకరములోఁ జూడుఁడు.

రత్నాకరములో ఆయిత్తము అని స్వల్పముగ రాగమును విస్తరించు పద్ధతిని చెప్పలేదు. గ్రాహాంశన్యాసాదిగాఁ గల దశవిధ లక్షణములు రాగాలాపనములో నుండవలయునని చెప్పఁబడియున్నది. "...అభివ్యక్తిర్యత్ర

దృష్టా సా రాగాలాప ఉచ్యతే '' – ఇచట కల్లినాథుని వ్యాఖ్యానమును బరిశీలించునపుడు, ఇప్పుడు వాడుకలోనుండు ప్రబంధ హీనమైన రాగాలాపనము మతంగాది పూర్వాచార్యుల కాలములో లేదని తెలియుచున్నది.

''శ్లో॥ రూపకంతద్వదేవ స్యాత్పృథగ్భూత విదారికం ।'' (సం. రత్నా.)

కల్లినాథ వ్యాఖ్యానములో : ''రూపకం తద్వదేవాఽఽలాపనదేవస్యాత్॥''

పైని కనఁబఱచియుండు రత్నాకర శ్లోకముచేతను, కల్లినాథుని వ్యాఖ్యానముచేతను, ఇప్పుడు వాడుకలోనుండు రాగాలాపనము రూపకములో చేరినది యని తెలియుచున్నది. రూపక మనఁగా ప్రబంధ రహిత ఆలాపనము. మఱియు రాగాలాపనములోని అపన్యాస యుక్తరాగ ప్రస్తారము రూపక మనఁబడును. ఈ రూపకమునే రాగవర్ధని యని వెంకట మఖి చతుర్దండిప్రకాశికలో చెప్పియున్నాఁడు. ఈ రాగవర్ధని నాలుగు విధము లనియును అందు మొదటిది ''ఎడుప్పు'' అనియును చెప్పియున్నాఁడు.

''శ్లో॥ ఆక్షిప్తికానంతరంతు కర్తవ్యారాగవర్ధని ।
ఇయమేవ జనైర్లోకే ఎడుప్పిత్యభిధీయతే ॥ ''

తా. ఆక్షిప్తికానంతరము జేయు రాగాలాపనము రాగవివర్ధని యనఁబడును. ఈ రాగవివర్ధని లోకములో ''ఎడుప్పు''* అని చెప్పఁబడుచున్నది.

దాక్షిణాత్య రాగాలాపనము హిందూస్థాని రాగాలాపనమునకు వ్యత్యాసమై యున్నది. మఱియును హిందూస్థాని రాగాలాపనము పూర్వ శాస్త్రోక్త రాగాలాపన పద్ధతి యనియును, అదియే మంచిత్రోవ యని యును తెలియుచున్నది. ఎట్లనిన, పూర్వగ్రంథగత పద్ధతిలో రాగములలో ఆలప్తిగాని, ఆలాపనముగాని మంద్రస్థాయినుండియే ప్రారంభించి చేయఁ దగినదని స్పష్టముగ తెలియుచున్నది. హిందూస్థాని గవాయిలు రాగ ములను పాడునపుడు మధ్యషడ్జములో ప్రారంభించి మంద్రస్థాయి ప్రస్తార మును జేసికొని వెనుక మధ్యస్థాయిలోను, అటువెనుక తారస్థాయిలోను

---

* చతుర్దండిప్రకాశిక గ్రంథకర్తయైన వెంకటమఖి, తంజావూరిలో చేనప్ప నాయుని కాలములో మంత్రిగా నుండిన గోవిందదీక్షితుని కుమారుఁడు. చతుర్దండి ప్రకాశిక యను సంగీతలక్షణ గ్రంథము నితఁడు తంజావూరిలోనే వ్రాసినాఁడని తెలియు చున్నది. పై నుదహరించియుండు శ్లోకములో ''ఎడుప్పు'' అను ద్రావిడ పదమునే ప్రయోగించియున్నాఁడు. ఈ ''ఎడుప్పు'' అను పదమునకు ఆంధ్రములో ''ఎత్తుట'' లేక ప్రారంభించుట అని యర్థము. కనుక ఆక్షిప్తికకు వెనుక చేయఁబడు రాగవిస్తారమును ఎడుప్పు అని చెప్పినాఁడు. ఇందుచేత రాగ విస్తారములోని మొదటి వివర్ధని రాగప్రస్తార ప్రారంభమని తెలియుచున్నది.

క్రమముగ రాగ విస్తారముఁజేసి తరువాత మూర్ఛనాప్రస్తారములచే (ఫిరు కాలచే) రాగమును మధ్యకాల త్రికాలముగఁ జేసి డిగి మధ్యషడ్జములో ముగించుచున్నారు. అందుచేత రాగములోని రక్తి చెడకుండయున్నది. రాగములను పాడునపుడు సుమారు మధ్యస్థాయి పంచమములోనుండి తారస్థాయి పంచమమువఱకు గలుగు రక్తివిశేషము మంద్రస్థాయిలోను మధ్యస్థాయి పూర్వభాగములోను గలుగుటలేదు. రాగవిస్తారమును చేయునపుడు మంద్రస్థాయి షడ్జములోనుండి, అపన్యాసక్రమము ఆరోహించునపుడు, క్రమముగ రాగములోని రక్తి యధికమగుచున్నదను విషయము సర్వజనానుభవ సమ్మతము. అట్లుండియు మన దేశములో గాయకులు రాగములను పాడునపుడు వానిని తారస్థాయి షడ్జములోనుండి ప్రారంభించి తారస్థాయి పంచమమువఱకును విస్తరించి, రాగమును ముగించునపుడు పాడదగినదియై యుండు మూర్ఛనాప్రస్తారములను (ఫిరుకాలను) రాగ ప్రారంభములోనే పాడి రాగములో విరక్తిని ఒక నిబంధములోపల వ్యయముచేసి తదనంతరము కొండమీఁదనుండు బండ దొర్లిన చందంబున తటాలని మంద్రస్థాయికి డిగి అచట రక్తిరహితమైన సంచారములను చేయుచున్నారు. ఈ రాగప్రస్తారపద్ధతి అనుభవమునకును శాస్త్రమునకును విరోధమైనదియే యగును,

రాగవర్ధని : రాగవర్ధని యనఁగా రాగమును పెంచుట అని భావము. ఈ రాగవర్ధని నాలుగు విధములుగ విభజింపఁబడియున్నది. వానికి క్రమముగ ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ రాగవర్ధను లని నామములు గలవు.

విదారి : విదారి యనునది ముక్తాయి (ముక్తాయి=ముగించుట). రాగవర్ధనిని ముగించు క్రియ ముక్తాయి లేక విదారి యనఁబడును. అందుచేత, రాగవర్ధని ప్రకారమే విదారులకును ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ విదారు లని పేళ్లుగలవు.

ప్రథమ రాగవర్ధనియును విదారియును : ఆక్షిప్తికను పాడినవెంటనే రాగాలాపనములలోఁ జేయఁబడు గానక్రియ ప్రథమ రాగవర్ధని యనఁబడును. ఇందుకు క్రమము : మధ్యషడ్జములోనుండి ప్రారంభించి న్యాసాంశాది దశవిధ రాగ లక్షణములును, జాత్యాది లక్షణములును, పక్కగ నుండు నటులును, వివాది శ్రుతులతోఁ గూడిన సంగతులు మధ్యలో రాకుండ

నుండునటులును, గమకముల నుచితముగ ప్రయోగించి రక్తిచెడకుండ మంద్రస్థాయిలో రాగాలాపనమును అపన్యాస క్రమము చెడకుండఁజేసి, అటువెనుక మధ్యస్థాయిలోను మితముగ ఆలాపనమును జేసి, పై షడ్జములో నుండి తటాలని ఫిరుకాలతో మధ్యషడ్జమునకుఁ డిగి అచట నిలుపవలయును. ఇట్లు తారషడ్జంబునుండి ఫిరుకాలతో డిగి రాగవర్ధనిని ముగించు క్రియ విదారి యనఁబడును. ఈ ప్రథమ రాగవర్ధనిలోఁ జేయఁబడు గానక్రియలు విశేషముగ విళంబకాలములోను స్వల్పముగ మధ్యకాలములోను ఉండవలయును. ఇందుకుఁ గల ప్రథమ విదారిని ఉపయోగించునపుడు మాత్రము మధ్యకాల త్రికాల యుక్తమైన ఫిరుకాల నుపయోగింపవచ్చును. ఈ ప్రథమ రాగవర్ధనిలో అపన్యాసక్రమమున సంగతులను పాడునపుడును విశేషముగ విళంబ ప్రస్తారమును, ఒక అపన్యాసములోనుండి మఱియొక అపన్యాసమునకు ఎక్కునపుడో లేక దిగునపుడో కొంచెము ముందుగా మధ్యకాల త్రికాల సంగతులను కొంచెముగను యథోచితముగను పాడి ఆయా అపన్యాసమును పూర్తిచేయవలయును. ఇదియే ప్రథమ రాగవర్ధని లక్షణము.

ద్వితీయ రాగవర్ధని : ఈ రెండవ రాగవర్ధనియును మొదటి రాగవర్ధని తీరుననే చేయఁదగినది. అయినను, ఇందు విచిత్ర వర్ణాద్యాలంకారములతోను గమకములతోను కల్పనములను జేసి రాగమును విస్తరింపవలయును. మఱియు నీ రెండవ రాగవర్ధనిని చేయునపుడు మంద్రస్థాయిలో సంచారముసేయక విశేషముగ మధ్యస్థాయిలోను తారస్థాయి పంచమమువఱకును సంచరించి రెండవ విదారిచే రాగవర్ధనిని ముగించి మధ్యషడ్జములో నిలుపవలయును.

తృతీయ రాగవర్ధని : ఈ మూఁడవ రాగవర్ధని తారస్థాయిలోఁ జేయఁదగినది. ప్రారంభములో మధ్యస్థాయి పంచమములోనుండి తారషడ్జమునకేఁగి అచటనుండి వరుసగ ప్రస్తారములను తారస్థాయి పంచమమువఱకు యథోచితముగఁ జేసి విదారినిఁ జేయవలయును.

చతుర్థ రాగవర్ధనియును విదారియును : పైని చెప్పఁబడిన రెండవ మూఁడవ రాగవర్ధనుల తీరుననే ఇందులోను సంచారములను జేయవలయును. అయినను ఈ రాగవర్ధనిని స్వల్పముగాను విశేషముగ (ఫిరుకాలు) మూర్ఛనాప్రస్తారములతోను చేయవలయును.

పైని చెప్పఁబడియున్న నాలుగు విధములగు రాగవర్ధనులను చేయు నపుడు క్రమముగ రాగవిస్తారకాలమును తగ్గించుకొని రావలయును. ఎట్లనిన: మొదటి రాగవర్ధనిలో 20 నిమిషములు (20 Minutes) సంచరించినయెడల రెండవ రాగవర్ధనిలో 10 నిమిషములును, మూఁడవ రాగవర్ధనిలో 5 నిమిషములును, 4-వ రాగవర్ధనిలో $2\frac{1}{2}$ నిమిషములును సంచారము చేయవలయును. అట్లు చేయకున్నయెడల రాగములో రంజనము చెడిపోవును.

పైని చెప్పిన తీరుగ 4 రాగవర్ధనులను చేయక రెండు వర్ధనులలోనే రాగమును ముగించుటయును వాడుకలో నున్నది. గాయకులు ఈ వర్ధనులను సమయోచితముగ చేయవలయును.

స్థాయిసంచార మని మఱియొక సంచారపద్ధతియును గలదు. అది ఆరోహణస్థాయి సంచారము, అవరోహణస్థాయి సంచారము అని రెండు విధములగును. అందు ఆరోహణస్థాయి సంచార మెట్లనిన, మధ్యషడ్జములో నుండి ప్రారంభించి మంద్రషడ్జమువఱకు దిగి మధ్యకాలముగ ప్రస్తరించి తరువాత మధ్యస్థాయి ఋషభమునకువచ్చి ఆ ఋషభమును స్థాయిస్వరముగ నుంచుకొని దానికి మీఁదనుండు స్వరముల నేదియును కనిపించక ఆ స్వరమునకు క్రిందనుండు స్వరములలో మాత్రము సంచారము చేయుట. మఱియొక పద్ధతి యెట్లనిన, పైని చెప్పిన తీరుననే మధ్యస్థాయియందుఁ గల సప్తస్వరములలోను ఒక్కొక్కమాఱు నిలిచి ఆ స్వరమును స్థాయిగఁ జేసికొని రాగమును విస్తరించుట. ఇట్లే అవరోహణముగ సంచారముచేయుట అవరోహణస్థాయి సంచార మనఁబడును. ఈ ప్రస్తారపద్ధతి అపన్యాస క్రమమునకుఁ గల అంగములలో నొకటియేగాని మఱేమియును కాదు. అట్లుండియు పూర్వాచార్యులలో కొందఱు ఈ స్థాయి సంచారములను ప్రత్యేకముగఁ జెప్పియున్నారు.

భరతాచార్యుడు మకరిణి యని యొక రాగాలాపన పద్ధతిని చెప్పియున్నాడు. ఈ పద్ధతి రెండవ మూఁడవ రాగవర్ధనిలో నున్న విధముగనే యున్నది కనుక దీనిని ఇచట వ్రాయలేదు.

పైని చెప్పిన రాగాలాప లక్షణము లన్నిరాగములకును సాధారణమైనదియే యగును.

రాగములోని "తానం" అను శబ్దమునకు ఉత్పత్తిక్రమమును మన మెఱుఁగవలసినది అవశ్యకమే యగును. పూర్వ గ్రంథములలో రాగములను పాడునపుడు "తానం, తానం" అను శబ్దమునే చేకొని రాగాలాపనము చేయవలయునని చెప్పఁబడియున్నది. "తానం తానం" అని మాటిమాటికి రాగములో పాడునపుడు అకార అంకారాదులనుచేర్చి ఆ శబ్దమును దీర్ఘముగ పాడుట వాడుకగ నున్నది. రాగమును మధ్యకాలముగ పాడుటయే పూర్వకాలమునందు తాన మని చెప్పఁబడెను ప్రకృతమునను వైణికులు తానమును మధ్యకాల మనియే చెప్పుచున్నారు.

"తానం" అను శబ్దము దాక్షిణాత్య గానపద్ధతిలోని "తెన్నా" అను పదములోనుండి స్వీకరింపఁబడి తాన మని సంస్కరింపఁబడినది. సుమారు 60 శతాబ్దములకు మునుపే ఈ "తెన్నా" అను రాగమును పాడుచున్న పద్ధతి దక్షిణదేశములో నుండె నని తెలియుచున్నది. "తెన్నా" అను పదమునకు "దక్షిణ రాష్ట్రాధిపా" అని యర్థము. పూర్వము దక్షిణ రాష్ట్రములో ప్రధానమైన పాండ్యమండలము నేలుచుండిన యొకానొక రాజునుగుఱించిన స్తోత్రముగ "తెన్నా తెన్నా" అని రాగములందు పాడుట వాడుకగ నుండె నని తెలియుచున్నది. ద్రావిడ పండిత శిరోరత్నముగ చెలంగిన శఠకోపులును (నమ్మాళ్వారు) తమ తిరువాయిమొழி యను ద్రావిడ గ్రంథములో, "తెన్నా తెనా వెన వండుమురల్ తిరువేంగడత్తు" అని తిరుపతిలోని శ్రీనివాసుని నుతించునపుడు పురవర్ణనా విశేషసూచకముగ (తిరుపతిలోని భ్రమరములును తెన్నా తెనా అని పాడుచున్నవి) అని రచియించియున్నారు. ఇందువలన వీరికాలమునకు చాల పురాతనకాలములోనే "తెన్నా" అని రాగమును విస్తరించు క్రమమున్నదని తెలియుచున్నది. ఈ తెన్నా అను పదము క్రమ క్రమముగా ఆర్యజనవ్యవహారములో "తానం" అని వాడఁబడి వెనుక, "తానం తానం" అను శబ్దము "అనంతా నంతా" అని సర్వేశ్వరుని నామోచ్చారణ సూచక మని వివరింపఁబడెను. రాగమును పాడునపుడు ఈ తాన శబ్దము శ్రుతిలో చేకుటకైన నొక మంచిసాధన శబ్దమై యున్నదను విషయమును బుద్ధిమంతులు గమనింతురుగాక.

తాయము : ఒక రాగములో నుండు నేదైన నొక స్వరమును స్థాయిగ నుంచుకొనుట తాయ మనఁబడును. ఇది యొక విచిత్రమైన రాగాలాపన పద్ధతి.

రాగములలో గ్రహస్వరములను పాడుటచే తాయ మని చెప్పఁబడు చున్నది. గ్రహస్వరము వాది సంవాదులుగ పాడఁదగినవి. శంకరాభరణ రాగములో "సరిగమ" అను స్వరమునకు "పధనిస" అను స్వరములు సమముగ నున్నవి. కనుక, "పధనిస" అని పాడునపుడు పంచమమును షడ్జగ్రహముగ మార్చి "సరిగమ" అని పాడుట గ్రహభేద మగును. శంకరా భరణ రాగములో "నిసరిగమపధని" అను స్వరములను గ్రహభేదము చేయునపుడు పంచమమును షడ్జముగ చేసికొని అందులోనుండి కల్యాణి రాగమునకుఁ గల స్వరములను పాడునపుడు ఆధారశ్రుతికి శంకరాభరణ రాగము చెడకుండ నుండును. ఇట్లు గ్రహస్వరములను రాగానుసారముగ మూఁడు నాలుగు స్వరముల నమర్చికొని గానముచేసి అన్యరాగకళలను జూపించి ఆధారశ్రుతిలో వచ్చి నిలిచి ప్రధాన రాగకళను జూపించి గానము చేయుట తాయ మనఁబడును. గ్రహభేదములను చేయుటలో ననేక విధము లున్నవి. వానిని గ్రంథవిస్తర భీతిచే నిచట వ్రాయలేదు. ఈ గ్రహభేదము గాత్రగానములో మాత్ర ముపయోగింపఁ దగినది. పైని చెప్పియున్న గ్రహభేదపద్ధతుల ననుసరించిన ప్రస్తారములోని రాగములే నిషాదాంత్య, ధైవతాంత్య, పంచమాంత్య రాగములుగ వెలయుచున్నవని యెఱుఁగునది.

సంగీతసంప్రదాయ ప్రదర్శినిలో వ్రాయఁబడియున్న తాయమును నీ దిగువ వ్రాసియున్నాను. అందులోను పైని చెప్పిన రీతిగనే భావము గలుగుచున్నది. అయినను అవి విశదముగ లేదు.

## తాయము.

"ఆయా రాగముల ననుసరించి ఏదైన నొక స్వరమును స్థాయిగాఁ గల్పించుకొని, దాని క్రిందిగల స్వరములందు రాగలక్షణములవలె సంచరించి మధ్యషడ్జమున న్యాసమొన రించి, (1) ఆ స్థాయికి పయిని ఆరోహణ క్రమముగాఁ గల మొదటిది, రెండవది, మూఁడ వది, నాలుగవదియైన స్వరముల క్రమముగా నొక్కొక్క స్వరముగా చేర్చుకొని సంచా ములుచేసి మధ్యషడ్జమందే న్యాస మొనరింపవలెను. మఱియు, (2) అవరోహణ క్రమముగ ఆ నాలుగవ స్వరమందే తానము నారంభించి వానికి క్రిందిగల స్వరముల నంటక ఆ స్వరము నంటను, వానికి పయినిగల స్వరములందును సంచార మొనరించి మధ్యషడ్జంబున న్యాసం బును చేసి, స్థాయికి మూఁడవది, రెండవది, మొదటిదియైన స్వరములందు క్రమంబుగా నొక్కొక స్వరముగా నెత్తుకొని సంచరించి మధ్యషడ్జమందే న్యాసము లొనరించవలెను. ఈ రీతిని ఎనిమిది తానములు గానముచేసి, స్థాయి స్వరము నెత్తుకొని ఆలాపలక్షణ ప్రకారముగా కొంచె మాలాపించి తారస్థాయినుండి విదారించుకొనివచ్చి మధ్యషడ్జమందు

పాడుటను న్యాసంబుతో నిలుపవలెను'' అని వెంకటమఖి తమ చతుర్దండిప్రకాశిక తాయప్రకరణములో జెప్పియున్నారు.

కటకము : పూర్వాచార్యులు తానమును కటక మని చెప్పియున్నారు. ఈ కటకమునకు రాగమునకుఁ గల అన్నిలక్షణములును గలవు. ఇందులోను గ్రహస్వరభేదములను చేయుట వాడుకలో నుండెనని తెలియుచున్నది.

పూర్వ ద్రావిడగ్రంథములలో 4 గ్రామములును, అందుఁ బుట్టిన జాతులను, ఆ జాతులలో బుట్టిన 16 ప్రసిద్ధ రాగములను, వానిలో ప్రస్తరింపఁబడిన 214 గొప్పరాగములను, వీని జన్యములైన అనేక రాగములను చెప్పి, వానిమొత్తము 11991 రాగము లని చెప్పఁబడియున్నది. అట్టి రాగములు 12000 కన్న నధికముగనే యుండవలయు ననియును తెలియుచున్నది. కొన్నిగ్రంథములలో 6000 రాగము లున్నవని చెప్పియున్నారు. ఇప్పుడు వాఁడుకలో సుమారు 1200 రాగములే యున్నవి. వానిలో సుమారు 200 రాగములలో మాత్రమే గీత కీర్తనాదులయం దుపయోగింపఁబడియున్నవి. విద్వాంసులు సుమారు 40 రాగములను పాడుచున్నారు. లక్ష్యలక్షణములను నెఱింగి పాడఁదగిన విద్వాంసులసంఖ్య చాలతక్కువగ నున్నది. అట్టి గొప్ప విద్వాంసులును గీత కీర్తనాదులు చేయఁబడియుండు రాగము లన్నియును పాడుటకు శక్తిలేక నున్నారు. ఇట్లు రాగముల సంఖ్య దినేదినే క్షీణమును నొందుచున్నది. ఇది చాల పరితాపమైన విషయము.

పూర్వ ద్రావిడులు తేవార మను నొక వృత్తమును భక్తిమార్గములో రచియించి గానము చేయుచుండిరి. ఆకాలమున అనేక రాగములు వాడుకలో నుండినవని పూర్వగ్రంథములో చెప్పఁబడియున్నవి. రత్నాకరములోని ''ద్రావిడి, హిందోళము, భిన్నకైశికము, టక్క'' మొదలగు అనేక రాగములు ద్రావిడరాగములే యగును.

ప్రకృతము మదరాసు ఎడప్పాళయములో నుండు మ. నాదముని పండితుఁడు, ''సంగీతస్వరప్రస్తారసాగర'' మను నొక సంగీత పుస్తకమును ప్రచురించి యున్నాఁడు. ఇతఁడు నాగస్వరము, క్లారెనెట్టు వాద్యములను వాయించు నని తెలియుచున్నది. ఇతఁడు ప్రచురించియుండు పుస్తకములో 2044 రాగముల కారోహణావరోహణములు వ్రాయఁబడి యున్నవి. ఇందులో సుమారు 1200 రాగములు పూర్వ గ్రంథగతంబులైనయవి. తదితర

రాగము లెవరి కల్పితములో తెలియలేదు. ఈ నవీన కల్పనా రాగము లిదివఱకును గీతకీర్తనాదులలో నుపయోగింపఁబడి యుండునటులు తెలియ లేదు. అందుచేత నవీనకల్పనములై వాడుకలో లేనిదియును గ్రంథోక్తము కానిదియునైన రాగములను వదలి పూర్వ గ్రంథగతంబులైనదియును, విద్వాంసులచే గీతకీర్తనాదుల నిమిత్తముగ నేర్పఱుపఁబడిన హంసధ్వని, పుష్పలతిక, కదనకుతూహలము మొదలగు రాగములను జేర్చి సుమారు 1100 రాగములకు రాగపట్టికను సిద్ధపఱచి ఆరోహణావరోహణములతో నీ గ్రంథముయొక్క అనుబంధము (B) లో జేర్చియున్నాఁడను.

గీతము, ప్రబంధము అను వీనికి పూర్వగ్రంథములలో పెద్దలు విశేషముగ లక్షణములను వ్రాసియున్నారు. భాషలకు వృత్తలక్షణములను వ్యాకరణ సూత్రములును ఎట్లున్నవో అట్లే ప్రబంధములకు లక్షణములున్నవి. స్వరాది తాళాంత్యముగ గల 6 లక్షణములతోఁ గూడుకొనియున్న గీతము ప్రబంధ మనఁబడును. గీతప్రబంధములను ఇచట విశదముగ వ్రాయవలయునేని సుమారు 150 పుటలు కావలసియుండును. రత్నాకరములో గీత ప్రబంధములకు, ప్రబంధాధ్యాయ మను ఒక పెద్ద అధ్యాయము వ్రాయఁబడియున్నది. మఱియు, ఈ గీతప్రబంధములలో అనేకము లిప్పుడు వాడుకలో లేక తొలఁగిపోయెను. గీతప్రబంధాదులను గుఱించి బ్రహ్మశ్రీ, సుబ్బరామదీక్షితులు సంగీతసంప్రదాయ ప్రదర్శినిలో కడుహృద్యముగను, సంగ్రహముగను వ్రాసియున్నారు. వాని నీ దిగువ జూడుఁడు :

గీతము : శుద్ధసూడ, ఛాయాలగసూడ అని రెండు భేదములగును. సూడ అనునది గీత వాచకమైన దేశీయ పదము. శాస్త్రనియమంబులు గల ఛాయను పొందిన గీతము శుద్ధ మనఁబడును. సాలగము అను నది ఛాయాలగపద వికారము. ఈ సాలగ సూడ, ధ్రువ, మధ్య, ప్రతిమర్య, నిస్సారుక, అట్టతాళ, రాసతాళ, ఏకతాళములైన ఏడు భేదంబులు. వీనిలో ధ్రువము అనునది, ధాతు మాతువులతో చేరిన రెండు గీత ఖండములలో, ఉద్గ్రాహము అను మొదటి ఖండమగును. ఈ ఉద్గ్రాహ ఖండమందు గల స్వరములకంటె ఉచ్చమైన స్వరములఁ గలిగిన ఆభోగము అను నొక ఖండము గలదు. ఉద్గ్రాహ ఖండము యొక్క మొదటిభాగ మెచట న్యాస ముంచఁబడునో దానికి ధ్రువము అని పేరు. ఈ ధ్రువము

పదునొకండక్షరములు మొదలు ఇరువదిమూఁడక్షరములవఱకుఁ గల పదిమూఁడు భేదములకు నామములు, రసములు, తాళములు మొదలైన లక్షణములు వేర్వేఱఁ జెప్పఁబడియున్నవి. ఇటులనే తక్కిన ఆఱు తాళములకును జెప్పఁబడియున్నవి. ఈ వివరములు విశదంబుగా చతుర్దండిప్రకాశికలో గీతప్రకరణమందును, సంగీతరత్నాకర ప్రబంధాధ్యాయాంతమందును జెప్పఁబడియున్నవి. గ్రంథ విస్తరభీతిచే నిచట విరివిగాఁ జెప్పక చాలించుకొంటిని. ఇటువంటి గీతంబులు ఇప్పుడు కనఁబడవు. ధ్రువము మొదలైన సూళాది ఏడు తాళంబులును, ఝొంపటయును, రగణమఠ్యంబును ఈ తొమ్మిది తాళంబులే గీతంబులందు జేర్పవలయునని వేంకటమఖి అలంకారంబులు చెప్పుచోటఁ జెప్పియున్నట్లే ఇప్పటి వాడుకలోనున్న గీతంబులలో కనఁబడుచున్నవి. గీతంబులు రెండు ఖండంబులుగను, మూఁడు ఖండంబులుగను ఉన్నవి. రెండు ఖండంబులుగా నుండు గీతంబులలో మొదటిది ఉద్గ్రాహ ఖండము ; ఈ ఉద్గ్రాహ ఖండ స్వరంబులకంటె ఉచ్చమైన స్వరంబుగలదియే రెండవదియైన ఆభోగఖండము. ఈ రెండు ఖండంబులుగల గీతంబులలో మొదటిఖండమందే ధ్రువఖండము మధ్యషడ్జ న్యాసంబులుగా నుంచఁబడియున్నది. మూఁడు ఖండంబులు గల గీతంబులలో మొదటిది ఉద్గ్రాహముగను, రెండవది ఆభోగముగను, మూఁడవది ముద్రాఖండంబుగను ఉన్నది. ఈ మూఁడు ఖండంబులుగల గీతంబులలో మాత్రము అంతరి గలదు. మొదటిదియైన ఉద్గ్రాహఖండంబులో ధ్రువమునకు వెనుక అంతరి*, అవతల జావడ †; రెండవదియైన ఆభోగ ఖండము, పిమ్మట అంతరి; పిమ్మట మూఁడవదియైన ముద్రాఖండము, పిమ్మట అంతరము, ఇటులనే ప్రాచీన పుస్తకంబులోను, వాడుకయందును గనఁబడుచున్నవి. ఈ అంతరంబులు ఐదవధాతువనియు, త్రిఖండ గీతంబులోమాత్రమే కనఁబడుచున్నదనియు వేంకటమఖి చతుర్దండిప్రకాశిక ప్రబంధ ప్రకరణములోఁ జెప్పియున్నాఁడు. ముద్రాఖండంబు అనేకముగ ఉద్గ్రాహఖండధాతువును గలదిగానే యుండినప్పటికిని, కొన్నిటిలో ముద్రాఖండధాతువునకు కొంచెము వేఱుగా కనఁబడుచున్నది. ఈ వివరంబును సంగీతసంప్రదాయ ప్రదర్శినిలో నాదనామక్రియ, హిందోళ రాగగీతంబులు మొదలైనవానిలోఁ జూడుఁడు.

---

* అంతరంబుల ధాతు మాతులు మూఁడు ఖండంబులకును ఒకటిగానే యుండును.

† జావడ అనునది దేశీయ పదము. ఆ పదమునకు గీతములో సగము అని అర్థము.

ముద్రాఖండ ధాతువులు విశేషంబుగ ఉద్గ్రాహఖండ ధాతువువలె నుండుట వలన పాఠము సేయువారు ఉపేక్షించిరి. అందుచేత అంతరంబులోఁ గూడిన అనేక గీతంబులు ముద్రాఖండంబులేకయే యున్నవి. రూపక తాళమునఁ గల కొన్ని గీతంబులు ధ్రువరూపకమనియు, రూపకధ్రువమనియు రెండు విధములై కనఁబడుచున్నవి. (1) ధ్రువరూపక మనునది మొట్టమొదట మూఁడు కొట్లుకొట్టి విసరి, అవతల కొట్టెడు మఱియొక ఘాతయందు ధ్రువమునుంచి తోడనే విసరి రెండుకొట్లును, ఉద్గ్రాహ ఖండాంతంబున విసరు వచ్చిన పిమ్మటనున్న ఆభోగఖండారంభమున మూఁడు కొట్లు కొట్టి విసరి, తోడనే ఒక కొట్టు కొట్టి విసరి రెండు కొట్లు కొట్టుకొనియే వచ్చి ఖండాంతమందు విసరినవెనుక ధ్రువఖండమును పాడుట వాడుక. కొన్ని గీతంబులలో ధ్రువము మీఁదఁ జెప్పినట్లుండక ఆ ఉద్గ్రాహఖండమందే వేఱు చోట్లలో గనఁబడుచున్నది. (2) రూపకధ్రువ మనునది త్రిఖండ గీతంబులుగాను అంతరమందు మూఁడు కొట్లు కొట్టి విసరి, తోడనే ఒకకొట్టు కొట్టి విసరి, పిమ్మట కొట్టెడు రెండవ కొట్టునందు ధ్రువముంచి ఆభోగ ఖండమును పాడి మీఁదఁ జెప్పినట్లే తాళము వేసుకొని వచ్చి అంతరము పాడుట వాడుక. కొన్ని గీతంబులలో రంజనమునకై, అనుద్రుత, ద్రుతంబులు మొట్టమొదట నెత్తఁబడియున్నవి.

శ్లో॥ అష్టభాషా పదైర్యుక్తం అయ్య అంవోతియై ర్యుతం ।
స్వర రాగైః ప్రగాయంతి గీత మిత్యభిధీయతే ॥

గీతంబుల మాతువులు, సంస్కృతాభాసమైన ప్రాకృతాది భాషా పదములును, ఆభోగఖండ మాతువులలో అర్థములేని అ అ, అయ్యా, తి య్యా, అంవో ఇయు, అరే, యను శబ్దములతోను గూడుకొని యుండవలయును.

శ్లో॥ గీత ప్రబంధ రాయానాం స్ఫాలనం బహిరంతరం ।
తానాది మూర్ఛనా నాంతు అంతస్ఫాలన మిత్యపి ॥

గీత ప్రబంధ తాయంబులఁగల ధాతు మాతువులలో ప్రత్యక్షరమునకును, వీణలో లోమీటు వెలిమీటు నుపయోగించుటయు, తాన రాగాలాపన కీర్తనాదులయందు లోమీటునుమాత్ర ముపయోగించుటయు పూర్వికుల సంప్రదాయము. కీర్తనాదులలోఁ గల మాతువుల ప్రత్యక్షరంబులందును లోమీటు మీటుటయే గాక, సాహిత్యాక్షరంబులు దూరంబుగా నుండు తావులలో వీణలోని తంత్రీనాదము తెలియునట్లు సందర్భానుసారంబుగా

నొక మీటును మీటి వాయించుటయే వాడుక. తానంబులకు రెండేసి అక్షరంబుల కొక మీటును, తిశ్ర, ఖండ జాతులలోఁగల అంత్యాక్షరము లందు నడిమి వ్రేలిచే తడమీటును మీటవలయును.

ప్రబంధము : ప్రబంధము ఆఱు అంగములతోను, నాలుగు ధాతువులతోను, స్వర సందర్భము గలదిగాఁ జేర్పఁబడినది :— ఆఱు అంగములు: (1) స్వరము ; (2) బిరుదము ; (3) పదము ; (4) తెన్నకము ; (5) పాటము ; (6) తాళము.

(1) స్వర మనునది, స రి గ మ ప ధ ని అను స్వరములు. (2) బిరుద మనునది, సంబోధన ప్రథమగా ప్రబంధనాయకుని ధైర్య శౌర్యాదులను నుడువుట. (3) పద మనునది, క్రియా కారక క్రియలచే ధైర్య శౌర్యాదులను జెప్పుట. (4) తెన్నక మనునది భాండీర భాషయందు గలిగిన తేన అను శబ్ద వికారము. తత్ అను పదముయొక్క సంబంధము గలది. తత్ అను శబ్దము నిత్యమంగళస్వరూపమైన పరబ్రహ్మ వాచకము. "ఓం తత్సత్" అనుట వలనను, "తత్త్వమసి" అను మహావాక్యమువల్లను ప్రబంధములలో తేన తేన అను శబ్దము కనఁబడుచున్నది. (5) పాట మనునది వాద్యములలో గలుగు అవ్యక్తాక్షరసముదాయము, రుద్రవీణలోఁగలుగు తకతక మొదలైనవియును, ముఖవాద్యమైన శంఖములోఁ గలుగు తుకుతుకు మొదలైనవియును, ఉరోవాద్యములో గలుగు ధింత ధింత కిణ కిణ మొదలైనవియును, తక్కిన వాద్యములందు లక్షణానుసారముగాఁ గలుగు పాటములను గలది. (6) తాళ మనుట తాళప్రకరణమునఁ జెప్పఁబడినది.

ధాతు అనునది ప్రబంధమునకుఁ గల అవయవము. ఆ ధాతువు (1) ఉద్గ్రాహము, (2) మేళాపకము, (3) ధ్రువము, (4) ఆభోగము అని నాలుగు విధములు.

(1) ఉద్గ్రాహము : ప్రబంధంబుయొక్క మొదటి భాగము. అనఁగా మొదట గానమున గ్రహించుట. (2) మేళాపకము, ఉద్గ్రాహ ధ్రువములు కలియుటకు కారణమైనది. (3) ధ్రువము : ప్రబంధముయొక్క ముగింపు. (4) ఆభోగము : పైని చెప్పిన ధాతువులగల స్వరములకంటె హెచ్చయిన స్వరములు గలది. ప్రబంధములందుపయోగింపఁబడెడి యీ ధాతువును పరిభాష సంగీతాచార్యులైన మతంగాది మునులచే వచింపఁబడియున్నది.

ప్రబంధము ద్విధాతుకము, త్రిధాతుకము, చతుర్ధాతుకము లని మూఁడు విధములు. ద్విధాతుకము ఉద్గ్రాహ ధ్రువములఁ గలది. త్రిధాతుకము ఉద్గ్రాహ ధ్రువ ఆభోగములు గలది. చతుర్ధాతుకము ఉద్గ్రాహ మేళాపక ధ్రువ ఆభోగములు గలది. ఇదిగాక నిర్యుక్తము, అనిర్యుక్తము లని రెండు విధములు. నిర్యుక్తము ఛందస్సులను తాళ రాగములను గలది. అనిర్యుక్తము పైని చెప్పిన ఏర్పాటులేక చెప్పఁబడినది. ఈ ప్రబంధములు (1) మేదినీ జాతి; (2) ఆనందినీజాతి ; (3) దీపినీ జాతి ; (4) భావినీ జాతి ; (5) తారావళీ జాతి అని ఐదువిధములు. (1) మేదినీ జాతి స్వరము మొదలుగా షడంగములను ; (2) ఆనందినీజాతి ఐదంగములను ; (3) దీపినీ జాతి నాలుగు అంగములను ; (4) భావినీ జాతి మూఁడు అంగములను ; (5) తారావళీజాతి రెండు అంగములను గలిగియుండును. (1) మేదినీజాతి శ్రీరంగము మొదలు ఏడు భేదంబులు. (2) ఆనందినీజాతి పంచతాళేశ్వరము మొదలు పదిభేదంబులు. (3) దీపినీజాతి సుదర్శనము మొదలు ఐదు భేదములు. (4) భావినీజాతి వర్ణము మొదలు పదియేడు భేదంబులు. (5) తారావళీజాతి ఏల మొదలు ఇరువది రెండు భేదంబులు ఇవి యన్నియును ఏకజాతి ప్రబంధము.

ద్విజాతి ప్రబంధమని మఱియొకపద్ధతి యున్నది. అది (1) హయ లీల ; (2) గజలీల ; (3) ద్విపది , (4) ద్వితకము ; (5) వృత్తము, (6) ఘట నామ అని ఆఱు విధంబులు. తక్కిన భేదములును వాని లక్షణములును చతు ర్దండిప్రకాశికలో ప్రబంధప్రకరణమందును, సంగీత రత్నాకరములో ప్రబం ధాధ్యాయమందును జూడుఁడు.

తానీకరణమని వేఱొకపద్ధతియును గలదు. అందు కొన్ని తానీకరణ ములు గీతలక్షణములను, కొన్ని తానీకరణములు ప్రబంధలక్షణములను అను సరించి ఎడనెడ విళంబ మధ్యలయలు గలవిగానుండును. అలంకార, గీత, ప్రబంధ, తానీకరణములు మూఁడవ కాలమునందును గాత్రమును హస్తద్వ యములోని తాళమును సమముగాను యథాక్షరముగాను ఉండునట్లు పాడ వలయును. సగాభ్యాసులు గాత్రమును చేతులును సమముగాను ఏక కళగాను పాడఁదగినయవి. పైని చెప్పిన అలంకార గీత తాయ ప్రబంధ తానీకరణ ములను వీణలో లోమీటు వెలిమీటులతో వాయించవలయును. గీత ప్రబంధ తానీకరణములు మొదట మధ్య తారస్థాయిలయందును, తరువాత మంద్రమధ్యస్థాయిలయందును వాయించుట సంప్రదాయముగా నున్నది.

## తాళము

### వందన శ్లోకము.

శ్లో॥ నానామార్గై ర్లయో యత్ర యతీనాం స్యాత్కలానిధౌ ।
తం దక్షిణం శివం నౌమి చిత్రం వృత్తిమయం ధ్రువమ్ ॥ (సం. ర.)

తా. నానామార్గములను కలవాఁడును, యోగుల చిత్తములు లయించును జేయుచున్న చిత్స్వరూపుఁడును, చంద్రకలాధరుఁడును, దక్షిణామూర్తి రూపుఁడును, మనోవ్యాపార రూపుఁడును, శాశ్వతుఁడునై వెలయుచున్న పరమశివుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ తాళ స్తల ప్రతిష్ఠాయా మితి ధాతో ర్ఘఞి స్మృతః ।
గీతం వాద్యం తథా నృత్యం యత స్తాలే ప్రతిష్ఠితం ॥

తా. తాళము తల ప్రతిష్ఠాయాం అను ధాతువులో పుట్టినది. ఘఞ్ ప్రత్యయము. ఇందు గీతవాద్య నృత్యములు నెలకొని యున్నవి.

శ్లో॥ తకార శ్శంకరః ప్రోక్తో లకార శ్శక్తిరుచ్యతే ।
శివశక్తి సమాయోగా త్తాళ ఇత్యభిధీయతే ॥

తా. తాళ మను శబ్దములో తకారము శంకరుఁ డని యును, లకారము శక్తి యని యును, ఈ శివశక్తి సమాగమములచే తాళము కలుగుచున్నదని యును చెప్పఁబడుచున్నది.

శ్లో॥ హస్తద్వయస్య సంయోగే వియోగేచాపి వర్తతే ।
వ్యాప్తిమాన్యో దశప్రాణై స్సకాల స్తాల సజ్ఞకః ॥

తా. హస్తద్వయములయొక్క సంయోగ వియోగములచే నేర్పడుచున్నదియును, దశ ప్రాణములతో కూడుకొన్నదియునై యుండునది తాళమనఁబడును.

### తాళ విభాగము.

శ్లో॥ మార్గదేశీ గతత్వేన తాళోసౌ ద్వివిధో మతః ।
శుద్ధసాలగ సంకీర్ణా స్తాళభేదాః క్రమాన్మతాః ॥

తా. మార్గము, దేశి అని తాళము రెండు విధములు. ఇవి యొక్కొక్కటి శుద్ధము, సాలగము, సంకీర్ణము అని మూఁడు విధంబులై యున్నవి.

### దశ ప్రాణములు.

శ్లో॥ కాలోమార్గ క్రియాంగాని గ్రహోజాతిః కళాలయః ।
యతి ప్రస్తారక శ్చేతి తాళప్రాణ దశాస్మృతాః ॥

తా. కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము అని తాళప్రాణములు 10 విధము లగుచున్నవి.

## కాల ప్రాణ లక్షణము.

శ్లో॥ ఉపర్యుపరి విన్యస్యా త్పద్మపత్త్రిం శతంసకృత్ ।
యఃకాల స్సూచిసంభేదా క్షణంచ పరికీర్తితః ॥
లవ క్షణై రష్టభిస్స్యా త్కాష్ఠాస్యా ష్టలవాత్మకైః ।
అష్టకాష్ట నిమేషస్స్యా న్నిమేషై రష్టభిః కళాః ॥
కళాభ్యాంతు చతుర్భాగో చతుర్భాగ మనుద్రుతం ।
అనుద్రుతౌచ బిందుస్స్యా ర్బిందుభ్యాంచ లఘుర్భవేత్ ।
లఘుద్వయం గురుశ్చైవ త్రిలఘు ప్లుతముచ్యతే ।
చాతుర్లఘుః కాకపాద మిత్యేత త్కాల లక్షణం ॥

తా. నూఱు తామరరేకులను నొకటిమీద నొకటిగనుంచి వానిని సూదితో పొడుచునపుడు అందు ఒక తామరరేకు తెగునంతకాలము క్షణ మనఁబడును. 8 క్షణములకాలమొక లవ మనఁబడును. 8 లవములు చేరిన కాలమొక కాష్ట మనఁబడును. 8 కాష్టములు చేరి ఒక నిమిష మగును (నిమిషము=రెప్పపాటు). అట్టి నిమిషములు 8 చేరినది ఒక కళ యనఁబడును. రెండు కళలుచేరి ఒక చతుర్భాగమగును. రెండు చతుర్భాగములుచేరి ఒక అనుగ్రుత మగును. రెండు అనుద్రుతముల కాలము ద్రుతమగును. రెండు ద్రుతముల కాలము ఒక చతురశ్ర లఘు వగును. రెండు లఘువుల కాలము ఒక గురువగుచున్నది. మూఁడు లఘువుల కాలము ఒక ప్లుత మనంబడును. నాలుగు లఘువుల కాలము ఒక కాకపాద మని నెఱుంగునది.

కొన్ని గ్రంథములలో రెండు కళలు చేరి ఒక అనుద్రుత మనియును, అట్టి అనుద్రుతములు రెండు చేరి ద్రుత మగుననియును చెప్పఁబడియున్నవి.

అట్లుండినను అదియొక వ్యత్యాసము కానేరదు. తాళ కాల ప్రమాణములో మతాంతరభేదము లెన్నో యున్నవి. కాలామృత మను జ్యోతిష గ్రంథములో కాలమును నిర్ణయించునపుడు సరియైన కాలనిర్ణయము చేయుటకు పరమశివుఁడే శక్తుఁడు కాఁడని చెప్పఁబడియున్నది. గనుక గ్రంథోక్త కాలప్రమాణమును మానము చేయుట అసాధ్యమైన కార్యము. గానమును చేయునపుడు వారివారికి తోఁచినటులు యథోచితముగ కాల ప్రమాణమును ఏర్పఱచుకొని గానము చేయుటయే సర్వసమ్మతమైయున్నది.

## మార్గ ప్రాణలక్షణము.

పూర్వ గ్రంథకర్తలు మూఁడు మార్గములను చెప్పియున్నారు. అవి దక్షిణము, వార్త్తికము, చిత్రము అనునవి. ఇవియే ఇప్పుడు త్రికాల మని చెప్పఁబడుచున్నవి. రత్నాకరములో కల్లినాథుని వ్యాఖ్యానములో పైని

చెప్పిన మూఁడు మార్గములును, మార్గ మొకటికి భేదములు మూఁడు చొప్పున 9 విధము లగునని చెప్పఁబడియున్నది :—"ప్రతిమార్గం విశ్రాంతి కాలప్రమాణ భేదాల్లయత్రయే యోజితేసలి (1) ద్రుతేద్రుతః, (2) ద్రుతే మధ్యమః, (3) ద్రుతేవిళంబితః, యథా (4) మధ్యేద్రుతః, (5) మధ్యే మధ్యమః, (6) మధ్యేవిళంబితః, తథా (7) విళంబితే ద్రుతః, (8) విళం బితే మధ్యః. (9) విళంబితే విళంబిత ఇతి. విళంబ, మధ్య, ద్రుతకాలము లను చిత్రము, వార్తికము, దక్షిణము అని చెప్పియున్నారు. విళంబములో విళంబము, విళంబములో మధ్యము, విళంబములో ద్రుతము అని ఇట్లన్నిటిని చేర్చిన 9 భేదము లగుచున్నవి. కొన్ని గ్రంథములలో పైని చెప్పియున్న మూఁడు మార్గములతో మఱియొక మూఁడు మార్గములను చేర్చి చెప్పఁ బడియున్నవి. అంతు మొత్తము 6 మార్గములకును కాలప్రమాణముల నీ దిగువఁ జూడుఁడు :

(1) దక్షిణము : రెండు దీర్ఘాక్షర ప్రమాణములు గల కాలము దక్షిణ మనంబడును.
(2) వార్తికము : ఒక దీర్ఘాక్షర ప్రమాణము గలది.
(3) చిత్రము : ఒక హ్రస్వాక్షర ప్రమాణము గలది.
(4) చిత్రతరము : అర్ధ హ్రస్వాక్షర ప్రమాణము గలది.
(5) అర్ధచిత్రము : పాతిక హ్రస్వాక్షర ప్రమాణము గలది.
(6) అతిచిత్రము : పరక హ్రస్వాక్షర ప్రమాణము గలది.

పూర్వ గ్రంథములలో "మాత్ర" యనుటకు అనేక పరిమాణములను చెప్పి యున్నారు. ఒక నిమిషము, అనఁగా ఒక రెప్పపాటు ఒక మాత్రయని కొందఱు చెప్పి యున్నారు. రత్నాకరములో "శ్లో॥ పంచలఘ్వక్షరోచ్చార మితా మాత్రేతి కథ్యతే। అనయా మాత్రయా ఉత్రస్యాల్లఘుర్గుర్వాది కల్పనా॥" అను నీ శ్లోకపు మొదటి పాద ప్రకారముగ ఐదు లఘ్వక్షర కాలప్రమాణము గలది ఒక మాత్రయని చెప్పఁబడు చున్నది. రెండవ పాదమును జూడుఁడు, అందు లఘ్వక్షర గుర్వక్షర ప్రమాణము నను సరించియే మాత్రానిర్ణయము చేయఁబడియున్నదని తెలియుచున్నది. ఈ హ్రస్వదీర్ఘాక్షర ప్రమాణములు మాత్రమే ఇప్పుడు మాత్రాకాలమును నిర్ణయించుటకు సాధనములై యున్నవి. పంచలఘ్వక్షర ప్రమాణమునుండిన మాత్రాప్రమాణమునకు ద్రుత మధ్య విళంబకాలములో అర, పాతిక, లఘ్వక్షరములై వచ్చుచున్నవి. కనుక, కాలప్రమాణ మును శుద్ధముగఁ జేయుట కష్టసాధ్యము. అందుచేత లఘ్వక్షర గుర్వక్షర ప్రకారముగ మాత్రాకాలమును నిర్ణయించుకొన్నారని తెలియుచున్నది.

సంగీతసంప్రదాయ ప్రదర్శినిలో పైని చెప్పఁబడియున్న కాలమాన ములు రెండింతలుగఁ జెప్పఁబడియున్నవి. వాని నీ దిగువఁ జూడుఁడు :

"మార్గము : ఒకటి కొకటి ద్విగుణములైన కాలప్రమాణముల పాడుట మార్గము అని పేరు. అది దక్షిణ, వార్తికము, చిత్ర, చిత్రతర, అర్ధచిత్ర, అతిచిత్రము లని ఆఱు విధములగును. 1/4 (పాతిక) మాత్రను ఒక కళగా గొనినది అతిచిత్రము. 1/2 (అర్ధ) మాత్రను ఒక కళగా గొనినది అర్ధచిత్రము. 1 (ఒక) మాత్రను ఒక కళగా గొనినది చిత్రతరము. 2 (రెండు) మాత్రలను ఒక కళగా గొనినది చిత్రము. 4 (నాలుగు) మాత్రలను ఒక కళగా గొనినది వార్తికము. 8 (ఎనిమిది) మాత్రలను ఒక కళగా గొనినది దక్షిణము. శార్ఙ్గదేవులు సంగీతరత్నాకరములో మార్గములు ధ్రువ చిత్ర వార్తిక దక్షిణము లను నాలుగు విధము లగునని యును, అందు ఒక మాత్రను ఒక కళగా గొనినది ధ్రువమనియును; రెండు మాత్రలను ఒక కళగా గొనినది చిత్రమనియును, మూఁడు మాత్రలను ఒక కళగా గొనినది వార్తికమనియును; నాలుగు మాత్రలను ఒక కళగా గొనినది దక్షిణమనియును జెప్పియున్నారు."

పైని కనఁబఱచియున్న సంగీతసంప్రదాయ ప్రదర్శినిలోని మార్గ లక్షణమును జూడుఁడు. అందులో దీక్షితులుగారు రత్నాకరములోని 4 విధములైన మార్గములను తెలియఁజేసియున్నారు. రత్నాకరములోని మార్గ చతుష్టయములో మూఁడుకళలతో చేరిన మార్గము కనఁబడలేదు. రత్నాకరములో నిశ్శంకుఁడు మూఁడుకాలములను మాత్రము చెప్పి యున్నాఁడు. ఆ కాలములును ఒకటికొకటి ద్విగుణము లైనవని చెప్పి యున్నాఁడు. అందుచేత మూఁడు మాత్రలను ఒక కళగాఁ గలిగిన పద్ధతి రాకయున్నది. ఈ క్రింద నుదహరింపఁబడియుండు రత్నాకర శ్లోకములలో నీ వివరమును జూడుఁడు :

శ్లో॥ మార్గాఃస్యుస్తత్రచత్వారో ధ్రువశ్చిత్రశ్చవార్తికః ।
దక్షిణశ్చేతి తత్రస్యా ద్ధ్రువకే మాత్రికాకలా ।
శేషేషు ద్వే చతస్రోష్టౌ క్రమాన్మాత్రాః కలాభవేత్॥

ఈ శ్లోకములవలన, చిత్రము, ధ్రువము, వార్తికము, దక్షిణము అని నాలుగు మార్గపరిమాణములును, అవి క్రమముగ ఉత్తరోత్తరము ద్విగుణములగు ననియును తెలియుచున్నది. మఱియు లయమును చెప్పునపుడు :

శ్లో॥ క్రియానంతరవిశ్రాంతి ర్లయః సత్రివిధోమతః ।
ద్రుతో మధ్యో విళంబశ్చ ద్రుత శ్శీఘ్రతమో మతః ।
ద్విగుణ ద్వి గుణౌజ్ఞేయా తస్మాన్మధ్యవిళంబితౌ ॥

అని కాలక్రియములను చెప్పి అవి ఉత్తరోత్తరము ద్విగుణములని చెప్పఁబడియున్నది. ఈ కారణములచేత త్రైగుణ్యమైన కాల మేదియు నున్నటులు తెలియలేదు.

మఱియొక నూతన మార్గ పద్ధతియు నున్నటుల సంగీతస్వర ప్రస్తార సాగరములో చెప్పఁబడియున్నది. ఇది జయముని మతమని గ్రంథకర్త చెప్పి యున్నాఁడు. దాని నీ దిగువఁ జూడుఁడు :

“ శ్లో॥ క్రియాసమూహరూపాయాః కళాయాః స్థానమేవయత్ ।
తాళమార్గ ఇతిప్రోక్త స్సచాపిర్బహుధాస్స్మృతః ॥

తా. క్రియాసమూహరూపమైన కళలకు స్థానమేదియో అది తాళమార్గమని చెప్పబడును. ఆ మార్గము యనేక విధములగును.

శ్లో॥ దక్షిణోవార్తికశ్చైవ చిత్రచిత్రతర స్తథా ।
తథాచిత్రతమశ్చైవ అతిచిత్రతమ స్తథా ।
చతుర్భాగత్రుటిశ్చైవా నుత్రుటిర్ఘర్షణ స్తథా ।
అనుఘర్షణకశ్చైవ స్వరశ్చాపిప్రకీర్తితః ।
సర్వేషామతమాత్రిత్య మార్గాఃద్వాదశగాస్స్మృతః ॥

తా. దక్షిణ, వార్తిక, చిత్ర, చిత్రతర, చిత్రతమ, అతిచిత్రతమ, చతుర్భాగ, త్రుటి, అనుత్రుటి, ఘర్షణ, అనుఘర్షణ, స్వర మని తాళమునకు మార్గములు పండ్రెండు.

శ్లో॥ తత్రదక్షిణమార్గస్యా న్మాత్రాష్టకముదాహృతం ।
వార్తికేతుచతుర్మాత్ర చిత్రమార్గోద్విమాత్రకః ।
ఏకమాత్రో చిత్రతరో ద్రుతచిత్రతమేమతా ।
అతిచిత్రతమే మార్గా నుద్రుత పరికీర్తితః ।
చతుర్భాగేతదర్ధస్యా త్పలాశకళిగాకృతిః ।
త్రుటౌతదర్ధం భాణీను త్రుటౌ స్యాతుతదర్ధకం ।
ఏతదర్ధం ఘర్షణేతు తదర్ధంచాను ఘర్షణీ ।
ఏతదర్ధం స్వరంప్రోక్తం సూక్ష్మతత్వార్థవేదిభిః ॥

తా. దక్షిణమార్గమున యెనిమిది మాత్రలు, వార్తికమార్గమున నాలుగు మాత్రలు, చిత్రమార్గమున రెండు మాత్రలు, చిత్రతర మార్గమున నొక మాత్ర, చిత్రతమ మార్గమున అర్ధ మాత్ర, అతిచిత్రతమ మార్గమున [illegible] మాత్ర [illegible] ; చతుర్భాగ, త్రుటి, అనుత్రుటి, ఘర్షణ, అనుఘర్షణ, స్వరములకు క్రమముగా పై మార్గములకు చెప్పిన మాత్రలయొక్క అర్ధార్ధభాగములుగా నుండును. ఈ పండ్రెండు మార్గములును జైమిని భరతమునందు చెప్పఁబడియున్నవి.”

## మార్గక్రియా ప్రాణ లక్షణము.

శ్లో॥ మార్గదేశిగ తత్త్వేన తత్రాద్యస్య క్రియాద్విధా।
నిశ్శబ్దా శబ్దయుక్తాచ నిశ్శబ్దాతు కలోచ్యతే।
స్యాదావాపోథ నిష్క్రామో విక్షేపశ్చ ప్రవేశకః॥
నిశ్శబ్దేతి చతుర్ధోక్తా సశబ్దాపి చతుర్విధా।
ధ్రువ శ్శంపా తథా తాళః సన్నిపాత ఇతీరితా।
పాతఃకలాచ సాజ్ఞేయా తాసాం లక్ష్మాభి దధ్మహే॥
ఆవాపస్తత్ర హస్తస్యోత్తానస్యాంగుళి కుంచనం।
నిష్క్రామోథ స్తలస్యాస్యా దంగుళీనాం ప్రసారణం।
క్షేపో దక్షిణపార్శ్వ స్యోత్తానస్య ప్రసృతాంగుళేః॥
విక్షేపోథ స్తలస్యాస్యా ప్రవేశోంగుళి కుంచనం।
ధ్రువోహస్తస్య పాతస్యాచ్ఛోటికా శబ్దపూర్వకః॥
శమ్యాదక్షిణ హస్తస్య తాళో వామకరస్యతు।
ఉభయోః సన్నిపాతస్యాత్తాసాం మార్గవశాన్మితిః॥ (సం. ర.)

## ద్వివిధ క్రియలు.

శ్లో॥ మార్గదేశిగ తత్త్వేవ తత్రాద్యస్య క్రియా ద్విధా।
నిశ్శబ్దా శబ్దయుక్తాచ నిశ్శబ్దాతు కలోచ్యతే.॥

తా. క్రియలు మార్గక్రియ, దేశ్యక్రియ లని రెండువిధములగును. [illegible] నా క్రియలు నిశ్శబ్దక్రియలనియును, సశబ్దక్రియలనియును రెండువిధములు అగును. [illegible] నిశ్శబ్దక్రియలు కళ లనఁబడుచున్నవి. వాని లక్షణముల నీ దిగువఁ జూపుదుము:

## నిశ్శబ్దమార్గక్రియా లక్షణము.

శ్లో॥ తత్రావాపోథనిష్క్రామో విక్షేపశ్చ ప్రవేశనమ్
చతుర్విధాశ్చ విజ్ఞేయా నిశ్శబ్దాశ్చ క్రియాబుధైః॥

తా. ఆవాపము, నిష్క్రామము, విక్షేపము, ప్రవేశము అను నీ నాలుగును నిశ్శబ్ద క్రియలు.

శ్లో॥ ఆవాపస్తత్ర హస్తస్యోత్తానస్యాంగుళి కుంచనమ్।
నిష్క్రామోథ స్తలస్యాస్యా దంగుళీనాం ప్రసారణమ్॥
తస్య దక్షిణవిక్షేపో విక్షేపఇతి కథ్యతే।
వివర్తనంచ హస్తస్య ప్రవేశోధోముఖస్యచ॥

తా. "ఆవాపము" అనఁగా, ఊర్ధ్వముఖముగ నెత్తబడిన పతాకహస్తము యొక్క తర్జనీ మొదలుగ నాలుగువ్రేళ్లను ముడుచుట. "నిష్క్రామము" అనఁగా, అట్లు ముడిచిన వ్రేళ్లను క్రమముగ విప్పుట. "విక్షేపము" అనఁగా, ఆ హస్తమును వెలుపల కుడి పార్శ్వమునకు విదలించుట. "ప్రవేశకము" అనఁగా, ఆ హస్తమును అప్రదక్షిణముగా క్రిందుగా ముందటికి రానిచ్చుట. ఈ నాలుగును నిశ్శబ్దమార్గక్రియలు.

## సశబ్దమార్గక్రియా లక్షణము.

శ్లో॥ ధ్రువశ్శమ్యాశ్చ తాళశ్చ సన్నిపాత ఇతీరితా।
ఇతిశబ్దేన సంయుక్తో విజ్ఞేయశ్చ చతుర్విధమ్॥

తా. ధ్రువము, శమ్యము, తాళము, సన్నిపాతము అను నీ నాలుగును సశబ్దక్రియలు.

శ్లో॥ ధ్రువోహస్తస్య పాతస్యా చ్ఛోటికా శబ్దపూర్వకః।
శమ్యా వామనిపాతస్తు తాళో దక్షిణ ఘాతకః॥
ఉభయో ర్హస్తయో ర్ఘాత స్సన్నిపాత ఇతిస్మృతః।
ఏతా మార్గక్రియాశ్చైవ కథితా భరతజ్ఞకైః॥

తా. ధ్రువము అనునది శబ్దపూర్వకమైన చిటిక; శమ్యము అనఁగా, కుడిహస్తము నందు యెడమచేతితో ఘాతవేయుట. తాళము అనఁగా, ఎడమహస్తమునందు కుడిచేతితో ఘాతవేయుట. సన్నిపాతము అనఁగా, అభిముఖముగ నిలుపఁబడిన రెండు హస్తములచే సమముగా ఘాతవేయుట. ఈ నాలుగును సశబ్దమార్గక్రియలు.

## దేశ్యక్రియా లక్షణము.

శ్లో॥ ధ్రువకా సర్పిణీకృష్ణా పద్మినీచ విసర్జితా।
విక్షిప్తాఖ్యా పతాకాచ మాతాస్త్యాత్పతితాష్టమీ॥

తా. ధ్రువక, సర్పిణి, కృష్ణ, పద్మిని, విసర్జిత, విక్షిప్త, పతాక, పతిత అను నీ ఎనిమిదియు దేశ్యక్రియలు.

శ్లో॥ సశబ్దా ధ్రువకాజ్ఞేయా సర్పిణీ వామగామినీ।
కృష్ణాదక్షిణతోగన్త్రీ పద్మినీస్యా దధోగతాః॥
విసర్జితా బహిర్యాతా *విక్షిప్తాంగుళి కుంచనం।
పతాకాదూర్ధ్వగమనా పతితాకరపాతనాత్॥

---

* "విక్షిప్తాకుంచితాత్మికా" అని కొన్ని పుస్తకములలో వ్రాయఁబడియున్నది. చేయిని వక్రముగ బట్టి తన యంతకు దీయుట "విక్షిప్త" యని కొందఱు వ్యాఖ్యానము చేసియున్నారు. చేతిని వక్రముగ చేసి తన యంతకు తెచ్చు క్రియ మనకు వాడుకలో నున్న తాళక్రియలయందుఁ గనపడలేదు. వ్రేలిని వరుసగా చతురశ్రాది జాతులకు ముడుచు క్రియ వాడుకలో నున్నది. అంగుచేత "విక్షిప్తాంగుళి కుంచనం" అను పాఠమే సరియైన పాఠమని తెలియుచున్నది. విక్షిప్త, లేక, లఘువులను ధ్రువక క్రియచే మాత్రము వాడుట శాస్త్రియుక్తము కాదనియు తెలియుచున్నది.

తా. ధ్రువక : సశబ్దముతోఁ గూడిన కుడిహస్తముయొక్క ఘాత ధ్రువక యనఁబడును. సర్పిణి : కుడిచేతి పతాక హస్తమును ఎడమవంకకు చాచుట. కృష్ణ : అట్లు చాచిన హస్తమును కుడిపార్శ్వమునకు తెచ్చుట. పద్మిని : అరచేయి క్రిందుగఁ జేసి అధోముఖముగ చేయి చాచుట. విసర్జిత : పైని చెప్పిన అధోముఖహస్తమును వెలుపల విసరుట. విక్షిప్త : హస్తముయొక్క వ్రేళ్ళను ముడుచుట. పతాకము : పతాక హస్తముగఁ బట్టిన చేతిని మీఁదికి ఎత్తుట. పతిత : అట్లు మీఁదికి యెత్తిన హస్తమును క్రిందికి దించుట. ఈ ఎనిమిది దేశ్యక్రియలలో ధ్రువక యనునది మాత్రము సశబ్దక్రియ. సర్పిణి మొదలైన తక్కిన ఏడును నిశ్శబ్దక్రియలని యెఱుంగునది.

### 4. అంగప్రాణ లక్షణము.

శ్లో॥ అనుద్రుతో ద్రుతశ్చైవ లఘుర్గురు ప్లుతస్తథా ।
కాకపాదం తథాప్రోక్తం తాళాంగాని చ షడ్విధమ ॥

తా. తాళసంఖ్యను దెలియుటకు సాధనంబగు సంజ్ఞావిశేషము అంగ మనఁబడును. అది అనుద్రుతము, ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము అని ఆఱువిధము లగును.

### అంగ స్వరూప లక్షణము.

శ్లో॥ అనుద్రుతస్య రూపంచ అర్ధచంద్ర కళాత్మకం ।
ద్రుతస్తు వలయాకారో లఘు రర్ధశరాకృతిః ॥
గురుర్వక్ర ధనుర్జ్ఞేయం ప్లుతస్తు శిఖరోగురుః ।
ఊర్ధ్వరేఖాచ తిర్యంజో్చ కాకపాదః ప్రకీర్తితః ॥

తా. అనుద్రుతము : అర్ధచంద్రునివలె స్వరూపము గలది ...
ద్రుతము : వలయాకారమయినది ...
లఘువు : అర్ధబాణమువంటిది ...
గురువు : ఎక్కుపెట్టిన ధనుస్సును బోలినది ...
ప్లుతము : శిఖర రేఖతోఁగూడిన గురువువలె నుండునది ...
కాకపాదము : హంసపాదమువలె నుండునది ...

### షడంగ నిఘంటు.

శ్లో॥ అనుద్రుతోర్ధచంద్రస్స్యా ద్వ్యంజనం చానునాసికః ।
అవ్యక్తంచ విరామంచ వక్తవ్యం భరతజ్ఞకైః ॥

తా. అనుద్రుతము, అర్ధచంద్రము, వ్యంజనము, అనునాసికము, అవ్యక్తము, విరామము అను నీ ఆఱును అనుద్రుతమునకు పేళ్లు.

శ్లో॥ అర్ధమాత్రా ద్రుతం వ్యోమం బిందుకం వలయాకృతమ్ ॥

తా. అర్ధమాత్ర, ద్రుతము, వ్యోమము, బిందుకము, వలయము అను నీ యైదును ద్రుతమునకు పేళ్లు.

శ్లో॥ మాత్రస్య సరళం హ్రాస్వం కళాయాంచ లఘుర్భవేత్ ॥

తా. మాత్ర, సరళము, హ్రాస్వము, కళ అను నీ నాలుగును లఘువునకు పేళ్లు.

శ్లో॥ ద్విమాత్రకం గురుర్వక్రం కాణోయమళదీర్ఘకమ్ ॥

తా. ద్విమాత్రకము, గురువు, వక్రము, కాణము, యమళము, దీర్ఘకము అను నీ ఆఱును గురువునకు పేళ్లు.

శ్లో॥ సమోద్భవం ప్లుతందీప్తం తథాత్ర్యఙ్గమ్ త్రిమాత్రకమ్ ॥

తా. సమోద్భవము, ప్లుతము, దీప్తము, త్రియంగము, త్రిమాత్రకము అను నీ యైదును ప్లుతమునకు పేళ్లు.

శ్లో॥ కాకస్తు హంసపాదాఖ్యో నిశ్శబ్దశ్చ చతుర్లఘుః ॥

తా. కాకపాదము, హంసపాదము, నిశ్శబ్దము, చతుర్లఘువు అను నీ నాలుగును కాకపాదమునకు పేళ్లు.

**షోడశాంగములను జూపెడి పట్టికము.**

| షోడశాంగముల పేళ్లు. | అంగసంజ్ఞలు. | అక్షరకాలము. |
|---|---|---|
| అనుద్రుతము ... ... ... | ◡ | 1 |
| ద్రుతము ... ... ... | O | 2 |
| ద్రుతవిరామము ... ... ... | ◡ O | 3 |
| లఘువు ... ... ... ... | \| | 4 |
| లఘువిరామము ... .. ... | ◡ \| | 5 |
| లఘుద్రుతము ... ... ... | O \| | 6 |
| లఘుద్రుతవిరామము ... ... ... | ◡ O \| | 7 |
| గురువు ... ... ... ... | 8 | 8 |
| గురువిరామము ... ... ... | ◡ 8 | 9 |
| గురుద్రుతము ... ... ... | O 8 | 10 |
| గురుద్రుతవిరామము ... ... ... | ◡ O 8 | 11 |
| ప్లుతము ... ... ... ... | § | 12 |
| ప్లుతవిరామము ... ... ... | ◡ § | 13 |
| ప్లుతద్రుతము ... ... ... | ◡ § | 14 |
| ప్లుతద్రుతవిరామము ... .. .. | ○ ◡ § | 15 |
| కాకపాదము ... ... .. | + | 16 |

**అంగాంగుళ ప్రమాణ లక్షణము.**

శ్లో॥ ద్వయతాంగుళో బాలచంద్రా ద్రుతస్తు చతురంగుళః ।
లఘురష్టాంగుళః ప్రోక్తో గురుస్యాత్షోడశాంగుళః ॥

ప్లుతప్రమాణం కథితం చతుర్వింశతి రంగుళాః ।
ద్వాత్రింశ త్కాకపాదస్య త్వానస్యాంగుళ నిర్ణయః ॥

తా. అనుద్రుతము రెండంగుళముల ప్రమాణముననుᵡ ద్రుతము నాలుగంగుళముల ప్రమాణముననుᵡ లఘువు ఎనిమిది అంగుళముల ప్రమాణముననుᵡ గురువు 16 అంగుళముల ప్రమాణముననుᵡ ప్లుతము 24 అంగుళముల ప్రమాణముననుᵡ కాకపాదము 32 అంగుళముల ప్రమాణముననుᵡ వాడఁదగినయవి.

## తాళషడంగములను వాడుటకైన క్రియలు.

1. అనుద్రుతము : ఇది ధ్రువక అను సశబ్దక్రియచే వాడఁదగినది.

2. ద్రుతము : ఇది ధ్రువక అను సశబ్దక్రియచేతనుᵡ విసర్జిత అను నిశ్శబ్దక్రియచేతను వాడఁదగినది.

3. లఘువు : ఇది ధ్రువక, విక్షిప్త అను సశబ్ద నిశ్శబ్దక్రియలచే వాడఁదగినది. ఇందు విక్షిప్త అను క్రియను ఉపయోగించునపుడు వ్రేళ్లను చతురశ్రాది జాత్యానుసారముగ ఘాతకువెనుక 3, 2, 6, 4, 8 ఇట్లు ముడుచుటయే సంప్రదాయముగ నున్నది.

4. గురువు : ఇది ధ్రువక, విక్షిప్త, పతిత అను క్రియలచే వాడఁదగినది. ఎట్లనిన, మొదటి నాలుగక్షరములకు ఒక లఘువును వాడి, తరువాత నాలుగు అక్షరములకు కుడిచేతిని ఎడమచేతికి క్రిందుగా విడుచుట.

5. ప్లుతము : ఇది ధ్రువక, విక్షిప్త, సర్పిణి, కృష్ణ అను నాలుగు క్రియలచే వాడఁదగినది. ఎట్లనిన, ఎడమచేతిమీఁద కుడిచేతిఘాతను వేసి మూఁడు వ్రేళ్లను ముడిచి, తరువాత నాలుగు అక్షరములకాలము కుడిచేతిచే ఎడమచేతినిచుట్టి, అటువెనుక నాలుగు అక్షరములకాలము కుడిచేతిని ఎడమచేతికి దిగువ విడుచుట.

6. కాకపాదము : ఇది సర్పిణి, కృష్ణ, పతాక, పతిత అను నాలుగు నిశ్శబ్దక్రియలచే వాడఁదగినది. ఎట్లనిన, (సర్పిణి) కుడిచేతి పతాక హస్తమును నాలుగు అక్షరములకాలము ఎడమవంకకు తెచ్చి, (కృష్ణ) అట్లు ఎడమవంకకు తెచ్చిన చేతిని నాలుగు అక్షరములకాలము కుడివంకకు తెచ్చి, తరువాత (పతాక) కుడిచేతి పతాక హస్తమును నాలుగు అక్షరముల కాలము మీఁది కెత్తి, (పతిత) అట్లు ఎత్తఁబడిన పతాక హస్తమును నాలుగు అక్షరములకాలము అధోముఖముగా తెచ్చుట. ఈ కాకపాద మను అంగము రత్నాకరములో నిశ్శబ్ద చతుర్లఘువని చెప్పఁబడియున్నది. నిశ్శబ్ద

ద్వార్లఘువని 8 అక్షరముల కాకపాదమును రత్నాకరములో కనఁబడుచున్నది. మఱియు నీ యంగము నిశ్శబ్దక్రియలచేతనే వాడఁబడుచున్నదనియును, అందుచేత అమంగళమైనదనియును పూర్వాచార్యులు వీనిని వాఁడుకలోనుండి తొలఁగించియున్నారనియును తెలియుచున్నది.

ద్రుతము "ధ్రువక" అను క్రియచే మాత్రము వాడఁదగినదనియును, గురువు "ధ్రువక, పతిత" అను రెండు క్రియలచేత వాడఁదగిన దనియును, ప్లుతము "ధ్రువక, సర్పిణి, కృష్ణ" అను మూఁడు క్రియలచే వాడఁదగినదనియును కొందఱిమతము. అయినను, విసర్జితక్రియ లేక ద్రుతమును, విక్షిప్తక్రియ లేక లఘువు, గురువు, ప్లుతము అను నీ మూఁడు అంగములను వాడుట శాస్త్ర సమ్మతము కాదని తెలియుచున్నది. ఎట్లనిన, ఒకటి, రెండు, మూఁడు అని ఎంచుటకు "విక్షిప్త" అను క్రియయును, చేతిని విసరుటకు "విసర్జిత" అను క్రియయును అత్యావశ్యకమని యెఱుంగవలయును.

## గ్రహ ప్రాణ లక్షణము.

గ్రహము అను శబ్దమునకు గ్రహించుట, ఎత్తుట అని యర్థము. తాళములో గీతమును గ్రహించుతావు గ్రహ మనఁబడును. ఆ గ్రహము అతీతము, అనాగతము, సమము అని మూఁడు విధము లగునని రత్నాకరములో చెప్పఁబడియున్నది.

శ్లో॥ సమోఽతీతో నాగతశ్చ గ్రహస్తాలేత్రిధామతః ।
గీతాదిసమకాలస్తు సమపాణిస్సమగ్రహః ॥
సోఽవపాణిరతీతః స్యాద్యోగీతాదౌ ప్రవర్తతే ।
అనాగతః ప్రాక్ప్రవృత్తిః సఏవోపరిమాణికః ॥ (సంగీత రత్నాకరము)

తాళమును గీతమును సమముగ గ్రహించుట సమమనియును, తాళమునకు ముందు గీతమును గ్రహించుట అతీతమనియును, తాళమునకు వెనుక గీతమును గ్రహించుట అనాగతమనియును చెప్పఁబడియున్నది.

అతీత, అనాగత, సమ, విషమము అని నాలుగు గ్రహము లున్నవని కొన్ని నవీన గ్రంథములలో చెప్పఁబడియున్నవి. సంగీత విద్యాదర్పణము లోని ఈ నాలుగు గ్రహములను నీ దిగువఁ జూడుఁడు :

శ్లో॥ అతీతానాగతశ్చైవ సమశ్చ విషమోఽపిచ ।
గ్రహాశ్చతుర్విధా ప్రోక్తా తత్స్వరూపం నిరూప్యతే ॥

తా. అతీతము, అనాగతము, సమము, విషమము అని గ్రహములు నాలుగు విధములు.

### గ్రహముల వివరము.

శ్లో॥ గీతాతీతేత్వతీతస్యా త్తాళాతీతేత్వనాగతః ।
గీతాయా తాళసంయుక్తో సమగ్రహ మితీరితమ్ ॥
ఆద్యంతయోరనియమో విషమశ్చ ప్రకీర్తితః ।
మాత్రాధిక్యంచ తస్యైవ క్వచిత్కేచిత్ప్రచక్షతే ॥

తా. గీతము నడచినపిమ్మట తాళము నడచుట అతీత మనఁబడును. తాళము నడిచినపిదప గీతము నడచుట అనాగత మనఁబడును. తాళ గీతములు సమముగా నడచుట సమ మనఁబడును. ఈ మూఁడు విధములుగాక నడచునది విషమగ్రహ మనఁబడును. మఱియు, గీతాదులకన్నను తాళమాత్రలు రెండుగాని, మూఁడుగాని, నాలుగుగాని అతీతమైనచో అది అతీతగ్రహ మనియు, ఇన్నిమాత్రలే అనాగతమైనచో అది అనాగతగ్రహమనియు, పై ప్రకారము గీతారంభ స్థానమునకు 5, 6, 7, 8 మాత్రలు అతీతమైనను, అనాగతమైనను అది విషమగ్రహ మనియును చెప్పఁబడుచున్నది. ఇటుల రంగరాజ లోల్లభట్టులు మొదలైన భరత భాష్యకారులు నిర్ణయించినారు.

పైని కనఁబఱచియుండు పద్ధతిలో అతీత అనాగత సమగ్రహము కాక యుండునది విషమమని చెప్పఁబడియున్నది. తాళమునకు ముందున నున్న స్థాన మెదియైనను అతీతస్థానములో చేరినవియే. అట్లే వెనుకనుండు స్థానములు అనాగతస్థానములో చేరినవియే. తాళముతో సమముగ గీతమును గ్రహించుట సమకాలమాయెను. ఇవి తప్ప విషమమని యొక స్థాన ముండుటకు హేతువులేదు. కనుక, ఇది అసంభావితము.

విషమము అను పదమునకు సమముకానిది అని అర్థము. అతీత అనాగతములు విషమములే యగును. ఇటులనే సుబ్బరామ దీక్షితులును చెప్పియున్నారు. దాని నీ దిగువఁ జూడుఁడు :

### సంగీత సంప్రదాయ ప్రదర్శిని.

గ్రహము : ఒక పాటలో తాళంబు నుపయోగించి ఆ పాటను యెత్తుతావు గ్రహ మనఁబడును. (గ్రహం=గ్రహణం, ఎత్తుట.) గ్రహము, సమము విషమ మని రెండు విధంబు లగును. (I) సమము : పాటయును తాళంబును ఒక్కటిగా నెత్తుటకు సమము అని పేరు. (2) విషమము : పాటయును తాళమును సమముగా నెత్తక ముందు వెనుకగా నెత్తుట. ఇది అతీతము, అనాగత మని రెండు విధంబులగును. (i) అతీతము . పాట మునుపును, తాళము వెనుకను ప్రారంభించుట. (ii) అనాగతము ; తాళమును ముందుగను, పాటను వెనుకను ప్రారంభించుట,

ఈ విషమ గ్రహమునుగుఱించిన మఱియొక నూతన కల్పనము పూర్వా చార్యుల పద్ధతియని చెప్పఁబడి యున్నది. దాని నీదిగువఁ జూడుఁడు. ఈ విషమ విన్యాసము ఎంత అసంభావితముగ నున్నదో దానిని చదువరులు గమనించుట మాత్రమే గాక పూర్వాచార్యులు ఇట్టి పదార్థ సంబంధము లేని యసంభా వితమును రచియించి యుందురా అనియును గమనింతురు గాక.

"శ్లో॥ గీతస్యాద్యంతయోస్తాళో, న్యూనోన్యూనోభవేద్వయం।
సమాదిరధికాంతస్య అంతేన్యూనసమాధికః॥
అధికాదిర్న్యూనమితి న్యూనాదిశ్చసమాధికః।
ఇత్యాదిబహుభేదాస్తు కథితావిషమగ్రహే॥

తా. నృత్త గీత వాద్యములకు తాళము ఆదియందు తక్కువయై అంతమునందు సమ మైన అది యొక విషమము; అంతమునందు తక్కువయై ఆదియందు సమమైన అది యొక విషమము; ఆదియందు సమమై అంతమునం దధికమైన అది యొక విషమము; అంతము నందు అధికమై ఆదియందు తక్కువయైన అది యొక విషమము; అంతమునందు తక్కువ యై ఆదియందు తక్కువ - అధికమైతే అది యొక విషమము; అంతమునందు సమమై ఆదియందు తక్కువయు నధికముసైన అది యొక విషమము; అంతమునం దధికమై ఆదియందు తక్కువయు సమముసైన యది యొక విషమము; ఆదియం దధికమై అంతము నందు సమమైన యది యొక విషమము; ఆదియందు తక్కువయై అంతమునందు సమమును అధికముసైన అది యొక విషమము; ఆదియందు తక్కువయై అంతమునం దధికమును సమముసైన యది యొక విషమము; ఆదియందు సమమై అంతమునందు తక్కువయు నధికముసైన యది యొక విషమము; ఆదియం దధికమై అంతమునందు తక్కువయైన యది యొక విషమము; ఆదియం దధికమై అంతమునందు తక్కువయు సమముసైన యది యొక విషమము; ఆదియందు సమమై అంతమునందు మిక్కిలి యధికమును మిక్కిలి తక్కువయుసైన యది యొక విషమము అగును. ఇదిగాక సనేకభేదంబులు భావసాధన పక్షమందు పుట్టును. కావున, మార్గదేశితాళములకు యుక్తముగా గ్రహభేదములను నడపించుకొనవలయును. కర్మసాధనపక్షమందు పైని చెప్పిన రీతిగానే తాళమునకు నృత్త గీత వాద్యములను నడపించుకొనునది."

### జాతిప్రాణ లక్షణము.

చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణ'ములని జాతులు అయిదు విధ ముల నొప్పును వానికి వరుసగా "4, 3, 7, 5, 9" అను అక్షరకాల సంఖ్యలు గలవు. నాలుగు కళలు గల చతురశ్రజాతి కామధేనువుయొక్క స్వరూప మనియును, అందుచేత ఈ చతురశ్రజాతి చాల శ్రేష్ఠమైన దని యును తెలియుచున్నది. పంచజాతులలోను చతురశ్రజాతి మాత్రమే ప్రధా నముగఁ జెప్పఁబడియున్నది. పూర్వాచార్యుల గీత, కీర్తనాదులు విశేషముగ

నీ చతురశ్రజాతిలోనే కనఁబడుచున్నవి. త్రిశ్రము మూఁడక్షర కాలములఁ గలది. చతురశ్రమును త్రిశ్రమును జేరి (సంకీర్ణమై) సంకీర్ణజాతి (4+3=7) అయినది. త్రిశ్రమును మిశ్రమును ఖండింపఁబడి ఖండమయినది :- "3+7=10, 10÷2=5, ఈ ఖండముతో చతురశ్రము చేరి సంకీర్ణజాతి పుట్టెను :—"5+4=9".

మఱియొక నవీన పద్ధతిలో పదిజాతులు చెప్పఁబడియున్నవి. వానినీ దిగువఁ జూపుదుఁ:

శ్లో॥ అనుగాయా మతేర్ధర్మం కారణాం జాతిరుచ్యతే॥

తా. అనుగత బుద్ధికి కారణమైన ధర్మము జాతి యనంబడును. అనఁగా లోకమందు అనేక మనుష్యులయందు వీఁడు మనుష్యుఁడు అనెడి అనుగత బుద్ధిచేత మనుష్యత్వమనెడి జాతి సిద్ధించెను. ఆ తీరుననే అనేక తాళములయందు ఇది తాళము అనెడి అనుగత బుద్ధిచేత తాళత్వమనెడి జాతి కద్దని దెలిసికొనునది. ఇప్పుడు సకల మనుష్యులయందును, మనుష్యత్వమనెడి ఒక జాతి యున్నను, ఆ మనుష్యులయందు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రత్వము మొదలైన అవాంతర జాతులు గలిగినట్లు సకల తాళములయందును, తాళత్వమనెడి వ్యాపకజాతి యుండియున్నను, చతురశ్రజాతి మొదలైన అవాంతర జాతులు మతభేదములచేత కలవని చెప్పఁబడెను.

## జాతుల వివరణము.

పైన జెప్పఁబడిన బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర సంకీర్ణములనెడి అవాంతర జాతులప్రకారము చతురశ్రజాతి బ్రహ్మజాతిగా నెంచఁబడెను గాన, బ్రహ్మకు చతుర్ముఖము లగుటచే చతురశ్రమనెడి జాతి ఏర్పడెను. గాన, ఆ చతురశ్రజాతికి 4 అక్షరములు లఘుకాల మాయెను. ఈ చతురశ్రజాతియొక్క 4 అక్షరములను మూటిచే పెంచునపుడు 12 వచ్చును. ఆ 12 ను 4 చే భాగించునపుడు భాగ మొక్కటికి 3 అక్షరములు ఏర్పడును. గాన, త్రిశ్రజాతికి 3 అక్షరములు లఘుకాల మాయెను. చతురశ్రజాతియొక్క 4 అక్షరములను త్రిశ్రజాతియొక్క 3 అక్షరములతో మిశ్రముచేయగా మిశ్రజాతికి 7 అక్షరములు లఘుకాల మాయెను. ఈ మిశ్రజాతియొక్క 7 అక్షరములను త్రిశ్రముయొక్క 3 అక్షరములతో కలుపగా 10 అక్షరము లగును. ఆ పది అక్షరములను సగముగా భాగించునపుడు ఏర్పడిన 5 అక్షరములు ఖండజాతికి లఘుకాల మాయెను. చతురశ్రజాతియొక్క 4 అక్షరములును, త్రిశ్ర మిశ్రములు కలిపి ఖండించిన ఖండజాతియొక్క 5 అక్షరములును కలుపగా 9 అక్షరములు సంకీర్ణజాతికి లఘుకాల మాయెను. ఇవిగాక మఱికొన్ని లఘువులు చెప్పఁబడియున్నవి. అవి యెవ్వియనిన, మనుష్యలఘువు, స్వర్గలఘువు, హంసలఘువు, దేశ్యలఘువు, చిత్రలఘువు, దివ్యలఘువు, సింహలఘువు, వర్ణలఘువు, వాద్యలఘువు, కర్ణాటలఘువు అని లఘువులు పది విధములు. అవి క్రమముగా 4, 3, 7, 5, 9, 6, 8, 10, 12, 16 అక్షరకాలములు గలవై యుండును. ఈ లఘువులలో పై జెప్పఁబడిన 5 జాతుల లఘువులుగూడ యున్నవి.

జాతుల ననుసరించిన కొన్ని నవీనవిషయములు, లక్షణకౌస్తుభము మొదలైన కొన్ని గ్రంథములలో నున్నవని తెలిపి, సంగీత స్వరప్రస్తార సాగరములో వ్రాయఁబడియున్నది. వాని నీ దిగువఁ జూడుఁడు :

శ్లో॥ గ్రహేచనవమేజాతం సంకీర్ణ లఘు ఇత్యపి ।
యద్బ్రువంతి త్రిశ్రప్లుత రౌరవం నరకంభవేత్ ॥

తా. తొమ్మిదక్షరములందు పుట్టిన సంకీర్ణలఘువును త్రిశ్రజాతి ప్లుతమని జెప్పెడు వానికి రౌరవ మనెడి నరకము లభించునని తౌర్యత్రికగజాంకుశమునఁ జెప్పఁబడియున్నది.

సర్వమతరాజీయము.

శ్లో॥ ధ్రువాదిసప్తతాళానాం లఘుతో జాతినిర్ణయః ।
చచ్చత్పుటాదితాళానాం కలతో జాతిరీరితః ॥

భరతార్ణవము.

శ్లో॥ చచ్చత్పుటాదితాళానాం సంఖ్యాతో జాతిరీరితః ॥

తా. ధ్రువాదిసప్తతాళములను లఘువుచేతను, చచ్చత్పుటాది తాళములను కళలతోను లెక్కచేసి జాతులు నిర్ణయింపవలయును.

శ్లో॥ అన్యేషాంవాద్యతాలేషు అంగన్యాకృత్యసర్వకః ।
చతురశ్రలఘుకృత్వా జ్ఞేయా జాతేశ్చపంచకం ॥

తా. చచ్చత్పుటాది తాళాంగములను ప్రత్యేకముగాఁ గాక చతురశ్రలఘువులుగ చేసి వచ్చిన లఘువులను చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణజాతులలో 4, 8, 16, 42, 64, 128 ఇట్లు ద్విగుణక్రమముగు సంఖ్యలకు సమమైనచో యా తాళము యాజాతి యగును. మఱియు పైని చెప్పిన నియమప్రకారముగా అక్షరకాలములవలన జాతుల నెఱుంగనగును.

శ్లో॥ అన్యతాళాంచగృహ్ణీయా త్యేకాన్యేకానుజాతిషు ।
ధ్రువాదీనాంతుతాళానాం ప్రత్యేకంజాతిపంచకం ॥

తా. ధ్రువాది సప్తతాళములు నొక్కొక్కటి చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణజాతులుగాను; చచ్చత్పుటాది తాళములు మాత్ర మొక్కొక్కటి కేజాతు లేర్పడినదో ఆ జాతులుగానే వాడవలయును. అటుగాక యొక్కొక్కటి పంచజాతులతో వాడిన రౌరవాది నరకములు ప్రాప్తించునని (అజ్ఞాత, భరత, హనుమద్గుప్త, భరతార్ణవ, భరత మంజరి, తాళమంజరి, తౌర్యత్రిక గజాంకుశ ము) మొదలైన గ్రంథములందుఁ జెప్పఁబడి యున్నవి. ఇట్టి జాతులను ధర్మజాతులని వక్కాణించుదురు. మఱియు మతాంతర జాతులు చెప్పఁబడుచున్నవి.

శ్లో॥ షడాక్షరయుతైఃకాలైః దివ్యసంకీర్ణజాతయః ॥

తా. ఆఱక్షరకాలములతో కూడినగి దివ్యసంకీర్ణజాతి యని తెలియునది. ఇది త్రిశ్రములు రెండు కూడినది.

శ్లో॥ అష్టాక్షరసమః కాలః మిశ్రసంకీర్ణ ఉచ్యతే ॥

తా. ఎనిమిదక్షర కాలములైనచో మిశ్రసంకీర్ణజాతియని చెప్పఁబడును. ఇది చతురశ్రములు రెండు కూడినది.

శ్లో॥ దశాక్షర సమాయుక్త దేశ్యసంకీర్ణసంజ్ఞకః ॥

తా. పదియక్షర కాలములతో కూడినది దేశ్యసంకీర్ణజాతి యని తెలియునది. ఇది ఖండములు రెండు కూడినది.

పండ్రెండక్షర కాలములతో కూడినది మిశ్రదేశ్య సంకీర్ణజాతి యని పలుకఁబడును, ఇది చతురశ్రములు మూఁడు కూడినది.

పదునాఱక్షర కాలములతోఁ గూడినది దేశ్యశుద్ధ సంకీర్ణజాతి యని వక్కాణింపఁబడును. ఇది చతురశ్రములు నాలుగు కూడినది. కావున ఒక్కొక్కజాతులే 2, 3, 4 కూడిన సంకీర్ణమనియును; వేర్వేఱుజాతులు రెండు కూడిన మిశ్రమమనియును; మూఁడు కూడిన సంకీర్ణమని తాత్పర్యముచే నీ జాతు లేర్పడెనని గ్రహించునది. ఇట్టి జాతులలో లఘువం దేజాతి ఆరంభమగుచున్నదో ఆ లఘు, గురు, ప్లుత, కాకపాదము లాయా సంఖ్యల భేదములుగానే యుండును. ఈ జాతుల లఘువులకే వరుసగా దివ్య, సింహ, వర్ణ, వాద్య, కర్ణాటక మని పేరులు శుక్రాచార్యులచే నియమింపఁబడియె. ఇఁక నధర్మజాతులు చెప్పఁబడుచున్నవి.

శ్లో॥ అవ్యక్తసహితాపంచ జాతయః పూర్వచోదితః ।
ఏకాదశాదిభేదేన మాలాతాళః ప్రకీర్తితః ॥

తా. మొదట చెప్పఁబడిన చతురశ్రాది పంచజాతులు అనుద్రుతములతో కూడుకొని 11, 13, 15, 17, 19 సంఖ్యలుగా నేర్పడి తాళములతో సంబంధించిన, అది మాలాజాతి తాళ మనఁబడును. ఈ జాతులకె వరుసగా హీన, చండాల, అయుక్త, అగమ్య, నిషిద్ధమని పేళ్లు ధ్యానకౌస్తుభమునందు చెప్పఁబడియున్నవి.

శ్లో॥ తాళానాం నృత్తగీతానాం పరస్పరవిభేదకా ।
తాళాదిరంజకత్వాతు జాతిప్రాణ ఇతీరితః ॥

తా. తాళ సంబంధిరైన నృత్తగీత వాద్యములకును, తాళమునకును అన్యోన్య భేదములచే ప్రకాశింపఁ జేయుటవలన జాతియును తాళాంగులకు ప్రాణమని యెఱుంగునది.

శ్లో॥ దివ్యలఘుంచ మూఢాత్మ త్రిశ్రజాతి గురుంయథా ।
యోబ్రూయాతి మహాపాపీ తస్యపాకం మహద్భవేత్ ॥

తా. దివ్యయను లఘువును త్రిశ్రజాతి గురువుగా చెప్పునట్టి మూఢుఁడు మహాపాపి; వాని పాపమునకు మితిలేదు. ఇట్లు సర్వమతదీపికయందుఁ జెప్పఁబడియున్నది.

పైని కనఁబఱచియున్న విషయములను గమనించునపుడు అవి గొప్ప గ్రంథకారుల యభిప్రాయములు కావని తెలియుచున్నది. ప్రస్తారాంగములైన జాతులకు నామముల నేర్పఱచుట గ్రంథకారుల అభిప్రాయభేదమే కాని నరక గతమునకైన దోషము కానేరదు. కనుక, ఇది ప్రాచీనపద్ధతి కానేరదు.

ఎవఁడో ఆధునికుఁడు ఇట్టి శ్లోకములను కల్పించి వానిని ప్రసిద్ధ వాగ్గేయ కారకుల మతమని చెప్పి శాస్త్రానర్థము చేసియున్నాడనియే తెలియుచున్నది.

## కళాప్రాణ లక్షణము.

అక్షరకాలములోని సమాన్తర్భాగములు కళలనఁబడును.

ఉదాహరణము : చతురశ్రజాతి లఘువులో 4 అక్షరకాలము లున్నవి. ఆ నాలుగు అక్షరములకాలములో అక్షరకాలమొకటికి కళలు 4 చొప్పున నడచి 16 కళలగుచున్నవి. ఇవియే కళలనఁబడును. ఈ కళలు హ్రస్వాక్షరప్రమాణము ననుసరించియే లెక్కచేయఁదగినవి. ఇట్టి కళలు 1, 2, 3, 4 రీతిని ఒక అక్షరకాలమునం దుండును. ఒక అక్షరము ఇన్నికళల చొప్పున నడుచుచున్న దను విషయము గీతమునుబట్టి లెక్క చేయవచ్చును. అక్షరకాలమునకు కళల సంఖ్యను మొట్టమొదట నిర్ణయముచేసికొని వెనుక గీతాక్షరములను అందు ఇమిడించుట వాడుకగా నున్నది.

జాతులకు నుండునటులనే, గతులకును చతురశ్రాదిగ గల భేదము లున్నవి.

అక్షరకాలములో కళలు 3, 4, 5, 9 వంతున నడుచుటచేత గతి భేదము కలుగుచున్నది.

శ్లో॥ వర్తమానాచనష్టాచ తత్కళాద్వివిధా పునః ।
యఃకళాకాలమారభ్య గురుపర్యంతవృద్ధిక ।
ఆద్యాతద్విపరీతేతు బుద్ధైర్నష్టకళోచ్యతే ॥

పై నుండు నవీన శ్లోకములో కళ వర్తమానకళ, నష్టకళ అని రెండువిధములగు ననియును, అందు తాళములో 1, 2, 3, 4 ఇట్లు పెరుఁగునది వర్తమాన కళలనియును, అట్లే తగ్గునది నష్టకళలనియును చెప్పఁబడియున్నది.

సంగీతరత్నాకరములో మార్గతాళ లక్షణములో "యథాక్షరశ్చ ద్వికళ శ్చతుష్కళ ఇతి త్రిధా" అని మూఁడు విధములైన కళలు చెప్పఁబడియున్నవి. వానికి వరుసగ యథాక్షరకళ, ద్వికళ, చతుష్కళ అని నామములు గలవు. ఈ కళలు అనేక భేదములను బడసియున్నవి. వానిని రత్నాకరములో జూడుఁడు. ఈ కళలు చచ్చత్పుటాది కళాతాళములలో నుపయోగింపఁబడినవని తెలియుచున్నది.

## లయప్రాణ లక్షణము.

శ్లో॥ క్రియానన్తర విశ్రాన్తి ర్లయః స త్రివిధోమతః ।

తా. క్రియానంతర విశ్రాంతి "లయ" అని చెప్పఁబడుచున్నది. అది మూఁడు విధము లగును.

తాళములో లయలు మూఁడు విధములుగ నున్నవనియును, అవి ఉత్త రోత్తరము ద్విగుణము లనియును, వానికి క్రమముగ ద్రుత, మధ్య, విళంబము లని నామము లున్నవనియును తెలియుచున్నది. ఇవి వరుసగ దీర్ఘాక్షర, హ్రస్వాక్షర, అర్ధాక్షర ప్రమాణములను గలిగి పదవాక్యాంగ లయందును గీత కీర్తనాదులయందును నెలకొనియుండును

యతిప్రాణ లక్షణము.

శ్లో॥ లయప్రవృత్తి నియమో యతిరిత్యభిధీయతే ।
సమాస్రోతోగతాచాన్యా గోపుచ్ఛాత్రివిధేతిసా ॥ (సం. రత్న.)

తా. లయము ప్రవర్తించుటకైన నియమము యతి యనఁబడును. అవి మూఁడు విధములగును. వానికి సమము, స్రోతోగతము, గోపుచ్ఛము అని నామములు. "స్రోతోగతము" అను నామము "స్రోతోవహము" అని వాడుకలో చెప్పఁబడుచున్నగి.

ఇప్పుడు గల పుస్తకములలో యతులు 6 విధములుగ చెప్పఁబడి యున్నవి. వాని నామములను, క్రమములను నీ దిగువఁ జూడుఁడు :

1. సమయతి :—దీర్ఘ హ్రస్వాక్షరములు సమముగ (ఒకటే కొలతలను గలవిగా) వచ్చుట సమయతి యనఁబడును. దీనిని పిపీలికయతి అనియును చెప్పుదురు. (పిపీలిక మనగా చీమలు) చీమలు పోవుచున్న క్రమములో వచ్చు యతి అని తాత్పర్యము. ఉ, (1) తకతక, (2) తాకాతాకా (3) తా ; కా ; తా ; కా ; ఇట్లు ఒకే తీరున వచ్చుట.

2. విషమయతి :—పైనిచెప్పిన సమయతికి ప్రత్యక్షవిరోధముగ వచ్చు యతి. ఉ॥ తా ; ; కతాకతక తా, తా ; ఇట్లు నానావిధములుగ వచ్చుట.

3. మృదంగయతి :—మృదంగాంగము మధ్యలో స్థూలముగనుండి రెండుకొనలోను స్థూలము క్రమము తగ్గియున్న చందంబున వచ్చుయతి మృదంగయతి యనఁబడును. ఉ॥ తక—తాకా—తా,—కా,—తా , కా ;—తా, కా,—తాకా—తక ; ఇట్లు వచ్చుట.

4. వేదమధ్యయతి:—హుడుక్క అను వాద్యమునకు మధ్యభాగము సూక్ష్మముగను రెండుప్రక్కల భాగములు విశాలముగనుండు చందంబున వచ్చు యతి వేదమధ్యయతి యనఁబడును. ఉ॥ తా ;—కా,—తా—క—తా—కా,—తా ; ఇట్లు వచ్చుట.

5. గోపుచ్ఛయతి :—గోవుయొక్క పుచ్ఛమునుబోలి ప్రారంభ ములో పెద్ద అంగమును వరుసగా చిన్న అంగములుగ తగ్గుచువచ్చి ముగించుట. ఉ॥ తా ;—కా,—తా—క.

6. స్రోతోవహాయతి :—పైనిచెప్పిన గోపుచ్ఛమునకు అవరోహణ క్రమము స్రోతోవహాయతి యనంబడును. ఉ॥ తతా తా, తా; తా ; ; ; ఇట్లు వచ్చుట.

పైని చెప్పఁబడిన యతులు ఒకటితోనొకటి చేరునపుడు యతులు సంయోగవియోగములచే ననేకము లగును.

ఈ యతి ప్రస్తారలక్షణము ననుసరించి తాళాంగములను వ్రాసి తాళప్రస్తారము చేయుట పూర్వీకుల సంప్రదాయముగ నుండెనని తెలియుచున్నది.

ప్రస్తారప్రాణ లక్షణము.

స్వరప్రస్తారమునుం బోలి తాళప్రస్తారములును అనంతమగును. ప్రస్తారపద్ధతులు (1) నష్టము, (2) ఉద్దిష్టము, (3) పాతాళము, (4) మహాపాతాళము, (5) అనుద్రుతమేరువు, (6) ద్రుతమేరువు, (7) ద్రుతశేఖరమేరువు, (8) లఘుమేరువు, (9) గురుమేరువు, (10) ప్లుతమేరువు, (11) కాకపాద మేరువు, (12) సంయోగమేరువు, (13) ఖండప్రస్తారము, (14) యతిప్రస్తారము అని 14 భేదము లగుచున్నవి.

(1) నష్టము : ఒకప్రస్తార మిన్నవ ప్రస్తారమని లెక్కచేయుట.

(2) ఉద్దిష్టము : ఇన్నవ ప్రస్తార మిదియని లెక్కచేయుట.

(3) పాతాళము : ప్రస్తరింపఁబడిన అంగము లన్నిటికిని తక్కువైన అంగ సంఖ్య లెన్ని వచ్చియున్నవని గుణించుట.

(4) మహాపాతాళము : ప్రస్తారములలో అన్ని అంగములును ఎన్ని మారులు వచ్చియున్నవని లెక్కచేయుట.

(5) అనుద్రుతమేరువు : (సమసంఖ్యగల ఒక అంగము ఎన్ని ప్రస్తారములలో వచ్చియున్నదని తెలియుటకై) అనుద్రుతమును లెక్కచేయుట.

(6) ద్రుతమేరువు : అటులనే ద్రుతమును లెక్కచేయుట.

(7) ద్రుతశేఖరమేరువు : అటులనే ద్రుతశేఖరమును లెక్కచేయుట.

(8) లఘుమేరువు : అటులనే లఘువులను లెక్కచేయుటను.

(9) గురుమేరువు : పైనిచెప్పిన తీరుననే గురువును లెక్కచేయుట.

(10) ప్లుతమేరువు : ప్లుతమును లెక్కచేయుట.

(11) కాకపాదమేరువు : కాకపాదమును లెక్కచేయుట.

(12) సంయోగమేరువు : సమసంఖ్యగల అంగము లెన్ని మాఱులు వచ్చియున్నవని లెక్కచేయుట.

(13) ఖండప్రస్తారము : అంగములు లోపములేక స్థానభేదములను మాత్రము జెందునటుల ప్రస్తరించుట.

(14) యతిప్రస్తారము : యతుల ననుసరించి భాగించుట.

తాళమునకు గలిగియుండు ప్రస్తారములును, మేరుపట్టికలును ఇంచు కైన నుపయోగములు కావు. అందుచేత వానిని ఇ॥ వ్రాయలేదు.

స ప్త తా ళ ము లు.

శ్లో॥ ధ్రువోమఠ్యోరూపకశ్చ ఝంపాత్రిపుట ఏవచ ।
అటతాళశ్చైకతాళశ్చ సప్తతాళైః ప్రకీర్తితః ॥

తా. ధ్రువతాళము, మఠ్యతాళము, రూపకతాళము, ఝంపతాళము, త్రిపుట తాళము, అటతాళము, ఏకతాళము అని తాళములు ఏడు.

సప్తతాళములకును వారనక్షత్రాదిగ గల లక్షణములు సంగీతస్వర ప్రస్తారసాగరములో వ్రాయఁబడియున్నవి. ఇవి పూర్వప్రసిద్ధ గ్రంథములలోఁ గన్పట్టలేదు. మఱియు నిందుగల శ్లోకముల నెవఁడో సంస్కృతభాషాపరిచ యము లేనివాఁడు కల్పించి పరమశివుఁడు పార్వతికి నుపదేశించినట్లు తన యాభాస జ్ఞానమును లోకమునకు వెల్లడించుచున్నాఁడు.

శ్లో॥ భానువారేపుష్యరుక్షే ధ్రువతాళసముద్భవః ।
శ్వేతవర్ణవిశాలాక్షీ హీరమాలాభిశోభితమ్ ॥
శుభ్రవస్త్రధరశ్చైవ శాండిల్యాశ్చఋషిస్స్వయమ్ ।
ఛందోఅనుష్టుపుశ్చైవ బ్రహ్మాధిదేవతస్తథా ॥
జంబూద్వీపనివాసైశ్చ ధ్రువఘుళాంగసజ్ఞిక ।
లఘుద్రుతలఘుద్వంద్వం ధ్రువఘుళంచలక్షణమ్ ॥

తా. ఆదివారమునందు, పుష్యమినక్షత్రమున శ్వేతచ్ఛాయయై, విశాలాక్షియై, శుభ్ర వస్త్ర వజ్రమాలికాలంకృతయై, అనుష్టుపుఛందోయుక్తయై, బ్రహ్మ అధిదేవతగాను శాండిల్య ఋషిని అధీనకర్తగాను గలదియై, జంబూద్వీప నివాసినిగా ధ్రువతాళము బుట్టెను. ఈ ధ్రువ తాళమునకు ఒక్కలఘువు ఒక్కద్రుతము పిమ్మట రెండులఘువులు, అంగసంజ్ఞ । ० । ।.

శ్లో॥ సోమవారేహస్తరుక్షే మత్యతాళసముద్భవః ।
శ్యామవర్ణోమహాకాయ నానాభరణభూషితమ్ ॥
రక్తగంధత్రిష్టుప్ ఛంద కౌమారి అధిదేవతా ॥
రక్తవస్త్రధరశ్చైవా విశ్వామిత్రఋషిస్స్వయమ్ ॥
ప్లక్షద్వీపనివాసైచ మత్యతాళంచసాక్షిక ।
లఘుద్రుతసతాళంగం చతురశ్రప్రకీర్తితః ॥

తా. సోమవారమునందు హస్తనక్షత్రమున శ్యామళమైన గాత్రమును గలదియై, రక్తవస్త్రధారిణియై, నానాభరణవిభూషితయై, రక్తగంధధారిణియై, త్రిష్టుప్ ఛందోయుక్తయై, కౌమారిని అధిదేవతగాను, విశ్వామిత్రఋషిని ఆధీనకర్తగాను గలదియై, ప్లక్షద్వీప నివాసినిగా మత్యతాళము పుట్టెను. దీనికి చతురస్రజాతియందు ఒక్క లఘువును ఒక్క ద్రుతమును పిమ్మట ఒక్క లఘువు, అంగసంజ్ఞ: I O I.

శ్లో॥ కుజవారేష్వనూరుక్షే రూపకశ్చసముద్భవః ।
పీతవర్ణకోమలాంగో నానాభరణభూషితమ్ ॥
పీతవస్త్రధరశ్చైవ అంబికాఅధిదేవతా ।
స్వయంగౌతమఋష్యస్యా తుక్శద్వీపనివాసిని ॥
• ద్రుతమేకంలఘుర్యేకం శృణుఅంగానిశంకరీ ।
దశప్రాణాత్మికంతాళం రూపకస్యప్రకీర్తితః ॥

తా. కుజవారమునందు అనూరాధానక్షత్రమునందు పీతవర్ణముగల మృదుశరీరియై, పీతాంబరధారిణియై, నానాభరణాలంకృతయై, అంబికాదేవిని అధిదేవతగాను గౌతమ ఋషిని ఆధీనకర్తగాను గలదై, కుశద్వీప నివాసినిగా రూపకతాళము పుట్టెను. దీనికి దశప్రాణయుక్తమైన ఒక్క ద్రుతము ఒక్క లఘువు, అంగసంజ్ఞ. O I.

శ్లో॥ బుధవారేపుబ్బరుక్షే ఝంపతాళసముద్భవః ।
చిత్రవర్ణవరాంగశ్చ స్వర్ణాభరణభూషితమ్ ॥
చిత్రవస్త్రధరశ్చైవ జమదగ్నిఋషిస్స్వయం ।
క్రౌంచద్వీపనివాసశ్చ మహేశ్వర్యధిదేవత ॥
లఘువానుద్రుతంబిందు అంగలక్షణమిత్యపి ।
దశప్రాణాత్మికంతాళం ఝంపతాళప్రకీర్తితః ॥

తా. బుధవారమునందు పుబ్బనక్షత్రమున చిత్రవర్ణముగల సుందరాంగియై, స్వర్ణాభరణ చిత్రవస్త్రధారిణియై, మహేశ్వరిని అధిదేవతగాను, జమదగ్నిఋషిని ఆధీనకర్తగాను గలదై, క్రౌంచద్వీపనివాసినియై ఝంపతాళము పుట్టెను. దీనికి దశప్రాణయుక్తమైన లఘువును విరామమును బిందువు, అంగసంజ్ఞ: I ◡ O.

శ్లో॥ గురువారేరుద్రరుక్ష్యే త్రిపుటతాళ సముద్భవః ।
పీతవర్ణేచ శ్రేష్ఠాంగి నానాభరణభూషితమ్ ॥
పీతవస్త్రధరశ్చైవ రమ్యామీశ్వరిదేవతా ।
భరద్వాజఋషిశ్చైవ శాల్మలద్వీపవాసినీ ॥
లఘుర్యేకంద్రుతద్వంద్వం తాళఃత్రిపుటలక్షణమ్ ।
అయంలోకహితార్థాయాం భరతాద్యప్రయుజ్యతే ॥

తా. గురువారమునందు ఆరుద్రనక్షత్రమున పంచరంగుగల శ్రేష్ఠశరీరియై, పీత వస్త్రధారియై, నానావిధాభరణ భూషితయై, ఈశ్వరిని అధిదేవతగాను భరద్వాజఋషిని అధీనకర్తగాను గలదియై, శాల్మలద్వీప నివాసినియై, త్రిపుటతాళము బుట్టెను. దీనికి ఒక్క లఘువు రెండు ద్రుతములు. అంగసంజ్ఞ. । ० ०.

శ్లో॥ భృగువారాశ్వనీరుక్ష్యే అటతాళ సముద్భవః ।
భర్మవర్ణకోమలాంగం ముక్తాభరణభూషితమ్ ॥
అస్యప్రధానకశ్చైవ వికృతిః శుద్ధరూపిణీ ।
మృడాన్యతిపతీదేవ పీతాంబరధరస్తథా ॥
అయంశాక ద్వీపవాసి కశ్యపశ్చఋషిస్వయమ్ ।
లఘుద్వంద్వం ద్రుతద్వంద్వం అటతాళప్రకీర్తితః ॥

తా. శుక్రవారమునందు అశ్వినీనక్షత్రమున బంగారుకాంతిగల కోమలశరీరియై, పీతాంబరధారియై, ముక్తాభరణభూషితయై, వికృతి ఛందస్సుగలదియై పార్వతిని అధిదేవతగాను కశ్యపఋషిని యాధీనకర్తగాను వహించినదై, శాకమను ద్వీపనివాసినియై, అటతాళ ముద్భవించెను. దీనికి 2 లఘువులు 2 ద్రుతములు. అంగసంజ్ఞ: । । ० ०.

శ్లో॥ శనివారేస్వాతిరుక్ష్యే ఏకతాళ సముద్భవః ।
నీలవర్ణోరక్తనేత్రో రత్నమాలాభిశోభితమ్ ॥
పీతాంబరధరశ్చైవ యేరాశ్వరిసరస్వతి ।
సపుష్కర ద్వీపవాసై వసిష్ఠాయ ఋషిస్వయమ్ ॥
ఏకతాళలఘుశ్చైవ తాళజ్ఞానవినోదినీ ।
శ్రీణుసప్తతాళాంగాని శంకరీశాస్త్రసమ్మతమ్ ॥

తా. సిరవారమునందు స్వాతీనక్షత్రంబున నీలగాత్రయై, రక్తనేత్రయై, పీతవస్త్ర రత్నమాలా పరిశోభితయై, వసిష్ఠఋషిని యాధీనకర్తగా వహించినదై, సరస్వతిని అధిదేవతగా పుష్కరద్వీప నివాసినియై, ఏకతాళము జనించెను. ఈ యేకతాళమునకు ఒక్క లఘువు. అంగసంజ్ఞ : ”

పైని వ్రాసియుండు శ్లోకములలో యున్న తప్పులను సవరించక సంగీత స్వరప్రస్తార సాగరములో నున్నటులనే ప్రచురించియున్నాను. వానిని చక్కగ గమనించువారికి వానియందు గల తప్పులు వెల్లడియగును.

## 32. సప్తతాళములు ఏర్పఱచినవారు.

శ్లో॥ భరతో దత్తిళశ్చైవ ఆంజనేయో మహోధ్రువః ॥

తా. భరతాచార్యులును, దత్తిళాచార్యులును, ఆంజనేయులును కలిసి, ధ్రువతాళమును ఏర్పఱచినారు.

శ్లో॥ మఠ్యతాళస్యకర్తారః మతంగార్జునకోహళాః ॥

తా. మతంగమహామునియు, అర్జునుడును, కోహళాచార్యులును కలిసి, మఠ్యతాళము జేసినారు.

శ్లో॥ ఆంజనేయః కుంభజోపి యాజ్ఞవల్క్యస్తు రూపకే ॥

తా. ఆంజనేయులును, అగస్త్యులును, యాజ్ఞవల్క్యులును కలిసి, రూపకతాళము జేసినారు.

శ్లో॥ నందీశో భరతో శౌనః ఝంపాయాం చైవ సప్తధా ।

తా. నందికేశ్వరుడును, భరతాచార్యులును, శౌనకమునియును కలిసి, ఝంపతాళము జేసినారు.

శ్లో॥ నిశాచరపతిః బ్రహ్మా త్రిపుటే శంఖపాలకః

తా. రావణాసురుడును, బ్రహ్మయును, శంఖపాలుడును కలిసి, త్రిపుట తాళము జేసినారు.

శ్లో॥ బలిః కౌమారదేవేంద్రౌ అటతాళ సముద్భవః ।

తా. బలిచక్రవర్తియు, దేవేంద్రుడును, కుమారస్వామియు కలిసి, అటతాళము జేసినారు.

శ్లో॥ మహతాంచాపి సర్వేషాం ఏకతాళసమం విదుః ॥

తా. సకలమైనవారును జేరి ఏకతాళము సమముగా చెప్పినారు.

పైని కనఁబఱచియుండు, భరతాది మునులచే తాళములు నిర్మింపఁబడినవను విషయము, ప్రాచీన గ్రంథములలో గానస్పష్టము లేదు. కనుక ఈ పద్ధతియును నూతన పద్ధతియే యగును.

## సప్తతాళములు.

ధ్రువము, మఠ్యము, రూపకము, ఝంప, త్రిపుట, అట, ఏకతాళియు, ఇవి తాళసప్తకము. ఈ 7 తాళములను చతురశ్రాది పంచజాతులచే పెంచినచో తాళములు 35 అగును. వీనికి వరుసగా 35 నామములును, వేర్వేరు అక్షరసంఖ్యలును గలవు. వీని వివరములను నీక్రింది పథకములోఁ జూడుఁడు.

| సంఖ్య. | పేళ్లు. | గుర్తులు. | చతురశ్రము. | | త్రిశ్రము. | | మిశ్రము. | | ఖండము. | | సంకీర్ణము. | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | అక్షర సంఖ్య. | పేళ్లు. | అక్షర సంఖ్య. | పేళ్లు. | అక్షర సంఖ్య. | పేళ్లు. | అక్షర సంఖ్య. | పేళ్లు. | అక్షర సంఖ్య. | పేళ్లు. |
| 1 | ధ్రువము | 1011 | 14 | శ్రీకర | 11 | మణి | 23 | పూర్ణ | 17 | ప్రమాణ | 29 | భువన |
| 2 | మఠ్యము | 101 | 10 | సమ | 8 | సార | 16 | ఉదీర్ణ | 12 | ఉదయ | 20 | రావ |
| 3 | రూపకము | 01 | 6 | పత్తి | 5 | చక్ర | 9 | కుల | 7 | రాజ | 11 | బిందు |
| 4 | ఝంప | 100 | 7 | మధుర | 6 | కదంబ | 10 | సుర | 8 | మేళ | 12 | కద |
| 5 | త్రిపుట | 100 | 8 | ఆది | 7 | శంక | 11 | లీల | 9 | దుష్కర | 13 | భోగ |
| 6 | అట | 1100 | 12 | లేఖ | 10 | గుప్త | 18 | లోక | 14 | విదళ | 22 | ధీర |
| 7 | ఏక | | 4 | మాన | 3 | సుధ | 7 | రాగ | 5 | రత | 9 | వసు |

N B ధ్రువాది సప్తతాళములను వాడునపుడు, చతురశ్రాది పంచజాతులలో నొకటిని చేర్పక వానిని వాడుటకు సాధ్యముగాదు. ఇట్లు ధ్రువాది తాళములకు జాతి సంబంధము గలుగునపుడు వేర్వేరు నామములు గలుగుచున్నవి. సూళాది 35 తాళములకును శ్రీకరాది 35 పేళ్లు పైపథకములో వ్రాయఁబడియున్నవి. ఇవియే ఈ తాళములకు నియతమగు నామము లని యెఱుంగునది.

పైని కనఁబఱచియున్న పథకములో, సప్తతాళములును పంచ జాతుల సంయోగమువలన 35గా వృద్ధిఁజెంది 35 తాళము లాయెను. ఈ 35 తాళములను 5 గతులచే భేదము జేసి వాడునపుడు 35 × 5=175 తాళము లగునని "సంగీతచంద్రిక" అను పుస్తకములో వ్రాయఁబడి యున్నది. ఇట్లు గతిభేదముచేసి వాడుట శాస్త్రోక్త పద్ధతి కానేరదు. ఇది యొక నవీన కల్పనావిశేషమే యగును.

మిస్టర్ మాణిక్కమొదలారు వ్రాసియున్న సంగీతచంద్రికలో మొదలారి స్వకల్పనము లనేకతావులలో కనఁబడుచున్నవి. గ్రంథోక్త తాళ ప్రస్తారములే అపారముగ నున్నవి. వాని నెఱింగి ఉపయోగించుటకే మన మశక్తులై యున్నాము. అట్లుండునపుడు మిస్టర్ మొదలారి విపరీత కల్పనములను పూర్వోక్త తాళములతో చేర్చునపుడు తాళముల సంఖ్య విపరీతమే యగును. మొదలారి కల్పనములలోఁ గొన్నిటి నీ దిగువఁ జూడుఁడు :

(1) మిస్టర్ మొదలారు, 35 తాళములకు గతి భేదములను కల్పించి 175 నామహీనమైన తాళములను వ్రాసియున్నారు. వీనికి సమకళా తాళ పట్టికను సిద్ధపఱచి యున్నారు. వీనికి నామములనుకూడ కల్పించి యుండి నచో కల్పన పరిపక్వమైనదియై యుండును.

(2) మేళకర్త రాగములకు గల పేళ్లను ఒక విచిత్ర కటపయాది లెక్కచే భాగించి వానికి సంఖ్యల నేర్పఱచి, ఆ సంఖ్యలతో వచ్చెడి అంకములను ఆ నామములకు తాళాంగములుగ చేర్చి 72 తాళములను కల్పించి వీనికి సమకళా పట్టికను సిద్ధముజేసి ప్రచురించియున్నారు.

(3) అష్టోత్తర శతతాళములను వ్రాసి అవి చతురశ్రజాతి అష్టోత్తర శతతాళమనియును, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణ జాతులలోను 108 తాళములున్నవనియును, అందుచేత వాని మొత్తము "108 × 5=540" ఐదు వందల నలువది యనియును తెలిపియున్నారు. ఈ కల్పనములోని పెద్ద పొరపాటును మొదలియారు గమనింపకపోయినందువలన వారి కల్పనముల వెల్లడియగుటకు కారణమాయెను. ఈ కల్పనములోని పొరపాటు ఏదియన చతురశ్రాది పంచజాతుల భేదములు లఘువునకు మాత్రమేగాని తదితర అంగములకు లేవు. నూట ఎనిమిది తాళములలో లఘుహీనమైన తాళములును, ద్రుతములను మాత్రము అంగముగా బడసిన తాళములును

ఉన్నవి. ఉదాహరణముగ, మతంగతాళము, త్రితీయతాళము, త్రిమాత్రిక మొదలగు తాళములలో లఘువు లేదు. మఱియు కరుణాయతి, షట్తాళము, ఏకతాళము అను నీ మూఁడు తాళములలోను ద్రుతము అను అంగము మాత్రమే వచ్చియున్నది. కనుక ఈ తాళములు జాతిభేదములను జెందవు. ఈ కారణములవలన మొదలారిగారి కల్పనము అసంభావితమే యగును.

సంగీతరత్నాకర గ్రంథములోని 120 తాళములు.

శ్లో॥ లఘ్వాదితాలో లోకేఽసౌ రాసః దాలోద్వితీయకః ।
ద్రుతాద్రుతౌ విరామాన్తౌ త్రితీయస్స్యాత్ చతుర్థకః ॥
లఘుద్వయంద్రుతశ్చైకః పంచమస్తు ద్రుతద్వయం ।
తాలే నిశ్శంక లీలాఖ్యే ప్లుతౌ ద్వ్యాగద్వయం లఘుః ॥
దర్పణే దద్వయం గశ్చ సింహవిక్రమ సజ్ఞకః ।
గత్రయం లః పలగపాః రతిలీలే లఘూగురూ ॥
లఘ్వన్తే దత్రయం సింహ లీలే ద్వ్యాయగణస్తథా ।
కందర్పతాలస్తస్యైవ పర్యాయః స్యాత్పరిక్రమః ॥
లఘుర్ద్రుతద్వయం చాన్తే గురుః స్యా ద్వీరవిక్రమః ।
రంగశ్చతు ర్ద్రుతీగశ్చ శ్రీరంగస్సగణోలపౌ ॥
విరామాన్త ద్రుతద్వంద్వా న్యష్టౌ లఘుచ చర్చరీ ।
ప్రత్యంగో మగణో తాద్వా యతిలగ్నో ద్రుతో లఘుః ॥
గజలీలో విరామాన్త ముక్తం లఘు చతుష్టయం ।
హంసలీలే విరామాంతం లఘుద్వయ ముదాహృతం ॥
వర్ణభిన్నో ద్రుతౌ లోకః త్రిభిన్నో లగురుప్లుతః ।
రాజచూడామణి ర్ద్రౌ ద్వౌ నగణశ్చద్రుతౌ లగౌ ॥
మగణో లప్లుతౌ రంగో ద్యోతః రంగప్రదీపకః ।
లోగప్లుతౌ రాజ తాలో గపౌ దౌచ గలౌప్లుతః ॥
త్ర్యస్రో మిశ్రోద్విధావర్ణ స్త్ర్యస్రో తౌ ద్వౌ లఘుద్వయం ।
మిశ్రో ద్రుత చతుష్కాః స్యు ర్విరామాన్తా స్త్రయః పృథక్ ॥
తతః పగా దాగలాగః చతురస్రోపి దృశ్యతే ।
గతాద్రుతౌ గురుశ్చేతి సింహవిక్రీడితః పువః ॥
లపౌగ పౌపగాలార్ధః వలౌపశ్చ జయః పునః ।
జోలఘూర్ద్రౌ ద్రుతౌ వశ్చ వనమాలీ చతుర్ద్రుతీ ॥

లఘుర్ద్రా ద్వౌగురురితి లప్లు తౌద్వౌ ద్రుతౌప్లుతః ।
హంసనాదః సింహనాదో యగణశ్చ లఘుర్గురుః ॥
కుఙ్కోద్వౌ ద్రుతౌ లౌద్వౌ విరామాన్త ద్రుతద్వయాత్ ।
ద్రుతౌ తురంగ లీలస్స్యాత్ భవేచ్చార బలీలకః ॥
లౌద్వౌచతుర్ద్రుతీ ద్వౌతా సింహానన్దనకః పునః ।
తపౌలగౌద్రుతౌ గౌలః పలపా గోలఘూతతః ॥
చత్వారో లఘవోఽ శబ్దాః త్రిభంగిః సగణాద్గురుః ।
రంగాభరణ తాలేకా లప్లుతా మణ్ఠకేపునః ॥
సాచ్చతుర్లఘు నిశ్శబ్దం యద్వౌభాద్వౌవ శబ్దకో ।
ఛాచ్చతుర్లఘు నిశ్శబ్దం భవేన్ముద్రిత మణ్ఠకే ॥
మణ్ఠోనజౌ లఘుర్వ్యద్వౌ ప్రోక్తాషడ పరాభిదాః ।
మాణ్ఠరూపక వేలాయాం కోకిలా ప్రియనామ్నిచ ॥
గలపాస్స్యుః విరామాంతౌ లఘూ నిస్సారుకోమతః ।
లఘుర్గురు ద్రుతద్వంద్వం రాజవిద్యాధరో భవేత్ ॥
సగణద్వితయం యత్ర సతాలో జయమంగళః ।
మల్లికామోద తాలే తు లౌద్వౌద్రుత చతుష్టయం ॥
విజయానంద సంజ్ఞేతు లఘుద్వంద్వం గురుత్రయం ।
క్రీడాద్రుతౌ విరామాంతౌ చణ్డనిస్సారుకశ్చసః ॥
జయశ్రీరగణా ల్లోగః ద్వౌలౌలో మకరందకః ।
లపౌగలాప్లుతః కీర్తిః శ్రీకీర్తిద్వౌ లఘూగురూ ॥
లౌద్రుతౌ ప్రీతితాలస్స్యాత్ విజయః పగపాలఘుః ॥
గుర్వోర్మధ్యేతు చత్వారో డిందవో బిందుమాలినీ ।
సమౌలౌద్వౌ విరామాంతౌ లఘుర్ద్వౌపశ్చ నందనః ॥
గురుద్రుత ప్లుతాః ప్రోక్తాః మణ్ఠికాన్యై స్తులద్వయం ।
విరామాంది ద్రుతౌద్వౌచ మాణ్ఠికా పరికీర్తితా ॥
దీపకో దలగాద్వృద్ధిః లౌద్వౌ గురురుదత్తుణాః ।
రగణో ఢెఙ్కీ కాకైశ్చిత్ ఏషప్రోక్తస్తుయోజనః ॥
ద్విశ్చత్వారో విరామాంతా ద్రుతాస్తు విషమేమతాః ।
ద్వౌలౌ ద్వౌదౌలఘుర్ద్వౌద్వౌ కీర్తితాః వర్ణమణ్ఠికా ॥

అభినందో లఘుద్వంద్వం ద్రుతయుగ్మం గురుస్తథా ।
లప్లుతౌ సగణోఽనఙ్గః నాందీగో ద్వౌ లఘూగురూ ॥
మల్లతాలో విరామాంత ద్విబింద్వంతం చతుర ఘు ।
ఉక్తశ్చతుర్థా కఙ్కాలః పూర్ణః ఖండః సమోఽసమః ॥
చతుర్ద్రుతీ గలౌ పూర్ణః ఖం ద్వౌ గురుద్వయం ।
సమో గురూ ద్వౌ లఘ్వంతౌ విషమో లా ద్గురుద్వయం ॥
కందుకో లౌ చ సగణః ద్రుతేనత్వేకతాలికా ।
కుముదో లౌ ద్రుతౌ గశ్చ అన్యేషాం లశ్చతుర్ద్రుతీ ॥
అంతే గురుశ్చకుముదః చతుస్తాలో గురోఃపరే ।
త్రయోద్రుతాః డోమ్బులీతు ద్విర్లఘుస్స్యాత్ ద్విరామవత్ ॥
అభఙ్గో లప్లుతౌ రాయ వఙ్గోలో రగణాద్ద్రుతౌ ।
వసంతౌ నౌ విరామాంత లఘునా లఘుశేఖరః ॥
ప్రతాపశేఖరో దీప్తౌ ద్విరామాంతం ద్రుతద్వయం ।
ఝంపతాలో విరామాంతం ద్రుతద్వంద్వం లఘుస్తథా ।
గజఝంపో గురోరూర్ధ్వం విరామాంతం ద్రుతత్రయం ॥
చతుర్ముఖో జప్లుతాభ్యాం స ఏవోన్మాతుకో మతః ।
దద్వయం గశ్చ మదనః సోఖోవా ప్రతిమఠ్ఠికః ।
కోల్లకో న్యై రయం ప్రోక్తః పార్వతీ లోచనే పునః ॥
మలపా నౌ గురూ ద్వౌ ద్వౌ రతితాలో లఘుర్గురుః ।
క్రీడాదతాపం కరణ యతౌ దుతచతుష్టయం ।
లలితో ద్వౌ ద్రుతౌ లోగః గారుగీ చతుస్తుద్రుతీ ॥
విరామాంతా బుధైరుక్తా రాజనారాయణః పునః ।
ద్రుతౌ ద్వౌ జగణో వక్రః లక్ష్మీశతు ద్రుతద్వయం ।
విరామాంతం లప్లుతౌ చ తాలస్తు లలితప్రియః ।
ఊర్ధ్వం లఘుభ్యాం రగణః స్యాతాంశ్రీ నందనేభవా ॥
జనకో నయసావక్రః వర్ధనో ద్వౌ ద్రుతౌ లపౌ ।
విరామాంతౌ ద్రుతౌ బిందు స్త్రిమాత్రో రాగవర్ధనః ॥
ద్రుతైః షడ్భిస్తు షట్తాలః అంతరక్రీడా తు కథ్యతే ।
ద్రుతత్రయం విరామాంతం హంసేన విరతీలఘూ ॥

లఘుప్లుతా వుత్సవస్స్యాత్ గోదాదీప్తో విలోకితే ।
గజశ్చతుర్లాధా రాఽసా తాదావర్ణయతి ర్భవేత్ ॥
సింహేలగా లత్రయంచ గురుణా కరుణోమతః ।
లఘుర్ద్రుతానాం త్రితయం లఘూనాన్వా సారసౌస్మృతః ।
ద్రుతత్రయం లఘూద్వంద్వం చండతాలే బభాషిరే ॥
మగణశ్చ త్రయోదీప్తా లఘుశ్చంద్ర కలాభిధే ।
గలౌప్లుత త్రయంవక్రః ప్లుతోబిందు త్రయంలయే ॥
రోద్రుతౌద్వౌ గురూస్కందః అడ్డతాలీ లఘుద్వయం ॥
ఇమమేవోచిరే తాలం కేచిత్త్రిపుట సంజ్ఞయా ।
ద్వౌలౌ ద్వౌదౌఽగౌ ధత్తా ద్వంద్వః సతగణౌప్లుతః ॥
ముకుందేతు లఘూర్బిందు చతుష్టయ మధోగురుః ।
కువిందకే లఘుర్బిందు ద్వయంగురు రథప్లుతః ॥
కలధ్వని ర్లఘుద్వంద్వం గురుర్లఘురథ ప్లుతః ।
పంచభిర్లఘుభి ర్గౌరీ న్వౌగురూద్వౌ లఘుద్రుతౌ ॥
తాలే సరస్వతీ కణ్ఠాభరణే శార్ఙ్గిసమ్మతౌ ।
భగ్నతాలే చతుర్బిందు నగణశ్చ విరామవాన్ ॥
తాలే రాజమృగాంకేతు ద్రుతౌ లఘురథో గురుః ।
గురుర్లఘుద్రుతాః తాలే రాజ మార్తాండసంజ్ఞకే ॥
నిశ్శంకసంజ్ఞకే తాలే లఘురూప గురూగలౌ ।
శార్ఙ్గదేవే ద్రుతద్వంద్వం గప్లుతౌగ ద్వయం లఘుః ॥

ఇతి వింశత్యుత్తర శతం దేశీతాలాః.

---

రత్నాకర గ్రంధమునందలి 120 తాళములును వాని అంగములును.

☞ ఈ తాళపట్టికలో తాళాంగములను జూపుటకై లఘువునకు (1) అను సంఖ్యను, గురువునకు (8) అను సంఖ్యను, ప్లుతమునకు (3) అను సంఖ్యను, కాకపాదమునకు (+) అను గుఱుతును ఉపయోగింపఁబడి యున్నవి అర్ధచంద్ర చిహ్నము విరామ మనియును పూర్ణానుస్వారములు ద్రుతమనియు నెఱుంగునది.

1. ఆదితాళము ।
2. ద్వితీయతాళము o o ।
3. తృతీయతాళము o o o ᴗ
4. చతుర్థతాళము । । o
5. పంచమతాళము o o
6. నిశ్శంకలీలతాళము 3 3 8 8 ।
7. దర్పణతాళము o o 8
8. సింహవిక్రమతాళము 8 8 8 । 3 । 8 3
9 రతిలీలతాళము । । 8 8
10 సింహలీలతాళము ᴗ o o
11 కందర్పతాళము o o । 8 8
12. వీరవిక్రమతాళము । ᴗ o 8
13. రంగతాళము o o o o 8
14 శ్రీరంగతాళము । । 8 । 3
15. చర్చరితాళము ooᴗ ᴗoᴗ ooᴗ ᴗoᴗ ooᴗ ooᴗ ooᴗ ooᴗ
16. ప్రత్యంగతాళము 8 8 8 । ।
17. యతిలగ్నతాళము ᴗ ।
18. గజలీలతాళము । । । । ᴗ
19. హంసలీలతాళము । ᴗ । ᴗ
20. వర్ణభిన్నతాళము o o । 8
21. త్రిభిన్నతాళము । 8 3
22. రాజచూడామణి తాళము ᴗ o । । । o o । 8
23. రంగద్యోతతాళము 8 8 8 । 3
24. రంగప్రదీపకతాళము 8 8 । 8 3
25. రాజతాళము 8 3 o o 8 । 3
త్ర్యస్రవర్ణరాజతాళము । । o o । ।
మిశ్రవర్ణరాజతాళము ooooᴗ ooooᴗ ooooᴗ 38ᴗo8।
26. చతురశ్రవర్ణరాజతాళము 8 । o o 8
27. సింహవిక్రీడితతాళము । 38338 । 83 । 3

28. జయతాళము । 8 । । ం ం 3
29. వనమాలీతాళము ం ం ం ం । ం ం 8
30. హంసనాదతాళము । 3 ం ం 3
31. సింహనాదతాళము । 8 8 । 8
32. కటుక్కతాళము ం ం । ।
33. తురంగలీలతాళము ం ౦ ం ౦ ం ం
34. శరభలీలతాళము । । ం ం ం ం । ।
35. సింహనన్దనతాళము 88 । 3 । 8 ం ం 8 8 । 3 । 3 8 । । (4) +
36. త్రిభంగితాళము । । 8 8
37. రంగాభరణతాళము 8 8 । । 3
38. మంఠతాళము । । 8 +
B మంఠతాళము 8 । । (2) +
C. ముద్రితమంఠతాళము 8 । । (4) +
D. మంఠతాళము । । । 8 । ।
(మంఠతాళములో 10 విధము లున్నట్లు తెలియుచున్నది.)
39. కోకిలప్రియతాళము 8 । 3
40. నిస్సారుకతాళము । ౦ । ౦
41. రాజవిద్యాధరతాళము । 8 ం ం
42 జయమంగళతాళము । । 8 । । 8
43 మల్లికామోదతాళము । । ం ం ం ం
44. విజయానన్దతాళము । । 8 8 8
45. క్రీడాతాళఖండనిస్సారుకతాళము ం౦ం౦
46. జయశ్రీతాళము 8 । 8 । 8
47. మకరన్దతాళము ం ం । । ।
48. కీర్తితాళము । 3 8 । 3
49. శ్రీకీర్తితాళము । । 8 8
50. ప్రీతితాళము । ం ం
51. విజయతాళము 3 8 3
52. బిందుమాలినీతాళము 8 ం ం ం ం 8

53. సమతాళము | | ∪ ○ ∪ ○

54. నన్దనతాళము | ○ ○ 3

55. మణ్ఠికతాళము × ○ 3

మణ్ఠకతాళము ○ ∪ ○

56. దీపకతాళము ∪ ○ | | 8 8

57. ఉదీక్షణతాళము | | 8

58. ఢెంకితాళము 8 | 8

59. విషమతాళము ∪∪○∪ ○○○○

60. వర్ణమణ్ఠతాళము | | ○ ○ | ○ ○

61. అభినన్దతాళము | | ○ ○ 8

62. అనంగతాళము | 3 | | 8

63. నాందీరతాళము | ○ ○ | | 8 8

64. మల్లతాళము | | | | ∪○○

65. పూర్ణతాళము ○ ○ ○ ○ 8 |

ఖండపూర్ణతాళము ○ ○ 8 8

సమపూర్ణతాళము 8 8 |

విషమపూర్ణతాళము | 8 8

66. కందుకతాళము | | | | 8

67. ఏకతాళము ○

68. కుముదతాళము | ○ ○ | | 8

కుముదతాళము | ○ ○ ○ ○ 8

69. చతుస్తాళము 8 ○ ○ ○

70. డోంబులీతాళము | ∪ | ∪

71. అభంగతాళము | 3

72. రాయవంగోలతాళము 8 | 8 ○ ○

73. వసంతతాళము | | | 8 8 8

74. లఘుశేఖరతాళము

75. ప్రతాపశేఖరతాళము 3○○∪

76. ఝంపతాళము ○∪○∪

నిధనిసారి - ధనిసారి - గరిగసరి - గరినిసారి - ధనిసరిగమగా ; -

నిగరిగామ - రిగమగరిస - నిధనిస - నిగరిసా - నిధపగా - నిసరిగమ * (దాశ)

(పైవ్రాయఁబడియున్న మధ్యకాలస్వరములనే మూఁడవకాలములోను పాడుకొనవలెను.)

## కోనుగోలు

కోనుకోలనునది దేశ్యపదము. భరతనాట్యములో నటుఁడు కొలిపించుట కోనుగోలనఁబడును. ఈ కొలిపించు పద్ధతి చాల పురాతనమైనయది. పరమశివుఁడు తాండవమొనర్చిన సమయంబున కమలభవుఁడు కొనిపించినాడను విషయము పురాణప్రసిద్ధమైనది. ప్రాచీనులు భరతశాస్త్రములో చాల ప్రీతిగలిగినవారలై యుండినందువలన భరతశాస్త్రాంగములైన యన్నివిషయములను చాల వృద్ధిజేయుచుండిరి. ఆ కారణముచేత ప్రాచీనులు సమ్మేళనము జేసియున్న జతులు కట్టుదిట్టములతోను, శబ్దాలంకారములతోను, మనోహరముగను, శ్రావ్యముగను దనరారుచున్నయవి. ఇటీవల గొన్ని దశాబ్దములుగ భరతశాస్త్రము సంగీతశాస్త్రముకన్న మిగుల పరితాపమైన దుర్దశనొందినందువలనను, సంగీతశాస్త్రము తీరుననే భరతశాస్త్రమును చదువరుల సమూహమునం దరుదైనందువలనను ఈ శాస్త్రమును నశించుటకు కారణమాయెను. మన దేశములోని ప్రాచీనజతులను ప్రకృతపు నటులచే సిద్ధపఱుపఁబడి యుండు జతులను సంప్రతించునపుడు దీవటి కెదురుబెట్టిన దీపమువలె నవీనజతులశైలి ప్రకాశించుచున్నది. ఇందుకు కారణ మెద్దియనిన ప్రాచీన గ్రంథములను బరిష్కరించి జతుల కుపయోగమైన శబ్దములివియని నెఱుఁగకుండుటయే. స్వరావళి మొదలుగాగల ప్రథమాభ్యాస పద్ధతులను, వర్ణములను పాఠముచేయని వారల కెట్లు స్వరజ్ఞానము గలుగదో యట్లే జతులకైన శబ్దములను, అట్టి శబ్దములచే గూర్పఁబడియున్న యలంకారంబులను, శబ్ద, ప్రాస, యతి, పూర్వమధ్యాంత్యమందలి ముగింపులు, ఎత్తుకకడ, తీర్మానములు మొదలగు లక్షణములతో గూడుకొనియున్న జతులను పాఠముజేసి మధ్యకాల త్రికాలములతో కొలిపించి సాధకము జేయనివారికి విన్యాసములో కొలిపింపు శక్తియును, స్ఫుటోచ్చారణమును గలుగవు. ప్రాచీన విద్వాంసులచే విరచితంబులైన యనేక ప్రసిద్ధజతు లిది వరకు నశించెను. వానిలో కొన్నిమాత్రమే మనచేతి కబ్బియున్నవి. వాని

లోని శైలి ననుసరించి ప్రకృతపు విద్వాంసులు కొన్ని జతులను సమ్మేళనము జేసియున్నారు. అయినను అవి ప్రాచీనజతులలో నెంతమాత్రము సరిపోజాలవు.

మనదేశములో నాట్య మొనరించునపుడు నటుడు కొలిపింపు జతులు మాత్రమే కొంచెము శ్రావ్యమైనయవి. ఇపుడు గానసభలో గాయకుడు గానముచేయునపుడును కొలిపించెడి యొక నవీన సంప్రదాయము బయలువెడలియున్నది. ఈ కొలిపింపులు శబ్దాభావమైనదియై రసాభాసమై యున్నవి. కొలిపింపులకు ధాతువులుగనుండు శబ్దములు కెక. అవి —

"శ్లో॥ తాళశ్శబ్దేన జాతాస్తు పంచత్రింశతివర్ణకాః ।
తాటతోఁ థై ధధిధుధే ఢఢిఢూ ఢే ఝఝే ఝనణే ॥
కగిగూగే రిరూరారే విలూలేలా మమూయళా ।
హాహ్వానుస్వార యుక్తంచ భరతశ్చేతి లక్షణం ॥"

(త, ట, తో, థై. ధ, ధి, ధు, ధే, ఢ, ఢి, ఢూ, ఢే, ఝ, ఝే, న, ణే, క, గి, గు, గె, రి, రు, ర, రే, లి, లు, లె, ల, మ, ము, య, ళ, హ, హూ, ం) ఈ కెక శబ్దములును, వీని దీర్ఘములును, వీనికి వ్యాకరణ ప్రకారముగ గలుగు అభేద్దాతురములును, తదనుగుణ్యమైన యొత్తులును, సంధులును జతిప్రాణములైన శబ్దము లగుచున్నవి. ఇట్టి శబ్దములచే శ్రావ్యమైన జతులను కల్పించి కొలిపింపవలయును. అట్లుగాక ("ధిధింధిన్నా, తాధింధిన్నా, తకధిం ధిన్నా, ధింధిన్నా, తకధిం ధిన్నా, తకధిం ధిన్నా, తాధింధిన్నా, తద్ధిన్నా, ధిజ్జిణ్ణత్తాం, తధిజేణతోం") అను కొన్ని శబ్దములను మాత్రము నుచ్చరించుచు వీనితోనే కొనుగోలు ముగించెనని తలంచుచున్నారు. మఱియు స్ఫుటోచ్చారణము లేనివారు "కిటతక తరికిటతోం"అని తృతీయకాలములో పలికించునపుడు "కిటతకతోం" అని పలికించుచున్నారు. ఇట్టి యసంభావితములు మన దేశమునం దిపుడు నిశేషముగ గన్పట్టుచున్నవి. ఇకను ప్రాచీనుల జతుల శైలినిగుఱించిన కొన్ని యంశముల నీక్రింద వ్రాసెదను. జతులను గూర్చునపుడు పూర్వశబ్దము ననుసరించియు, ఉత్తరకల్పనము ననుసరించియు సరళమైన శబ్దముల నొకటితో నొకటి గూర్పవలయును.

ఉ:(1) తక్కిట కిటతక, ధిక్కిట కిటతక, తొంకిట కిటతక, నంకిట కిటతక,
(2) తద్ధిం ధిన్నా, తకధిం ధిన్నా, ధిద్ధిన్నా, కిటతకధిన్నా, తాధింధిన్నా,

తకధినా, (3) తధిద్ధణకు ఝంతా, కిణకు ఝంతా, తరితఝంతా, ధిణకు ఝంతా, (4) ఢీకుఝంతా, ఢంఢంకుకు తరికిట, ఢీఢీకుకుఝం, ఢంఢంణాకఝం, డిక్కుడిక్కుడిగిణం ధిమికిటఝం, (5) తాధిద్ధణాకు, తతరితకిటఝం, తద్ధింగిణాకు రితకిణనకఝం, ధాకుధణాకు తధిత్తక నకఝం (6) ధిల్లం ధిల్లం ధిర్రిత్త, దిద్ధిల్లం దిధిలం తరికిట, ధిల్లత్తాం, (6) హుం దిల్లడిమి కుకుఝం, హుంతర్రిత్త, ఢంగిల్ల ద్ధణాకు కిటతకఝం, డింగిణ్ణాత్తాం, ధిమితక, ధిల్లం ఢిల్లం, ఢంఢంతరికిటతోం, డింగిణ్ణాత్తాం, (7) నంధీకిటతక, నంనంకిటతక, నంతోంకిటతక, నంధీ, నకఝం, రితఝం, నతఝం, తతఝం, (8) తోధీకిటతక, తోంకిట ర్రింకిట. తోంతరికిటతక, తోంతర్రిత్తఝం, తోంనం కిటత, తోద్ధిత్తోర్రి, తోంతరికిట ధిగ్గిణ్ణాత్తాం. ఇట్లు జాత్యానుసారముగను కల్పనముజేసి తాళానుసారముగ ముక్తాయింపులును తీర్మానములును చేయవలయును. ఇట్లే ప్రాచీన జతులు సిద్ధపఱుపఁబడినవి యని గ్రంథపరిచయము జేయువారికి తెలియును.



## పదము.

నాయికా నాయకభావ భూయిష్టమై పల్లవానుపల్లవ చరణములతో కూడుకొనియుండు సాహిత్యము పదమనంబరగును. పదములు చౌకముగనే పాడఁదగినయవి. మఱియు మన పూర్వీకులు పదముల నభినయార్థముగనే రచించినారని తెలియుచున్నది. అభినయించునపుడు పాత్రము తన అంగన్యాస కరన్యాసములను యథాక్రమముగ జేయుటకై పదశైలి విళంబముగ చేయఁబడియున్నది. పదములను మధ్యకాల నడకగా పాడిన యెడల పాత్రము తన అంగన్యాస కరన్యాసములను నిర్బంధముతో నతిత్వరగ జేయవలసి యుండును. అందుచేత రసాభావము గలుగును.

సాధారణముగ పదములు పల్లవానుపల్లవములతోను, మూఁడు చరణములతోను గూడుకొనియుండును. నాలుగుగాని యైదుగాని చరణములతోనున్న పదములును గనఁబడుచున్నవి. పల్లవానుపల్లవములు నాలుగు ఖండములతోగాని యెనిమిది ఖండములతోగాని యుండును. చరణములు 8 లేక 16 ఖండములుగ నుండును. పదములయొక్క కడపటిచరణమునందే ముద్రాఖండము గనఁబడుచున్నది.

పదములును కీర్తనల తీరుననే భక్తిపూర్వకమైనయవి. భక్తుఁడు తన యొక్క మనస్సును నాయికగ జేసి ఆ నాయికకు భగవంతుని నాయకుఁడుగా వరించి తద్వారా తన భక్తియను స్థాయీభావమును భగవదర్పణము గావించుచున్నాఁడు. ఇట్టి భక్తి మిగుల శ్లాఘ్యమైనదని పెద్దలు చెప్పియున్నారు. శఠగోపులు, జయదేవులు మొదలగు యనేక మహనీయులు పైజెప్పిన మార్గమునే యవలంబించియున్నారు. విషయపరిజ్ఞానము లేనివారలు పదములను తుచ్ఛమైన కాముకీకాముకచేష్టలని తలఁచుచున్నారు.

ఈ పదశైలిని మొట్టమొదట కల్పించినవాఁడు మహనీయుఁడైన క్షేత్రజ్ఞుఁడు. ఇతని యునికి మువ్వ. మువ్వపురియందర్చావతారమై చెలగి యుండు గానలోలుఁడైన మువ్వగోపాలుని ప్రసాదమువల్ల నితనికి శృంగార భక్తి రసభూయిష్ఠమైయుండు మనోహరమైన పదములను వ్రాయుటయందద్వితీయమైన పాండిత్యము గలిగెను. ఇతని కాలమునకు ముందుగాని వెనుకగాని యిట్టి యనుపమశైలి నెవరు కల్పించినటుల తెలియలేదు. ఇతఁడు వ్రాసియున్న పదములలో విశేషముగ గ్రామ్యపదముల నుపయోగించియున్నాఁడు. నాయికానాయకులయందాయా యవస్థానుసారముగ గలుగు మనోరథములను స్పష్టముగ దెలుపుటకు గ్రామ్యపదయుక్తమైన స్వభావోక్తులే దిట్టమైనయవి. మఱియు తలిదండ్రులు తమ తనయులను లాలించునపుడు ప్రేమాతిశయముచే తామును తమ తనయులవలెనే జిలిబిలిపలుకుల నుపయోగించు చందమున నాయికా నాయకులు వ్యాకరణ పాండిత్యము గలవారైనను వారల కవస్థాంతరములయందు ప్రేమాతిశయము గలుగునపుడు స్వభావసిద్ధమైన గ్రామ్యములగు ముద్దుపలుకులే వారి మనోరథముల నిచ్చిపుచ్చుకొనుటకైన సాధనముగ నున్నది. కనుక క్షేత్రజ్ఞుఁడును రసపూర్తికై యచ్చటచ్చట గ్రామ్యపదముల నుపయోగించి యున్నాఁడు. ఈ గ్రామ్యములు దాదాపుగ ననింద్యగ్రామ్యములేగాని నింద్యగ్రామ్యములు కానేరవు.

మంచి రాగజ్ఞానము గలవాఁడును, దిట్టమైన విళంబములో లయహీనములేక పోషించి గానము చేయువాఁడును, పదార్థజ్ఞానము గలవాఁడును, ఆయా పదములయందు గల నాయికానాయకావస్థాంతరముల నెఱిఁగి భావభూయిష్ఠమై గానముచేయువాఁడును, స్ఫుటోచ్చారణ గలవాఁ

డును. గానము చేయునపుడు పదసంధుల నచ్చటచ్చట యథోచితముగ విభజించి వినువారికి పదార్థములును భావములును చక్కగ స్ఫురించునటుల గానముచేయువాఁడు ఎవఁడో వాఁడే పదములను గానముచేయుట కర్హుఁడు. పదముల నభినయించుట కాయా పదములయందు గల నాయికానాయకు లిట్టివారనియును, శృంగార మిట్టిదనియును, అవస్థాభేద మిదియనియును, అలంకారము లివియనియును, సంచారీభావము లివియనియును దెలిసికొని యథోచితముగ భావమును కల్పించి యభినయించవలయును. ఒక పదమును పల్లవి మొదలుకొని కడపటి చరణాంత్యమువఱకు చదివి తరువాత పైజెప్పిన ప్రకారముగ లక్షణములను కనిపెట్టవలయును. అట్లు చేయనియెడల లక్షణ ములు చక్కగ స్ఫురించవు. భావములను గూర్చునపుడు పల్లవములోనే పదములోనుండు అన్ని భావములును అన్వయమగునటుల జేయవలయును. ఇట్లు చేయుటకు యథోచితమైన కొన్ని యంశముల నీ దిగువ వ్రాసెదను.

## భావశాస్త్రము

భావములు :—విభావము, అనుభావము, సాత్వికభావము, వ్యభి చారీభావము, స్థాయీభావ మని అయిదు తెఱంగు లగును.

విభావము :—స్థాయీభావములు దేనిచే భావింపఁబడుచున్నవో అది విభావ మనఁబడును. ఆ విభావము ఆలంబన విభావమనియును, ఉద్దీపన విభావ మనియును రెండు విధములు.

రసములును స్థాయీభావములును యేవస్తువుల నాశ్రయించి గలుగు చున్నవో యా వస్తువులు ఆలంబన విభావ మనఁబడును. రసములును స్థాయీభావములును, నాయికా నాయకుల నాశ్రయించియున్నవి. కనుక నాయికా నాయకులు ఆలంబన విభావములని చెప్పఁబడెను.

రసము లాశ్రయించియుండు వస్తువులకు గలిగియుండు గుణములు, చేష్టలు, అలంకృతులు, తటస్థములు మొదలగునవి ఉద్దీపన విభావము.

గుణములు :—యౌవనము, రూపము, లావణ్యము, సౌందర్యము, అభిరూపత్వము, మార్దవము, సౌకుమార్యము ఇవి గుణములు.

చేష్టలు :—కడకంటిచూపులు మొదలగు యౌవనవ్యాపారములు చేష్ట లనంబడును

అలంకృతులు :—వస్త్రములు, ఆభరణములు, పుష్పములు విలేపనములు మొదలగునవి.

తటస్థములు :—ఉపభోగోద్దీపనములుగ నుండు గృహములు, పొదరిండ్లు, భూరుహములు, చెఱువులు, ఏఱులు, కీరకోకిలములు నిండియుండు రసాలవృక్ష ప్రదేశములు, హంసములు నిండియుండు తటాకతీరములు, మలయమారుతము, మేఘనాదము, గానము, క్రీడలు మొదలగునవి తటస్థములు.

అనుభావము :—మనోగతముగ, స్వహేతువుగ నుండు మనోరథములను భ్రూవిక్షేప స్మితాదులచే ప్రత్యక్షముగ బయలుపఱచుట అనుభావమనఁబడును. ఈ యనుభావము, చిత్తజానుభావము, గాత్రజానుభావము, వాగారంభానుభావము, బుధ్యారంభానుభావమని నలుతెఱంగులు.

చిత్తజానుభావములు :—భావము, హావము, హేల, శోభ, కాంతి, దీప్తి, ప్రాగల్భ్యము, మాధుర్యము, ధైర్యము, ఔదార్యము.

గాత్రజానుభావములు:—లీల, విలాసము, విచ్ఛిత్తి, విభ్రమము, కిలికించితము, మొట్టాయితము, కుట్టిమితము, బిబ్బోకము, లలితము, విహృతము.

వాగారంభానుభావములు :—ఆలాపము, విలాసము, సల్లాపము, ప్రలాపము, అనులాపము, అపలాపము, సందేహము, అతిదేశకము, నిర్దేశకము, అపదేశకము, ఉపదేశకము.

బుధ్యారంభానుభావములు :—రీతి, వృత్తి, ప్రవృత్తి.

సాత్వికభావము :—అన్యుల సుఖదుఃఖములయందు అనుకూల్యముతో నే మనస్సు ప్రవర్తించుచున్నదో అట్టి సాత్విక మనస్సునుండి గలుగు భావములు సాత్వికమనఁబడును. అవి స్థంభము, స్వేదము, రోమాంచము, స్వరభేదము, వేపథువు, వైవర్ణ్యము, అశ్రువు, ప్రళయము అని 8 విధములు.

వ్యభిచారీభావము :—వాక్కు, అంగము, సత్వము అగు నీ మూటితో గూడుకొని స్థాయీభావమునకు విశేషాభిముఖముగ సంచరించునది వ్యభిచారీభావమనఁబడును. దీనినే సంచారీ భావమని పెద్దలు జెప్పుచున్నారు. ఈ వ్యభిచారీభావము, నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, మదము, శ్రమము, ఆలస్యము, దైన్యము, చింత, మోహము, ధృతి, స్మృతి, వ్రీడ, చపలత, హర్షము, ఆవేగము, జడత, గర్వము, విషాదము, ఔత్సుక్యము, నిద్ర, అపస్మారము, సుప్తి, విబోధము, అమర్షము, అవహిత్థ, ఉగ్రత,

మతి, వ్యాధి, ఉన్మాదము, మరణము, త్రాసము, వితర్కము అని ముప్పది మూఁడు విధములు.

స్థాయీభావము:—సజాతీయ విజాతీయ భావములచే తిరస్కరింపఁబడక క్షీరసముద్రమువలె అన్ని భావములును తనలో జేర్చుకొని ప్రకాశించునది స్థాయీభావ మనఁబడును. ఈ స్థాయీభావము రతి, ఉత్సాహము, శోకము, విస్మయము, హాస్యము, భయము, జుగుప్స, క్రోధము అని ఎనిమిది విధములు.



## నాయికా నాయక లక్షణములు.

నాయికలు :—స్వీయ, పరకీయ, సామాన్య యని మూఁడు తెఱంగులు.

స్వీయ :—సంపత్కాలమునందును, విపత్కాలమునందును యే నాయిక తన్ను పాణిగ్రహణము జేసిన తన భర్తను విడువకనుండునో యది స్వీయ యనంబడును. ఈ స్వీయనాయికలో జ్ఞాతయౌవన, అజ్ఞాతయౌవన, నవోఢ, విస్రబ్ధనవోఢ, అతివిస్రబ్ధనవోఢ యని భేదములు గలవు మఱియు నిందు ముగ్ధ, మధ్య, ప్రగల్భ అని మూఁడు ప్రసిద్ధ భేదములు గలవు.

ముగ్ధ :—నూతన యౌవనముతో గూడుకొని యున్నదిగాను, గాఢమైన లజ్జగలదిగాను, రతులయం దస్వాధీనురాలుగాను, నాయకుఁడు కృతాపరాధియై యుండినను ఏమియుఁ జెప్పక రోదనము జేయుచుండునదియును, రతివ్యాపారములయందు ప్రియాప్రియములను దెలుపక యుండునది ముగ్ధ యనఁబడును.

మధ్య :—సమాన లజ్జకలదిగాను, వృద్ధిఁజెందిన యౌవనము గలదిగాను, సురత యోగ్యత గలదియై నాయకుని యపేక్షించునది మధ్య యనఁబడును.

ప్రగల్భ :—సంపూర్ణ యౌవనముతో కూడుకొనినదియును, అనంగవ్యాపార పారంగతురాలుగను, సమరత్యాది చతురత గలదిగాను నుండునది.

పై జెప్పిన మధ్య, ప్రగల్భ నాయికలకు, మానమను కోపవ్యాపారము చేతను జ్యేష్ఠకనిష్టత్వముచేతను అవస్థలు గలుగుచున్నవి. వాని నీ ప్రక్కపుటయందు జూడుఁడు.

| మధ్య. | ప్రగల్భ. |
| --- | --- |
| 1 మధ్యధీర | 1 ప్రగల్భధీర |
| 2 మధ్యాధీర | 2 ప్రగల్భాధీర |
| 3 మధ్యధీరాధీర | 3 ప్రగల్భధీరాధీర |

**వీనికి వివరములు.**

మధ్యధీర :—అపరాధియైన ప్రియునియందు సాభిప్రాయమైన వక్రోక్తులను జెప్పునది.

మధ్యాధీర :—అపరాధియైన ప్రియుని క్రూరమైన పలుకులచే ఖేదపఱచునది.

మధ్యధీరాధీర :—అపరాధియగు నాయకుని కన్నీరొలుకునటుల వక్రోక్తులాడునది.

ప్రగల్భధీర :—అపరాధియగు నాయకుని కపటముతో విషయాంతరమునందుపేక్ష చేయునది.

ప్రగల్భాధీర :—అపరాధియగు నాయకుని బెదరించి తాడనము చేయునది.

ప్రగల్భధీరాధీర :—పైఁ జెప్పిన ధీరాధీర వ్యాపారములన్నియును చేయునది.

పైని జెప్పఁబడిన 6 నాయికలు జ్యేష్ఠ కనిష్ఠావస్థలచే 12 విధములగుచున్నారు. ఒక నాయకునికి ఇద్దరు నాయిక లుండినచో అందు నాయకుని ప్రియమును విశేషముగ గలిగియుండునది జ్యేష్ఠయనియును, నాయకుని ప్రియమును తక్కువగ గలిగియుండునది కనిష్ఠయనియును చెప్పఁబడుచున్నది.

పరకీయలక్షణము :—పరపురుషునియందు తనకుఁ గల ఇచ్ఛావ్యాపారములను మఱుగుపఱచుటయందు దత్తమానసియై యుండునది పరకీయయనఁబడును. ఇది పరకీయకన్య, పరకీయపరోఢ యని రెండు విధములు.

సామాన్య:—కలాప్రాగల్భ్యత గలిగినదిగాను, జనులయందు ధనాశచే యనురాగము గలదిగాను, షండులైనను, భగ్నకాములైనను, పాషండులైనను, బాలురైనను, వృద్ధులైనను వారియెడల తానను రాగము గలదానివలె నటించునది.

ఇదివఱకు 16 విధములైన నాయికలు చెప్పఁబడెను. ఎట్లనిన,

| | |
|---|---|
| ముగ్ధాభేదము | 1 |
| మధ్యాభేదము | 6 |
| ప్రగల్భాభేదము | 6 |
| పరకీయకన్య | 1 |
| పరకీయపరోఢ | 1 |
| సామాన్య | 1 |
| అంతుమొత్తము | 16 |

ఈ 16 భేదములును అష్టవిధ అవస్థాభేదములవలన 128 భేదము లగుచున్నవి. మఱియు నీ 128 భేదములు ఉత్తమమధ్యమాధమ భేదములచే 128×3= 384 భేదములగును. మఱియు దివ్యాదివ్య దివ్యాదివ్య భేదములచే 384×3= 1152 భేదము లగుచున్నవి. గ్రంథ విస్తృత భీతిచే వాని నిచ్చట వ్రాయ లేదు. అష్టవిధ నాయికావస్థలను మాత్ర మీ దిగువ వ్రాసియున్నాను.

## అష్టవిధ నాయికలు

స్వాధీనపతిక, వాసకసజ్జిక, అభిసారిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక అని యవస్థాన్తరముల యందు నాయికలు ఎనిమిది భేదములుగలవా రగుచున్నారు.

స్వాధీనపతిక :—అనుదినమును ప్రియునిచే లాలింపఁబడినదై యుండునది స్వాధీనపతిక.

వాసకసజ్జిక :—ప్రియుఁడు వచ్చెడి సమయమునందు తా నలంకరించు కొని కేళీగృహము నలంకరించి ప్రియుని రాకను ఎదురుజూచునది.

విరహోత్కంఠిత :—ప్రియుఁడు తా నొనర్చిన యపరాధ మొక్కంఠి తయు లేనివాఁడయ్యు నెద్దియో కార్యంబులఁజిక్కి తన గృహంబునకేఁగ నాలస్యమగుచుండఁగా ఆ కాలవిళంబము నోర్వలేక ఖిన్నురాలై తమి నాపు కొనజాలక నాథు నెదురు జూచుచుండునది.

విప్రలబ్ధ :—సంకేత స్థానమునందు నాథునిచే వంచింపఁబడి స్మర పీడితురాలై యుండునది.

ఖండిత :—సంకేతకాలము నతిక్రమించి అన్యోన్యసంభోగచిహ్నము లతో ప్రాతఃకాలమునందు తన కెదురుగ వచ్చెడి నాయకుని గలది ఖండిత యనఁబడును.

కలహాంతరిత :—సఖులయెదుట నాయిక పాదములమీఁద బడి వేడుకొన్న నాయకుని నిరాకరించి వెనుక పరితాపఁబడునది.

ప్రోషితభర్తృక :—నాథుఁడు దేశాంతరగతుఁడై యుండునపుడు ఖేదపడునది ప్రోషితభర్తృక యనఁబడును.

అభిసారిక :—స్మరపీడితురాలై తనచోటికి నాయకుని రప్పించునది గాని, నాయకుని గృహమునకు తానేగునదిగాని యభిసారిక యనఁబడును.

ఉపనాయికలు —దూతి, దాసి, సఖి, చేటి, ధాత్రేయి, ప్రాతి వేశిని, లింగిని, శిల్పిని మొదలగువారు.



## నాయక లక్షణములు.

పతి, ఉపపతి, వైశికుఁడు అని నాయకులు మూఁడు తెఱంగులుగ నున్నారు.

పతి :—అగ్నిసాక్షిగ నాయకిని పాణిగ్రహణముఁ జేసినవాఁడు పతి యగుచున్నాఁడు.

ఉపపతి :—పరకీయకు రహస్యనాయకుఁడుగ నుండువాఁడు ఉపపతి.

వైశికుఁడు :—వేశ్యాగృహములకేగి తద్భోగార్థమై ధనవ్యయ మును చేయువాఁడు వైశికుఁడు.

### శృంగారనాయక లక్షణము.

శృంగారనాయకులు, అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు అని నలుతెఱంగులుగ నున్నారు.

అనుకూలుఁడు :—పరాంగనా సోదరుఁడై తన భార్యయందే ప్రియముగలవాఁడు అనుకూలుఁడు.

దక్షిణుఁడు :—తన్నాశ్రయించిన అన్ని నాయికలయందును సమ మైన ప్రీతిగలవాఁడు దక్షిణుఁడు.

ధృష్టుఁడు :—ఎవఁడు నాయికచే నెఱుఁగఁబడిన కృతాపరాధియై యుండియు భయములేక నుండునో, తొలఁగించినను తొలఁగఁడో, మఱల

నా నాయికనే సమస్కారా న్యుపాయములచే ననుసరించునో వాఁడు దృష్టుఁడు.

శఠుఁడు :—తనయందు ప్రేమగలిగియుండు నాయికకు గాఢముగ అహితముఁ జేయువాఁడు శఠుఁడు.

ఉపనాయక లక్షణము.

పీఠమర్ధనుఁడు, విటుఁడు, చేటుఁడు, విదూషకుఁ డని యుపనాయకులు నలుపురు.

పీఠమర్ధనుఁడు :—నాయకునికి కొంచెము తక్కువైనవాఁడు.

విటుఁడు :—మారశాస్త్ర ప్రవీణుఁడై యుండువాఁడు.

చేటుఁడు :—నాయికా నాయకులకు పరస్పరము సంధి జేయువాఁడు.

విదూషకుఁడు :—హాస్యము చేయువాఁడు.



# రసములు.

నవరసములలోను శృంగారరసము మాత్రమే భావశాస్త్రములో విశేషముగ గనఁబడుచున్నది. అందుచేత శృంగారరసమును సంబంధించిన విషయములను మాత్ర మిచ్చట వ్రాసెదను. శృంగారము విప్రలంబ శృంగారమనియును, సంభోగ శృంగారమనియును రెండు విధములు. విప్రలంబము అయోగము, విరహము, మానము, ప్రవాసము, శాపము అని 5 విధములు. అందు మానము ప్రణయమానము, ఈర్ష్యమానము అని రెండు విధములు. అందు ఈర్ష్యమానము శ్రవణ ఈర్ష్య, దృష్టీర్ష్య, అనుమాన ఈర్ష్య అని మూఁడు విధములు. సంభోగశృంగారము సంక్షిప్తమనియు, సంపన్నమనియు రెండు విధములు. వీని లక్షణములను గ్రంథాంతరములయందు జూడుఁడు.



# పదములకు భావములు

అవతారిక :—ఒకనాయిక తనకు గోపాలుఁడు చెప్పిన నమ్మికమాటలను నిజమని యెంచి యుండునపు డతఁ డొకదినము ప్రాతఃకాలమునందు అన్యా సంభోగచిహ్నములతో తన కెదుటవచ్చినది జూచి చాల దుఃఖాక్రాంతురాలై యీర్ష్యతో నాయకునిఁ జూచి చెప్పుచున్నది.

(1) రా. ఎదుకులకాంభోజి – తా. ఆది.

పల్లవి. నామేను నీమే ననుచు బలికిన నీమాట నిజమాయెర. (నా)

అను. ఏమోయనియుంటి నెఱుంగక యిన్నాళ్లు కోమలాంగ రాజగోపాల ననుజూచి (నా)

చ. నిన్నవతో గిల్లియున్న యురముఁజూడ నన్ను వేదనసేయుచున్నదిర !
నిన్నరేయి నీకు నిదుర లేకున్న నా కన్ను లెఱ్ఱనై కలగెనుగనుకను (నా)

2. కోమలాంగిని నీవు కోరినప్పటినుండి వేమరు నామది భ్రమజెందినదిర ;
నీమోవినొక్కుల నీఁటుజూచినయంత ఏమొకో నామోవియడ రెనిగనుకను

3. అన్యకాంతల నీ వనుభవించితి వేమో నన్నేలినదొర ! నాతమిదీరెర ;
మన్నించి గోపాల మళ్లినీవిటురాగ–చిన్నబోయి సిగ్గుజెందితిగనుకను(నా)

లక్షణము :—నాయిక స్వీయ – మధ్యధీర, నాయకుఁడు పతి, దృష్టుఁడు ఈర్ష్యమాన విప్రలంబ శృంగారము, గురుమానము, సంచారీ భావము అమర్షము.

"నామేను నీమే ననుచు బల్కిన నీమాట నిజమాయెర"

1. నామేను నీమేనని బలికిన నీమాట నిజమాయెను.
2. నాప్రాణమే నీప్రాణమని బలికిన నీమాట నిజమాయెను.
3. నామనస్సే నీమనస్సని బలికిన నీమాట నిజమాయెను.
4. నాకన్నులే నీకన్నులన్న నీమాట నిజమాయెను.
5. నాదుఃఖము నీదుఃఖమని బలికిన నీమాట నిజమాయెను.
6. నాసుఖమే నీసుఖమనిన నీమాట నిజమాయెను.
7. నాలాభమే నీలాభమనిన నీమాట నిజమాయెను.
8. నానష్టమే నీనష్టమనిన నీమాట నిజమాయెను.
9. నాశోకమే నీశోకమనిన నీమాట నిజమాయెను.
10. నామోహమే నీమోహమనిన నీమాట నిజమాయెను.
11. నాయధరమే నీయధరమని బలికిన నీమాట నిజమాయెను.
12. నాకపోలమే నీకపోలమని బలికినది నిజమాయెర.
13. నాయురమే నీయురమనిన నీమాట నిజమాయెర.
14. నామేను నీమేనని నీవు దీపమును సాక్షిబెట్టినది నిజమాయెర.
15. నామేను నీమేనని నీవు త్రికరణశుద్ధిగ జెప్పినది నిజమాయెర.
16. నామేను నీమేనని నీవు అన్నమును సాక్షిబెట్టినది నిజమాయెర.
17. నామేను నీమేనని నీవు క్షీరమును సాక్షిబెట్టినది నిజమాయెర.
18. నామేను నీమేనని నీవు తాంబూలమును సాక్షిబెట్టినది నిజమాయెర.
19. నామేను నీమేనని నీవు పంచభూతములను సాక్షిబెట్టిన నీమాట నిజమాయెర,

20. నా మేను నీ మేనని నీవు నాకరమున ముద్దిడి బలికినమాట నిజమాయెర.

21. నా మేను నీ మేనని నీవు చేత చెయియిడి బలికిన నీమాట నిజమాయెర.

22. నా మేను నీ మేనని నీవు నాకొంగును దాటిజెప్పిన మాట నిజమాయెర.

23. నా మేను నీ మేనని నీవు పున్నమచంద్రుని సాక్షిబెట్టి జెప్పినమాట నిజమాయెర.

అన్యాపదేశముగ నీకష్టములే నాకష్టములు. నీ సుఖములే నా సుఖములని నాయిక దెలుపుచున్నది. ఎట్లనిన నాయికా నాయకుల కిపుడు కన్ను లెఱ్ఱగనున్నది; గనుక నామేనే నీమేననునది సన్నివేశమునకు సరిపోవుచున్నది. అయినను కారణభేదము లున్నవి. అవి యెవ్వియనిన నాయకునికి నిద్రాభంగమువలన కన్ను లెఱ్ఱనాయెను. నాయికకు తన్ను వంచించిన నాయకునిమీఁద గలిగియుండు కోపావేశమువలన కన్ను లెఱ్ఱనాయెను. ఇటులనే ఈ దిగువ వ్రాయఁబడియుండు భావము లెఱుఁగదగినయవి.

24. నీఫాలమునందుఁ గల కాటికపూతలు నాఫాలమున నున్నదిరా (ఇచట నాయకుని ఫాలము కాటికపూతలఁగల కన్నులచే నలుపుగఁ జేయఁబడెను. నాయికకు తన మనమున జనించియున్న కోపావేశముచే ఫాలము నల్లనాయెను) ఇటులనే యన్ని యూహ్యంబులు.

25. నీ కపోలమునందు గల నఖరేఖలు జూడ నా కపోలము వేదన జెందుచున్నది; కనుక నా మేను నీ మేననిన నీమాట నిజమాయెను.

26. నిన్న రేయి నీవు నిదుర మేల్కొని కన్నులను జూడఁగ నాకన్ను లెఱ్ఱనై కలగెనుర; అందుచేత నా మేను నీ మేననుచు బలికిన నీమాట నిజమాయెనుర.

27. నీ యధరమునందుఁ గల దంతక్షతములను జూడ నా యధర మదరుచున్నదిర; అందుచేత నా మేను నీ మేననుచు బలికిన నీమాట నిజమాయెనుర.

28. నీ యురమునందుఁగల నఖరేఖలఁ జూడ నా యురము వేదన జెందుచున్నదిరా; కనుక నా మేను నీ మేననుచు బలికిన నీమాట నిజమాయెనుర.

29. నీ శరీరమునందుఁగల గాజుల రేఖలను జూడ నా మేను మండుచున్నదిర; కనుక నా మేను నీ మేననుచు బలికిన నీమాట నిజమాయెనుర.

30. నీవు నిన్న రేయి నిదుర లేక యుండినందువలన నాకిపుడు నిదుర గలుగుచున్నదిర; కనుక నా మేను నీ మేననుచు బలికిన నీమాట నిజమాయెనుర.

(ఇచ్చట నాయికకు గలుగు నిద్ర క్రోధాధికమువల్ల జనించిన శోకనిద్ర యగును.)

31. నీ శరీరమునందుఁగల పసుపు పూతలే నా మేను నీ మేననుచు బలికిన నీమాటలను నిజముగ జేయుచున్నదిరా.

32. నీ యురమునందుఁగల చందనలేశములే నా మేను నీ మేననుచు బలికిన నీమాటను నిజముగఁ జేయుచున్నదిరా.

33. నీ యురముననుండు గంధలేపనములోనున్న ముత్యాల హారపు గుఱుతులు నా మేను నీ మేనని బలికిన నీమాటలను నిజముగఁ జేయుచున్నదిరా,

34. నీ వీపుననున్న కంకణరేఖలు నామేను నీమేననుచు బలికిన నీమాటను నిజముగఁ జేయుచున్నదిరా.

35. నిన్నా వీధిలో నాచెలికత్తె జూచినది విన్నపుడే నేను తృప్తిజెందితినిరా.

36. నీవా వనిత పేరెత్తినపుడే నామనస్సు భ్రమజెందెనురా.

37. నీవాకాంత నేలితివిగదా? నే నిక సంతసిల్లితిని.

38. నీవా దోసకారి నేలితివిగదా? నే నిక సంతసిల్లితిని.

39. నీవా మగువతోసల్లాపముజేసితివిగదా? నామనస్సు పరమానందమునుబొందెను.

(ఇటులనే అంగనాది వ్యాపారాంతరములు వర్ణింపఁదగినయవి.)

40. హా! నాథ! ఎటులైనను నీ మనస్సు తృప్తిజెందినది గదా? అదియే నాకు చాలును.

41. నన్నేలిన దొర! నా తాపము దీరెనురా.

42. నా యపరాధములను మన్నింతువుగాక.

43. ఇంత అపరాధినైన నన్ను మఱల జూడవచ్చితివే; నా భాగ్యమే భాగ్యము.

44. నే జేసిన యపరాధమును తలఁచిజూడఁగ నామోము చిన్నబోవుచున్నదిరా.

45. నిన్నుజూడ నాకు సిగ్గుగ నున్నది.

46. ఇకనైన నన్ను మన్నింతువుగాక.

పై జెప్పిన భావములను సందర్భానుసారముగ, ఖేద, రోష, సంతాప, అన్యాపదేశోక్తులచే నభినయించవలయును.

అనుపల్లవి.

"యేమోయని యుంటి నెఱుఁగక ఇన్నాళ్లు, కోమలాంగ!
రాజగోపాల! నిన్నుజూడ"

"యేమో యనియుంటి యెఱుఁగక యిన్నాళ్లు"

1. నా తెలివి తక్కువచే నిన్ను నమ్మియుంటి.

2. నీ కపటముల నెఱుఁగక నీమాటల నిజమని నమ్మితి.

3. నీవు నా యనుకూలుఁడని తలఁచితిని.

4. నీవు నా మనస్సును నొప్పింపవని యెంచితివి.

5. నిన్ను పరాంగనా సోదరుఁడని తలఁచితిని.

6. నీవు నన్నెడబాయవని నమ్మితిని.

7. నీవే నాభాగ్యమని గర్వించితిని.

8. నీవే నాప్రాణమని తలఁచి మోసబోతిని.

9. నీ ప్రీతికి పాత్రురాలై యుండు నాకు సరి యెవరును లేరని గర్వించితిని.

10. నిన్ను నాథునిగ గల్గియుండు నాభాగ్యమే భాగ్యమని మమత జెంది యుంటిని.

11 నాకంటిచూపు నన్ను మోసపుచ్చదని తలంచితిని.

12. నా వ్రేలు నాకంటిని పొడవదని తలంచితిని.

13. నా చెయి నన్ను శిరచ్ఛేదము చేయదని తలంచితిని.

14. నా భాగ్యము నేనివ్వకున్న యొరుల కబ్బునా ? యని గర్వించితిని.

"కోమలాంగా రాజగోపాల నిన్నుజూడ"

1. మనోహరమైన శరీరముగల హే గోపాల ! నిన్ను జూచునపుడు నీ నిజములు తెలియుచున్నది.

2. ఇంత సుకుమార శరీరములో ఇట్టి కఠిన చిత్త మెట్లు గలిగెనో ?

3. నీ ముఖము పున్నమచంద్రుని బోలియున్నది కనుకనే నీవు కామినీ ముఖకమల వైరివైతివి.

4. హే చక్కనిచూపులుగలవాఁడ ! మనోహరమైన వేణునాదమును బుట్టించు నట్టి నీ యధరము నీ యబద్ధపుమాటల కెట్లు సహాయము జేసెనో ?

5. నిత్యమైన వేదస్వరములను వేణువునందు దిట్టపఱచి పలికించు నీచేతులు దుర్వారమైన పరాంగనాలింగనమున కెట్లు సమ్మతించెనో ?

6. సర్వరక్షకత్వము గలిగిన నీవు నాయెడ ద్రోహచింతను వహింపతగునే !

7. గోవులను రక్షించువాఁడవు కోమలి మనోరథములకు శత్రువేమో ?

8. వంచకులను శిక్షించే నీదు చక్రాయుధము నన్నువంచించిన నిన్ను శిక్షించదేమో ?

9. పరభామినీ కాముకులైన దుర్యోధనాదుల గుండె లదరజేసిన నీ పాంచజన్యము నీ ద్రోహచింతకు భీతిని గలుగఁజేయదేమో ?

10. శత్రువుల శిరములను ఖండించెడి నీదు ఖడ్గము నీయందుగల శఠత్వమును ఖండించదేమో ?

11. ధర్మసంరక్షణార్థమై నీచేత వెలుగుచున్న గదాయుధమునకు నీవంచన భయపడదేమో ?

12. ద్రోహులను పరాభవించిన నీదు శార్ఙ్గము నీయందుఁగల ద్రోహచింతను పోగొట్టదేమో ?

13. సర్వలోకముల నేలిన నీవు నన్ను మోసబుచ్చితివే ?

14. నీ వెటులైనను జన్మదారభ్య దొంగవేగదా ?

**ఇచ్చట కృష్ణలీలలను యథోచితముగ వర్ణించి, తరువాత "నీ టక్కులన్ని నిజమాయెర అని ముగించవలయును. చరణములను వరుసగ పాడి విశేష విన్యాసము లేమియు చేయక పదార్థములమీద యభినయించి పల్లవిని యెత్తి ముగించవలయును.**



(2) రా. ఆనందభైరవి - తా. ఆది.

అవతారిక:—నాయిక తన్ను విడనాడియున్న నాయకుఁడు మరల వచ్చుచున్నాఁడను విషయమును దూతీద్వారా తెలిసికొని వియోగశంకామానసయై నాయకుని రమ్మని ప్రార్థించుచున్నది.

ప. మంచిదినము నేఁడే మహారాజుగ రమ్మనవే!

అ. పొంచిజూచు టేలే? పొలతిరో! గోపాలుని;

చ. సుదతిరో! అలవాని సొమ్మేగదా యీమేను?
వదరితే యేమౌనో? వసుచు తనమందురే;
సదయుని విడనాడుట సహజమౌనటే?
కొదవవద్దనవే; ఆకొమ్మ పేరెత్తనే;

2. ఇందువచ్చుటకు భేదమెంచనేల? ఈవేళ;
ఇందువదనవాని యిల్లుగాదటవే?
అందున్నసుందరివలె యుండగ త్తె నేగాను?
ఎందుకే యీవట్టిదూఱు? ఎవరు దండించెరే?

3. మునుపటివలె నాతో ముచ్చటలాడవచ్చితే
మనసీయక నేను మాట్లాడితినా?
వనజాక్షి! గోపాలుఁడో వాఁడే యూచెలిని గూడ
తనకు ఇష్టమైతే తగదని చెప్పుదునా!

లక్షణము:—నాయికస్వీయ, ఉత్తమ నాయకుఁడు, శఠుఁడు, ఈర్ష్యమాన, విప్రలంబ శృంగారము.

"మంచిదినము నేఁడే మహారాజుగ రమ్మనవే"

1. మంచిదినము నేడే మహారాజుగ రమ్మనవే.
2. మంచిదినము నేడే సొగసుగ రమ్మనవే.
3. మంచిదినము నేడే ఇప్పుడే రమ్మనవే.
4. మంచిదినము నేడే ఆటంకములేక రమ్మనవే.
5. మంచిగినము నేడే బహిరంగముగ రమ్మనవే.
6. మంచిదినము నేడే సర్వాలంకృతుఁడై రమ్మనవే.
7. మంచిదినము నేడే భయములేక రమ్మనవే.
8. మంచిదినము నేడే చింతించక రమ్మనవే.

9. మంచిదినము నేఁడే సంకోచములేక రమ్మనవే.

10. మంచిదినము నేఁడే ఇదే మంచిసమయము రమ్మనవే.

11. నే నతని రాక నెదురుజూచుచున్నానని రమ్మనవే.

12. నే నతని రాక నెదురుజూచుచు సర్వసిద్ధమై యున్నానని రమ్మనవే.

13. నే నతనికై మంచిగంధములను నూరియున్నాను.

14. మంచిపుష్పములను సేకరించి యున్నాను.

15. అతని కిష్టమైన అలంకారములను సిద్ధపఱచియున్నాను.

16. షడ్రసోపేతమైన భోజ్యములను సిద్ధపఱచియున్నాను.

17. నా కేళీగృహము నలంకరించి యున్నాను.

18. నే నలంకరించుకొని (ఇచ్చట నాయిక యలంకరించుకొనే పద్ధతులను విన్యాసము చేయవలయును.) యతని రాఁకను యెదురుజూచుచున్నాను.

19. అతనికై హారతి సిద్ధపఱచియున్నాను.

20. అతనికై నేను తలవాఁకిట కాఁచియున్నాను.

21. వాని సొంతయింటికి వచ్చుట కేమి యభ్యంతరము?

22. ఈమేను వాని సొమ్ముగాదటే? రమ్మనవే?

23. వానియందు నాకు గల ప్రేమకు యొక్కింతయు మార్పులేదు; రమ్మనవే.

24. అతఁడు నా కెల్లప్పుడును ప్రియుఁడే; రమ్మనవే.

25. అతఁడు జేసిన కార్యములకు నే చింతపడలేదు; రమ్మనవే.

26. అతఁడు నాకేమియు నపరాధము చేయలేదు; రమ్మనవే.

27. వాని నేను తాడనములు చేయను.

28. వాని నేను కోపించను.

29. వాని నేను దుర్భాషలాడను.

30. వాని నేను అలక్ష్యముచేయను.

31. నాకు స్వాతంత్ర్యములేదను ధర్మమును నే నెఱిఁగియున్నాను.

32. నే నతని తిరస్కరించి యేదియు చేయను.

33. నాకు వానికన్న హెచ్చైన భాగ్యముగలదా?

34. వాఁడే నా మానము; రమ్మనవే.

35. వాఁడే నా ప్రాణము; రమ్మనవే.

36. వాఁడే నా మంగళకరము; రమ్మనవే.

37. వాఁడే యీ యింటికి సర్వాధికారి.

38. వాఁడే నా ప్రాణాధికారి.

39. వాని యెడబాసి నాకీ గృహము లేటికే?

40. వాని యెడబాసి నాకీ యాభరణము లేటికే?

41. వాని యెడబాసి నాకీ యలంకారము లేటికే?

42. వాని యెడబాసి నాకీ కేళీగృహము లేటికే?

43. ఈ పున్నమచంద్రుఁడు నాకు తాపమును గలిగించుచున్నాఁడని చెప్పి శీఘ్రముగ రమ్మనవే.

44. ఈ మందమారుతము నన్ను వేదన జేయుచున్నదని పలికి రమ్మనవే.

45. ఈ భ్రమరములు నన్ను బెదరించుచున్నవి యని తెలిపి శీఘ్రముగ రమ్మనవే.

46. అతఁడులేక నా కేళీగృహము బాడువారి యున్నదని తెలిపి రమ్మనవే.

47. వానికి శుశ్రూషచేయని దినము నాకొక యుగముగ తోఁచుచున్నదని తెలిపి రమ్మనవే.

48. వాని ప్రియనాయిక పేరు నే నెత్తనని తెలిపి రమ్మనవే.

49. వాని ప్రియనాయికను ఇఁకను నే మనస్సులోను స్మరించనని చెప్పి రమ్మనవే.

50. నే నేమైన యాపరాధము చేసియుండినను మన్నించి రమ్మనవే.

51. నేను వాని ప్రియనాయికను బోలిన అందగత్తె గాకపోయినను నే నతని ధర్మపత్ని గాదా? నన్ను విడనాడ తగునా? ఈ ధర్మము ననుసరించియైనను రమ్మనవే.

52. వాని ప్రియనాయికను దూషించినది నేను కాదని చెప్పి రమ్మనవే.

53. వాఁడు జగడమాడిపోయిన యిల్లు ఇదికాదని చెప్పి రమ్మనవే.

54. మాకుఁ గలిగియుండిన పూర్వస్నేహమును తలఁచియైనను రమ్మనవే.

55. ఇరుగుపొరుగుల నున్నవారు నవ్వరా? ఏటికే యిట్టి తెగువ? రమ్మనవే.

"పొంచి జూచుటేలే? పొలతిరో! గోపాలునికి"

1. వాని సొంతగృహమునకు వచ్చుటకు పొంచిజూచుటేలే?
2. తన భార్యయున్నచోటికి తాను వచ్చుటకు సిగ్గేలనే? రమ్మనవే.
3. ఎవరు జూచితే నేమి? భయమేమి?
4. ఎవరు పరిహాసించెదరే? రమ్మనవే?
5. అలిగిగూడుట యందరికి సహజముగదవే? గోపాలుని రమ్మనవే.

**"గోపాలునికి" అనునపుడు గోపాలహస్తములును, దశావతార హస్తములును ఉపయుక్తమైన భావములగును.**



## తిల్లానా

### రా. మోహనము — తా. చతురశ్ర ఏకతాళము.

| | | | |
|---|---|---|---|
| ప. | ధ ధపపగారీసా రిగ — రీసా | ‖ ధా ; ; — ధాసారీగాపా | ‖ |
| | తా. ధరి దానినాంధిరి — దాని | ‖ నా ; ! — త ధరిధాని | ‖ |
| అ. | గాగాగా — పా ; పాపాపా | ‖ ధాసాధా — సా ; సాసాసా | ‖ |
| | ఉ దన — ధీం ; త దన | ‖ త ధిం . — ధీం ; త నన | ‖ |
| | ధా సా రీ — గా ; సాగారీ | ‖ సారిగరిసాధా ;;; | ‖ |
| | సాధిర్ ధిర్ — తోం ; త దర్ | ‖ తాధరిధి రి నా ;;; | ‖ |

ధాగారీ - గా ; గారిసా || సారిగరిసా - సాధాపాధా ||
ధి ధిం - ధీం ; తధర || నాధిరిధాని - తొంధిరిదాన ||
ధి త్తళాంగు తధిజేణతోం ; - తళ || , ంగుతధిజేణతోం; - తధిజేణతోం; ||



## మంగళము.

### రా. సౌరాష్ట్రము - తా. ఆది.

ప. నీనామ రూపములకు - నిత్యజయ మంగళం (నీ)
అ. పవమాన సుతుఁడు బట్టు - పాదారవిందములకు (నీ)
చ. పంకజాక్షి నెలకొన్న - యంక యుగమునకు (నీ)
నలినారి గేరు చిఱు - నవ్వుగల మోమునకు (నీ)
నవముక్తాహారములు - నటియించే యురమునకు (నీ)
ప్రహ్లాద నారదాది - భక్తులు పొగడుచుండే (నీ)
రాజీవనయన త్యాగ - రాజ వినుతమైన (నీ)

శ్రీ సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్సమేత
శ్రీరామచంద్ర స్వామినే నమః

గానభాస్కరము సమాప్తము.



# అనుబంధము A - 1.

## శ్రుతిస్వర జ్ఞానోపాయన వీణ.

## రాగవిబోధము మొదటివివేకము 18 మొదలు 22 వరకు గల ఆర్యలలోఁ జూడుఁడు.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| సంఖ్య. | శ్రుతినామములు. | జాతినామములు. | స్వరనామములు. | స. 240 చొప్పున వేపన సంఖ్యలు. | 36 అంగుళపు తంత్రిలో స్వరములకు స్థానములు | | షరాలు. |
| 4 | ఛందోవతి | మధ్య | శుద్ధ-స. | 240 | 36-1 | | 5, 6, 7-వ సంఖ్యలలో గల సంఖ్యలు మనవి శ్రు. లు. ఫిరాలుగానివి. ఈ సంఖ్యలు నవి యొనర్చు. 7-వ వరుసలో తంత్రియొక్క పొడవు ఒకటి 36 అంగుళములు గాను, అంగుళము 1-కి 20 వంతున తొక్కఁ మొత్తములు గ్రాహ్యములబడినవి. |
| 5 | దయావతి | కరుణ | ,, | ,, | $34-5\frac{4}{7}$ | | |
| 6 | రంజని | మధ్య | ,, | ,, | 33-15 | | |
| 7 | రతిక | మృదు | శుద్ధ-రి. | $266\frac{2}{3}$ | 32-8 | 9/11 | |
| 8 | రౌద్రి | దీప్త | చతు-రి. | 270 | 32-0 | 8/9 | |
| 9 | క్రోధీ | ఆయత | పంచశ్రు-రి. శుద్ధ-గ. | $284\frac{4}{9}$ | $30-7\frac{1}{2}$ | 27/32 | |
| 10 | వజ్రిక | దీప్త | ష-రి. సా-గ. | 288 | 30-0 | 5/6 | |
| 11 | ప్రసారిణి | ఆయత | అంతర-గ. | 310 | 28-16 | 4/5 | |
| 12 | ప్రీతి | మృదు | మృదు-మ. | $316\frac{4}{81}$ | $27-6\frac{3}{4}$ | 243/30 | |
| 13 | మార్జని | మధ్య | శు-మ. ష-గ. | 320 | 27-0 | 243/40 | |
| 14 | క్షితి | మృదు | ,, | 324 | $26-13\frac{1}{3}$ | | |
| 15 | రక్త | మధ్య | షట్ఛ్రుతి-మ. | $337\frac{1}{2}$ | 25-12 | 32/45 | |
| 16 | సందీపిని | ఆయత | మృదు-ప. | $355\frac{5}{9}$ | 24-6 | 27/49 | |
| 17 | ఆలాపిని | కరుణ | శు-ప. | 360 | 24-0 | 2/3 | |
| 18 | మదంతి | కరుణ | | | $22-17\frac{1}{7}$ | | |
| 19 | రోహిణి | ఆయత | | | 22-10 | | |
| 20 | రమ్య | మధ్య | శుద్ధ-ధ. | 400 | 21-12 | 3/5 | |
| 21 | ఉగ్ర | దీప్త | చ-ధ. | 405 | $21-6\frac{2}{3}$ | 16/27 | |
| 22 | క్షోభిణి | మధ్య | శు-ని. పంచశ్రుతి-ధ. | $426\frac{2}{3}$ | 20-5 | 9/16 | |
| 1 | తీవ్రా | దీప్తా | ష-ధ. కై-ని. | 432 | 20-0 | 5/9 | |
| 2 | కుముద్వతి | ఆయత | కా-ని. | 450 | 19-4 | 8/15 | |
| 3 | మంద | మృదు | మృదు-స. | $494\frac{2}{7}$ | $18-4\frac{1}{2}$ | 81/160 | |
| 4 | ఛందోవతి | మధ్య | శుద్ధ-స. | 280 | 18-0 | 1/2 | |

అనుబంధము — B.

# అకారాది రాగపట్టిక

| రాగముల పేళ్లు. | మేళ సంఖ్య | ఆరోహణము. | అవరోహణము. |
|---|---|---|---|
| అగ్నిగోపము | 20 | సగమపనిస | సనిపమగరిస |
| అఠాణా | 29 | సరిమపనిస | సనిధాపమగారిస |
| అమృతతరంగిణి | 19 | సరిగమధనిస | సధనిధపమగరిస |
| అమృతపంచమము | 48 | సరిగమధనిస | సనిధమగసరిస |
| అమృతవర్షిణి | 39 | సరిగమపధనిపస | సనిపధమగరిస |
| అమృతవాహిని | 20 | సరిమపధనిస | సనిధమగరిస |
| అసావేరి | 8 | సరిమపధస | సనిసపధమపరిగరిస |
| ఆదిపంచమము | 48 | సరిపధనిస | సనిధనిపమగరిస |
| ఆదిభైరవి | 20 | సరిమపనిస | సనిపమరిగమరిస |
| ఆంధాళి | 28 | సగమధనిధస | సనిధపమగరిస |
| ఆందోళిక | 28 | సరిమపనిస | సనిధమరిస |
| ఆనందభైరవి | 20 | సగరిగమపధపనిస | సనిధపమగరిస |
| ఆనందభోగి | 42 | సరిగమపనిధని | ధపమగరిసనిస |
| ఆభీరు | 47 | పధనిసమగమ | పమగసనిధనిస |
| ఆభేరి | 20 | సగమపనిస | సనిధపమగరిస |
| ఆభోగి | 22 | సరిగమధస | సధమగరిస |
| ఆమ్రదేశి | 62 | సగమపధనిధస | సధనిపమగస |
| ఆమ్రపంచమము | 48 | సరిగమధనిస | సనిధమగస |
| ఆరభి | 29 | సరిమపధస | సనిధపమగరిస |
| ఆర్ద్రదేశిక | 15 | సరిగమపధనిస | సధపమగరిస |
| ఆలాపి | 37 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| ఆహిరి | 8 | సరిసగమపధనిస | సనిధాపమగరిస |
| ఆహిరినాట | 29 | సమగమపధనిస | సనిపధనిపగమగస |

| రాగముల పేళ్లు. | మే-సంఖ్య. | ఆరోహణము. | అవరోహణము. |
|---|---|---|---|
| ఆహారి | 20 | సరిగమపధస | సనిధపమగరిస |
| ఇందుగీర్వాణి | 42 | సరిగమపస | సనిపధనిపమగరిస |
| ఇందుఘంటారవము | 20 | సగమపధపని | ధాపమగరిసని |
| ఇందుధన్యాసి | 46 | సగమధనిస | సనిధపధమగరిస |
| ఇందుధవళి | 21 | సరిగమసమపధనిస | సనిధపమగస |
| ఇందుభోగి | 46 | సగరిగపమధస | సనిధనిపమగరిస |
| ఇందుమతి | 51 | సగమధనిస | సనిధపమగస |
| ఇందుశీతల | 4 | సరిగమపధనిధస | సధనిపమగరిస |
| ఇందుసారంగనాట | 8 | సరిగమపమధనిస | సధపమగరిస |
| ఈశగిరి | 69 | సరిగమపధని | ధపమగరిసనిస |
| ఈశగౌళ | 7 | సమగమపధనిస | సధపధమగరిస |
| ఈశమనోహరి | 28 | సరిగమపధనిస | సనిధపమరిమగరిస |
| ఉత్తరి | 64 | సగమపధనిస | సనిధమగస |
| ఉదయరవిచంద్రిక | 20 | సగమపనిస | సనిపమగస |
| ఉమాభరణము | 28 | సరిగమపధనిస | సనిపమరిగమరిస |
| కంకణాలంకారి | 52 | సగపధని | సనిధపమగరిస |
| కటకప్రియ | 1 | సగరిగమపధపనిస | సధపధమగరిస |
| కనకకుసుమావళి | 61 | సరిగమపధస | సధపమగరిస |
| కనకగిరి | 66 | సరిగమపసనిస | సనిధనిపమగస |
| కనకగీర్వాణి | 67 | సరిమపమధనిస | సధపమరిస |
| కనకజ్యోతిష్మతి | 72 | సమపధనిస | సనిధపమస |
| కనకదీపరము | 45 | సగమపధపని | ధపమగరిసనిస |
| కనకనాసామణి | 62 | సరిగరిమపధనిస | సనిధపమగరిస |
| కనకనిర్మద | 67 | సరిగమపమధస | సనిధపమగరిస |
| కనకభవాని | 66 | సమగమపధనిస | సనిపమరిస |
| కనకభూషావళి | 58 | సగమపధనిస | సనిపమగరిస |
| కనకరసాళి | 51 | సరిగమధనిస | సధపమగరిస |
| కనకవసంతము | 20 | సగమపనిధస | సనిధపమగరిస |
| కనకశ్రీకంఠి | 60 | సరిగమపస | సనిధనిపమరిస |
| కనకసింహారవము | 61 | సగమపనిస | సనిధపమరిస |

| రాగముల పేళ్లు. | మే-సంఖ్య. | ఆరోహణము. | అవరోహణము. |
|---|---|---|---|
| కనకాంగి (మేళ) | 1 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| కనకాంబరి | 1 | సరిగమపధనిధస | సనిధపమగరిగరిస |
| కన్నడ | 29 | సమగమధనిస | సధాపమగమరిస |
| కన్నడకురంజి | 49 | సగరిగమపధనిస | సధపమరిస |
| కన్నడగౌళ | 22 | సరిగమపనిస | సనిధపమగస |
| కన్నడదర్బారు | 33 | సరిగమపధపస | సనిధపమరిస |
| కన్నడదీపరము | 44 | సరిగమధనిస | సనిధపధమగరిస |
| కన్నడపంచమము | 26 | సరిగమపనిస | సనిధనిపమగస |
| కన్నడబంగాళ | 15 | సరిమగమధపధస | సధపమగరిస |
| కన్నడభోగి | 50 | సరిగమపనిధనిస | సనిధమగరిగస |
| కన్నడమల్లారు | 20 | సగమపధస | సనిధమగస |
| కన్నడమారువ | 53 | సగమపధనిస | సనిధపమగస |
| కన్నడవేళావళి | 48 | పనిసరిగమప | పమగరిసనిధనిప |
| కన్నడసౌరాష్ట్రము | 10 | సరిమగమధపధనిస | సనిధపమగస |
| కమలనారాయణి | 55 | సరిమపధనిస | సనిధపమగమరిస |
| కమలవసంత | 37 | సరిసమపధనిస | సనిధపమగరిస |
| కమలాతరంగిణి | 20 | సరిగమపధనిస | సనిధపమరిస |
| కమలాభరణము | 45 | సరిగమపనిధస | సనిధపనిధమగరిస |
| కమలామనోహరి | 27 | సగమపనిస | సనిధపమగస |
| కరుణాకరి | 63 | సమపధనిధస | సనిధపమస |
| కర్నాటక ఆంధాళి | 14 | సగరిమపధనిస | సధపమగరిస |
| కర్నాటక తరంగిణి | 61 | సరిగమపనిస | సపమగరిస |
| కర్నాటక దేవగాంధారి | 21 | నిసగమపా | ధాపమగరిసని |
| కర్నాటక సురటి | 4 | సరిగమపధస | సనిధపమరిస |
| కలకంఠి | 13 | సరిగమధనిస | సనిధపగరిస |
| కలకడ | 13 | సరిమపధనిస | సనిధపమరిస |
| కల్గడ | 13 | సరిగపధనిస | సనిధపమగరిస |
| కలవసంతము | 43 | సగమపధనిస | సనిపమగస |
| కలహంస | 31 | సరిమపధనిధస | సనిధపమరిస |
| కలాభరణి | 52 | సగరిగమపనిధని | ధపమగరిసనిస |

| రాగముల పేళ్లు. | మే-సంఖ్య. | ఆరోహణము. | అవరోహణము. |
|---|---|---|---|
| కన్నడ | 13 | సరిగపధనిస | సనిధపమగరిస |
| కల్యాణకేసరి | 13 | సరిగపధస | సధపమగరిస |
| కల్యాణవసంతము | 21 | సగమధనిస | సనిధపమగరిస |
| కల్యాణి | 65 | సరిగమపధనిస | సనిధపమపగారీస |
| కల్లోలబంగాళ | 31 | సరిమపనిధస | సనిపధమగరిస |
| కల్లోలము | 18 | సపధనిస | సనిధనిపమగస |
| కల్లోలసావేరి | 25 | సరిమపధస | సనిధపమగరిస |
| కల్హారు | 22 | సరిమగమపధపస | సధపమరిస |
| కళానిధి | 22 | సరిగమసపమధనిస | సనిధపమగరిస |
| కళామూర్తి | 44 | నిసగరిగమపస | సనిధపమగరిస |
| కళావతి | 16 | సరిమపధస | సధపమగసరిస |
| కళాసావేరి | 8 | సరిగపనిస | సనిధపమగరిస |
| కళాస్వరూపి | 22 | సరిగామపధనిపస | సనిపమగారిస |
| కాంతామణి (మే) | 61 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| కాంభోజి | 28 | సరిగమపధస | సనిధపమగరిస |
| కానడ | 29 | గరిసరిగమపమధనిస | సనిసధపమపగమరిస |
| కాననప్రియ | 63 | సరిగమపమధనిస | సధనిపమగరిస |
| కాపి | 22 | సరిగామరిపమపధనిస | సనిధపమగరిస |
| కాపినారాయణి | 28 | సరిమపధనిస | సనిధపమగారిస |
| కామరూపి | 52 | సగమపమధనిపస | సనిధపమగరిస |
| కామవర్ధని (మే) | 52 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| కాలనిర్ణిక | 63 | సగమపనిధస | సపమగరిస |
| కాళింది | 22 | సమగామపస | సధపమరిస |
| కిరణావళి | 21 | సరిగమపధనిస | సధపమగరిస |
| కిరణి | 51 | సరిగమపనిధనిస | సనిధమగరిస |
| కీరవాణి (మే) | 21 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| కీర్తిప్రియ | 1 | సరిమపధస | సనిధపమగరిస |
| కీర్తివిజయ | 61 | సరిగమపనిధస | సనిధపమగరిస |
| కుంతల | 16 | సరిగమపధనిస | సధనిపమగమరిస |
| కుంతలకాంభోజి | 13 | సగమపధనిధస | సనిధపమగస. |

# అకారాది రాగపట్టిక

| రాగముల పేళ్లు. | మే-సంఖ్య. | ఆరోహణము. | అవరోహణము. |
|---|---|---|---|
| కుంతలకుసుమావళి | 65 | సరిగమపమపస | సనిధనిపమగస |
| కుంతలగీర్వాణి | 68 | సరిగమపధనిస | సధమపమగరిస |
| కుంతలఘంటాణము | 70 | సరిగమపమపస | సనిపమరిస |
| కుంతలదీపరము | 48 | సమపధనిస | సనిధనిపమగస |
| కుంతలధన్యాసి | 47 | సరిగమపమధనిస | సనిధనిపమగరిస |
| కుంతలభవాని | 67 | సరిగమపమపస | సనిధనిపమరిస |
| కుంతలభోగి | 41 | సరిగమధపనిస | సనిధనిమగరిస |
| కుంతలము | 61 | సరిగమపధనిధస | సనిధపమగమరిస |
| కుంతలరంజని | 68 | సరిమపనిధనిస | సనిధపమగరిస |
| కుంతలరాగము | 61 | సరిగమపధనిధస | సధపమగమరిస |
| కుంతలవరాళి | 28 | సమపధనిధస | సనిధపమస |
| కుంతలశ్రీకంఠి | 65 | సగమపధనిస | సనిపమగరిస |
| కుంతలశ్రీరంజని | 68 | సరిమపనిధనిస | సనిధపమగరిస |
| కుంతలసింహారము | 69 | సరిమపమధనిస | సధపమరిస |
| కుంతలస్వరావళి | 46 | సగమపధనిస | సనిధనిపమగరిస |
| కుటుంబిని | 64 | సగమధపధనిస | సనిపమగరిస |
| కుముదప్రియ | 22 | సరిగామపస | సనిధనిపమగస |
| కుముదాభరణము | 38 | సరిగమపనిధస | సధనిపమగరిస |
| కురంజి | 29 | సనిసరిగమపధ | ధపమగరిసనిస |
| కులపవిత్రి | 28 | సగమధపనిస | సనిపమరీస |
| కులభూషణి | 21 | సరిగమపనిస | సధపమగరిస |
| కువలయానంది | 16 | సరిగమనిధనిపనిస | సనిధమగస |
| కుసుమకల్లోలము | 32 | సపమరిగమపస | సధపమగమరిస |
| కుసుమచంద్రిక | 32 | సరిమగమపధనిస | సధపమరిస |
| కుసుమజ్యోతిష్మతి | 69 | సరిమగమపధనిస | సధనిధపమరిస |
| కుసుమప్రియ | 27 | సరిగమపధనిస | సనిపమగారిస |
| కుసుమభవాని | 68 | సరిమపధస | సనిధమపమరిస |
| కుసుమభోగి | 50 | సరిగమధనిస | సధనిధమగరిగస |
| కుసుమభ్రమరి | 34 | సరిగమపమధనిస | సనిధపమరిస |
| కుసుమసారంగ | 56 | సరిమపధనిస | సనిధపమగరిస |

| రాగముల పేళ్లు. | మే-సంఖ్య. | ఆరోహణము. | అవరోహణము. |
|---|---|---|---|
| కుసుమాంగి | 16 | సరిసపధనిస | సనిధపమగరిస |
| కుసుమావళి | 71 | సగమపధస | సనిధపమగమరిస |
| కేతకప్రియ | 64 | సగమపనిస | సనిధపమగరిస |
| కేతారనాట | 27 | సరిగమపనిపస | సనిపమగరిస |
| కేదార | 29 | సమగమపనిస | ససిపమగమధమగరిస |
| కేదారగౌళ | 28 | సరిమపనిస | సనిధపమగరిస |
| కేసరి | 25 | సరిగమపమధపధస | సధనిధపమగరిస |
| కైకవశి | 60 | సరిగమపధనిస | సనిపమగరిస |
| కైవశి | 58 | సరిగమపధనిస | సనిపమగరిస |
| కోకిలగంధర్వము | 31 | సగమధస | సధపమగరిగస |
| కోకిలగీర్వాణి | 43 | సరిగమపధస | సనిమగరిస |
| కోకిలదీపకము | 23 | సగమధనిస | సనిధమగరిస |
| కోకిలదీపరము | 43 | సరిగమనిధస | సనిధమగరిస |
| కోకిలధ్వని | 28 | సరిగమధనిధస | సనిధనిపమగరిస |
| కోకిలపంచమము | 39 | పధనిసరిగరి | సనిధపధనిస |
| కోకిలప్రతాపము | 26 | సగమపమధనిస | సనిపమగస |
| కోకిలప్రియ (మే) | 11 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| కోకిలభాషిణి | 29 | సరిగమపధనిస | సనిపమగమరిస |
| కోకిలవరాళి | 20 | సరిగమపధనిధస | సనిధనిపమరిగరిస |
| కోకిలస్వరావళి | 41 | సరిగమధనిస | సధమగరిస |
| కోకిలానంది | 56 | సగమధనిస | సనిధపమగస |
| కోకిలారవము | 11 | సరిగరిమపధనిస | సనిధపమగరిస |
| కోమలి | 63 | సరిగమపనిధమపస | సధనిమగరిస |
| కోలాహలము | 29 | సపమగమపధనిస | సనిధపమగరిస |
| కోసల (మే) | 71 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| కౌమారి | 11 | సరిగమపధస | సనిధపమగరిస |
| కౌమోద | 65 | సరిగమనిస | సనిమగరిస |
| కౌస్తుభప్రియ | 71 | సరిగమపధనిస | సధపమగమరిస |
| ఖడ్గప్రియ | 1 | సగరిగమపధపనిస | సధపధమగరిస |
| ఖమాసు | 28 | సమగమపధనిస | రిసనిధపమగస |

| రాగముల పేళ్లు. | మే-సంఖ్య. | ఆరోహణము. | అవరోహణము. |
|---|---|---|---|
| ఖరహరప్రియ (మే) | 22 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| ఖిలావళి | 22 | సరిగామపస | సనిపమగరిస |
| గంగాతరంగిణి | 33 | సరిగమపస | సనిధపమగమరిస |
| గంధర్వకన్నడ | 31 | సరిగపధస | సనిధపమగమరిస |
| గంధర్వనారాయణి | 24 | సమపధనిస | సనిధనిపమస |
| గంధర్వమనోహారి | 26 | సరిమపస | సనిధమగరిస |
| గంధర్వము | 42 | మపధనిసరిగ | రిసనిపమపధనిస |
| గంభీరనాట | 36 | సగమపనిస | సనిపమగస |
| గంభీరిణి | 23 | సరిగమపధనిధస | సనిధపమగరిస |
| గగనభూపాలము | 21 | సమగమపధనిస | సనిధమగరిస |
| గగనమోహిని | 64 | సగపధనిస | సనిపమగస |
| గగనరంజని | 66 | సగమపస | సధనిపమగరిస |
| గగనసరసీరుహాము | 53 | సగరిగమపధని | ధపమగరిసనిస |
| గణితవినోదిని | 16. | సగమపనిస | సనిధపమగరిస |
| గమకప్రియ | 51 | సరిగమపనిధస | సధపమగరిస |
| గమకసామంతము | 45 | సగమపనిస | సనిధపమగరిస |
| గమనక్రియ | 53 | సరిమపధనిస | సనిధపమగమరిస |
| గమనశ్రమ (మే) | 53 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| గరిగద్య | 56 | నిసగమపధని | ధపమగరిసనిస |
| గరుడధ్వని | 29 | సరిగమపధనిస | సధపగరిస |
| గర్జము | 17 | సగమధనిస | సనిధపమగరిస |
| గవాంబోధి (మే) | 43 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| గాంగేయభూషణి (మే) | 33 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| గాంభీర్యఘోషణి | 52 | సగరిపమధనిస | సనిధపమగరిగస |
| గానమూర్తి (మే) | 3 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| గానవారిధి | 35 | సమరిగమపధనిస | సధనిపమరిస |
| గానసామవరాళి | 3 | సరిగరిమపధపనీస | సనిధమాగగరిస |
| గాయకప్రియ | 13 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| గిరికర్ణిక | 3 | సరిమపధనిస | సనిధపమగరిస |
| గిరికుంతలి | 72 | సరిగమపమగమపస | సనిధనిపమగస |
| గీతనటని | 53 | సరిమగమపధనిస | సనిధపమరిస |

| రాగముల పేళ్లు. | మే-సంఖ్య. | ఆరోహణము. | అవరోహణము. |
|---|---|---|---|
| గీతప్రియ | 13 | సరిగమపధనిస | సధపమగరిస |
| గీతమూర్తి | 33 | సరిగమపధనిస | సనిధపమగస |
| గీర్వాణి | 43 | సరిగరిమగమధనిపనిధస | సనిధపమగరిస |
| గుండక్రియ | 15 | సరిమపనిస | సనిపధపమగరిస |
| గుజ్జరి | 15 | సరిగమపధనిస | సధనిపమగరిస |
| గుమ్మకాంభోజి | 15 | సరిగపధనిధస | సనిధపమగరిస |
| గుసుగద్య | 56 | నిసగమపధని | ధపమగరిసనిస |
| గురుప్రియ | 64 | సరిగమధనిస | సనిధమగరిస |
| గుహప్రియ | 16 | సరిగామసపమధనిస | సధనిపమగసరిస |
| గోత్రారి | 63 | సరిమపధస | సనిధపమగరిస |
| గోపతి | 42 | సరిగమపధని | పమరిగరిస |
| గోపికావసంతము | 20 | సమపనిధనిధస | సనిధపమగస |
| గౌడమల్లారు | 29 | సరిమపధస | సనిధమగరిస |
| గౌరి | 15 | సరిమపనిస | సనిధపమగరిస |
| గౌరీక్రియ | 60 | సగమపధనిస | సనిధనిపమగస |
| గౌరీగాంధారి | 2 | సమరిగమపధనిధస | సనిధపమగరిస |
| గౌరీనిషాదము | 71 | సగమపనిధస | సనిధనిపమగస |
| గౌరీబంగాళ | 9 | ధసరిమపధని | ధపమగరిసనిధప |
| గౌరీమనోహరి (మే) | 23 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| గౌరీపంతు | 51 | సరిమపనిస | సనిధపమధమగరిస |
| గౌరీమారువ | 50 | సరిమపధస | సనిధపమగరిగస |
| గౌరీసీమంతి | 70 | సరిగమపధనిస | సనిపమగస |
| గౌళ | 15 | సరిగమరిమపనిస | సనిపమగమరిస |
| గౌళచంద్రిక | 7 | సరిమపధస | సనిధపగరిస |
| గౌళపంచమము | 24 | సరిమపనిస | సనిపమగరిస |
| గౌళమాళవి | 6 | సరిగమపధనిపనిస | సపధనిపమగరిస |
| గౌళిపంతు | 15 | సరిగరిమపధపనిస | సనిధపమగరిస |
| ఘంటా | 8 | సరిగమపధని | ధపమగరిసనిధాపనీస |
| ఘంటాణము | 57 | సరిగమపనిస | సనిధమగరిస |
| ఘంటార్ణవము | 2 | సగమనిధపధనిస | సనిధపమగరిస |

| రాగముల పేళ్లు. | మే-సంఖ్య. | ఆరోహణము. | అవరోహణము. |
|---|---|---|---|
| ఘననాయకి | 63 | సగమనిధపధనిస | సనిధపమగరిస |
| ఘనశ్యామల | 5 | సగమపధస | సనిధపమగరిస |
| ఘనసింధు | 15 | సమగమపధనిధస | సనిధపమగస |
| ఘోశీమణి | 16 | సమగమపధనిధస | సనిధపమగమరిస |
| చంద్రకౌశికము | 65 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| చంద్రకిరణి | 16 | సగమపమధనిస | సనిధనిపమగమరిస |
| చంద్రగాంధారము | 8 | సరిగమస | సధమగరిస |
| చంద్రచూడత్రిపుర | 18 | సగమపనిధనిస | సనిపమరిస |
| చంద్రజ్యోతి | 41 | సరిగమపధస | సధపమగరిస |
| చంద్రరేఖ | 58 | సరిగమపధస | సనిధమగరిస |
| చంద్రికాగౌళ | 8 | సరిగమపధస | సధపమరిస |
| చక్రవాకము (మే) | 16 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| చతురంగిణి | 66 | సమగమపధనిస | సనిధనిపగమగరిస |
| చలనాట (మే) | 36 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| చాపఘంటారవము | 20 | సగమపని | ధపమగరిసని |
| చాముండి | 63 | సగరిమపనిధస | సధనిపమగరిస |
| చారుకేశి (మే) | 26 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| చింతామణి | 7 | సరిగమగసమపధనిస | సధనిపమగరిస |
| చింతారమణి | 52 | సగమపధని | ధాపమపగారిసనిస |
| చిత్తరంజని | 19 | సరిగరిగమపధ | నిధపమరిగరిస |
| చిత్రాంబరి (మే) | 66 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| చిత్స్వరూపి | 26 | సరిగమపధనిస | సనిధపమగమరిస |
| చిదానంది | 36 | సరిగమపధనిస | సనిధనిపమగమరిస |
| చిన్మయి | 16 | సరిగామపమధనిస | సనిధనిపమగారిస |
| చూర్ణికావినోదిని | 66 | సరిగమపధనిస | సనిధనిపమగరిస |
| ఛత్రధరి | 63 | సగమపమరిపస | సనిధపమగరిస |
| ఛాయాగౌరి | 7 | సరిమగమపనిధనిస | సనిధపమగమరిస |
| ఛాయాగౌళ | 3 | సరిగరిమపధనిస | సధనిపమగరిస |
| ఛాయాగౌళ | 15 | సరిమగమపనిస | సనిధపమగరిస |
| ఛాయాతరంగిణి | 28 | సరిమగమపనిస | సనిధపమగరిస |

| రాగముల పేళ్లు. | మే-సంఖ్య. | ఆరోహణము. | అవరోహణము. |
|---|---|---|---|
| ఛాయానాట | 34 | సరిగమపమపస | సనిధనిపమరిస |
| ఛాయానారాయణి | 6 | సపమపధనిస | సనిధనిపమగరిస |
| ఛాయాబౌళి | 8 | సరిగామసపమధనిస | సనిపధమగారిస |
| ఛాయామారువ | 49 | సగరిగమధనిధస | సనిధమగరిస |
| ఛాయామాళవి | 7 | సగరిగమపధనిధస | సనిధపమగమరిస |
| ఛాయాసింధు | 19 | సరిమపధస | సధపమగరిస |
| ఛాయాసైంధవి | 11 | సరిగమపధపనిస | సధనిపమగరిస |
| ఝంఝూటి | 28 | ధసరిగమపధని | ధపమగరిసనిధపధస |
| జగన్మోహనము | 38 | సరిమపధసనిస | సనిధపమగరిస |
| జగన్మోహిని | 15 | సగమపనిస | సనిపమగారిస |
| జటాధరి | 52 | సగరిమపధనిస | సనిధపగరిస |
| జనరంజని | 29 | సరిగమపధపనిస | సధపమరిస |
| జనసమ్మోదిని | 28 | సరిగపధనిస | సనిధపగరిస |
| జనాకర్షణి | 16 | సరిగపమధనిస | సనిధపమగధమగరిస |
| జయంతశ్రీ | 20 | సగమధనిస | సనిధమపమగస |
| జయంతసేన | 22 | సగమపధస | సనిధపమగస |
| జయనారాయణి | 22 | సరిగామపధస | సనిధపమగరిస |
| జయవేళావళి | 43 | సరిగమధపధనిస | సనిధమగరిస |
| జయశ్రీ | 21 | సరిగమపధనిధస | సనిధపమగరిస |
| జయసావేరి | 5 | సమరిగమపధని | ధపమగరిసనిస |
| జయసింధు | 2 | సరిగమపస | సపనిధమగరిస |
| జయాభరణి | 27 | సగమపమరిగమపస | సనిధాపమరిస |
| జలజవాసిని | 27 | సగమపనిస | సనిధపమరిస |
| జలార్ణవము (మే) | 38 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| జంగలా | 20 | సరిగమపధనిధపస | సనిధపమగరిస |
| జంగలాభైరవి | 32 | సగమపమధస | సనిధపమగమరిస |
| జినావళి | 39 | సగరిగమపధనిధస | సనిధపమగరిస |
| జీవంతిని | 48 | సమపధనిస | సనిపమగస |
| జీవరంజని | 2 | సరిగమపధనిస | సధపమగరిస |
| జీవరత్నభూషణి | 38 | సరిగమపధనిధస | సనిధపమగరిస |

| రాగముల పేళ్లు. | మే-సంఖ్య. | ఆరోహణము. | అవరోహణము. |
|---|---|---|---|
| జుజాహూళి | 13 | సగమపధనిస | సధనిధపమగస |
| జులావు | 29 | పనిసరిగమప | పమగరిసనిప |
| జ్యోతిస్మతి | 68 | సరిగమపస | సనిధమపమరిగస |
| జ్యోతిస్వరూపిణి (మే) | 68 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| జౌడగాంధారి | 68 | సరిగమపధస | సనిధపమగరిస |
| ఝంకారధ్వని (మే) | 19 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| ఝంకారభ్రమరి | 19 | సరిగమపధనిధస | సనిధపమగరిస |
| ఝంకారి | 19 | సరిగమపధస | సధపమగరిస |
| ఝణాకారి | 63 | సరిగమపనిధస | సధపమరిగరిస |
| ఝాలవరాళి (మే) | 39 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| ఝూనావళి | 39 | సరిగమపధనిధస | సనిధపమగరిస |
| టక్క | 9 | సగమపమధనిస | సనిధపమగరిస |
| తనుకీర్తి | 6 | సరిమపనిస | సనిధనిపమగమరిస |
| తపస్విని | 52 | సగమపనిస | సనిధపమగస |
| తపోల్లాసిని | 1 | సమరిగమపధనిస | సధపగరిస |
| తరంగిణి | 26 | సరిమగరిమపధనిధస | సనిధపమగరిస |
| తరుణీప్రియ | 64 | సగరిగమపనిధస | సనిపమరిస |
| త్ర్యంబకప్రియ | 3 | సమరిగమపస | సనిసధపమగరిస |
| తానరంజని | 63 | సరిగమపధపస | సధపసనిసధపమగరిస |
| తానరూపి (మే) | 6 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| తిలకప్రకాశిని | 6 | సరిగమపధనిస | సనిపమగరిస |
| త్రిమూర్తి | 56 | సరిగమధనిస | సనిధమగరిస |
| తీవ్రవాహిని | 46 | సరిగమపధపనిస | సనిధపమగరిగమరిస |
| తోడి (శుద్ధ) | 8 | సరిగమధనిస | సనిధమగరిస |
| దర్బారు | 22 | సరిమపధనిస | సనిధపమగారిస |
| దినకరకాంతి | 27 | సమగమపస | సనిధపమగస |
| దివ్యగాంధారము | 18 | సమరిపధనిస | సధనిపమగసరిస |
| దివ్యగాంధారి | 20 | సగమపధనిస | సనిపమగస |
| దివ్యతరంగిణి | 17 | సరిగమపస | సనిధపమగరిస |
| దివ్యపంచమము | 27 | సరిగమపనిస | సనిధపమగరిస |

| రాగముల పేళ్లు. | మే-సంఖ్య. | ఆరోహణము. | అవరోహణము. |
|---|---|---|---|
| దివ్యమణి (మే) | 48 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| దివ్యాంబరి | 27 | సపమపధనిస | సపనిధమగరిస |
| దివ్యాభరణము | 21 | సరిగమపనిస | సనిపమగరిస |
| దీపకము | 51 | సగమపధపస | సనిధనిపమగరిస |
| దీపరము | 10 | సరిగమపధనిస | సనిధనిపమగరిస |
| దుందుభిప్రియ | 48 | సరిగమపధనిస | సనిపమగరిస |
| దేవకుసుమావళి | 60 | సమగమపస | సనిపమగరిస |
| దేవక్రియ | 20 | సరిగమనిధని | పధమగరిసని |
| దేవగాంధారి | 29 | సరిగరిమపధనిస | సనిధపమగరిస |
| దేవగిరి | 49 | సరిమపధస | సనిధపమగరిగస |
| దేవగీర్వాణి | 66 | సగరిమపస | సపమగరిస |
| దేవమనోహరి | 22 | సరిమపధనిస | సనిధనిపమరిస |
| దేవమాళవి | 56 | సరిగమపధని | నిధపమగరిసని |
| దేవముఖారి | 13 | సరిమపధనిస | సనిధపమరిస |
| దేవరంజని | 22 | సగరిమపధనిస | సధపమగారిస |
| దేవరంజి | 15 | సమపధపనిస | సనిధపమస |
| దేవసాలగము | 25 | సగపధనిస | సపనిధపమగరిస |
| దేవాభరణము. | 49 | సగరిగమధనిస | సనిధనిపమగరిస |
| దేవామృతవర్షిణి | 22 | సరిగమనిధనిస | సనిధపమగరిస |
| దేవామృతవాహిని | 64 | సగమపనిధనిస | సనిధనిపమగరిస |
| దేశముఖారి | 25 | సరిగమపధనిధస | సధనిధపమగరిస |
| దేశావళి | 55 | సరిగమధనిధస | సనిధమగరిస |
| దేశాక్షి | 28 | సరిగపధస | సనిధపమగరిస |
| దేశికబంగాళ | 8 | సరిగపమధనిస | సధపమగరిస |
| దేశికరుద్రి | 9 | సమరిగమపనిస | సనిపధమగరిస |
| దేశ్యఆంధాళి | 9 | సరిగమపనిధస | సధపమగరిస |
| దేశ్యగానవారిధి | 60 | సరిగమపధనిపస | సనిసపమగరిస |
| దేశ్యగౌరి | 5 | సరిగమధపనిస | సధనిపమగరిస |
| దేశ్యగౌళ | 15 | సరిసపధనిస | సనిధపసరిస |
| దేశ్యనాటకురంజి | 55 | సరిగమపధపనిస | సపనిధపమగరిస |
| దేశ్యనారాయణి | 6 | సరిగమపనిస | సనిధనిపమరిస |

| రాగముల పేళ్లు. | మే-సంఖ్య. | ఆరోహణము. | అవరోహణము. |
|---|---|---|---|
| దేశ్యగౌడ | 19 | సగమపస | సనిధపమగరిస |
| దేశ్యమారువ | 54 | సరిగమనిస | సనిపమగరిస |
| దేశ్యముఖారి | 25 | సరిగమపధనిధస | సనిధనిపమగరిస |
| దేశ్యరేగుప్తి | 15 | సరిగరిమపధనిస | సధనిధపమగరిస |
| దేశ్యసురటి | 6 | సమరిగమపధని | పమగరిసనిస |
| దోషరహితాస్వరూపిణి | 63 | పమపధనిసగ | రిసనిధపమప |
| ద్విజావన్తి లేక జుజావన్తి | 28 | సరిమగమపధనిస | సనిధపమగరిగస |
| ద్వైతచింతామణి | 28 | సగమధనిస | సనిపధమగరిస |
| ద్వైతపరిపూర్ణి | 28 | సరిగమపధని | పమరిమగసనిస |
| ద్వైతానంది | 28 | సరిగమపస | సనిధనిపమరిస |
| ధనపాలిని | 16 | సరిగమపస | సనిధపమధమగరి |
| ధన్యాసి | 8 | సగమపనిస | సనిధపమగరిస |
| ధర్మవతి (మే) | 59 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| ధర్మిణి | 49 | సరిగమధనిస | సనిధమగరిస |
| ధవళసరసీరుహము | 44 | సరిగమధపనిస | సనిధమగరిస |
| ధవళహంసి | 57 | సరిమపధస | సనిధపమగరిస |
| ధవళాంగి | 49 | సమగమపధనిధస | సనిధపమగరిస |
| ధవళాంబరి (మే) | 49 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| ధాతుప్రియ | 69 | సరిపమపధస | సనిధపమగమరిస |
| ధాతుమనోహరి | 22 | సపమపధనిస | సనిపమగరిస |
| ధా[illegible] | 69 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| ధీరకుంతలి | 58 | సమపధనిస | సనిధపమగరిస |
| ధీరమతి | 29 | సరిగమపమనిధస | సనిపమగరిస |
| ధీరశంకరాభరణము (మే) | 29 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| ధీరసావేరి | 69 | సరిగమపధనిస | సధపమగరిస |
| ధీరస్వరూపి | 49 | సరిగమపధనిస | సధనిధపమగస |
| ధీరాకారి | 59 | సరిగమపధనిస | సధనిపమగరిస |
| ధూర్వాంకి | 29 | సరిమపధస | సనిపధపమగరిస |
| ధేనుక (మే) | 9 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| ధైర్యముఖి | 9 | సరిగమపధస | సనిపమపరిగరిస |

| రాగముల పేళ్లు. | మే-సంఖ్య. | ఆరోహణము. | అవరోహణము. |
|---|---|---|---|
| ధౌతపంచమము | 69 | సరిగమపనిపస | సనిధపమరిగమరిస |
| ధౌమ్యరాగము | 59 | సరిగమపధస | సనిధపమగరిస |
| నఖప్రకాశిని | 52 | సరిగమపధనిధపస | సధనిపమగరిస |
| నటనదీపరము | 41 | సరిగమధనిస | సనిమగరిగస |
| నటనప్రియ | 22 | సగరిగమధనిస | సనిపమగరిస |
| నటనవేళావళి | 39 | సరిమపధనిస | సనిపమగరిస |
| నటనారాయణి | 28 | సరిగమధనిధస | సనిధపమగమరిస |
| నటాభరణము | 10 | సరిగమపధపనిస | సనిధపమగమరిస |
| నఠభైరవి (మే) | 20 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| నభోమణి | 40 | సగరిగమపస | సనిధపమగరిస |
| నభోమార్గిణి | 16 | సగమపధనిస | సధపమగరిస |
| నయనభాషిణి | 52 | సరిగమపనిధనిస | సనిధనిపగమగస |
| నయనరంజని | 27 | సరిగమపధపనిస | సనిపనిధమగరిస |
| నలినకాంతి | 27 | సగరిమపనిస | సనిపమగరిస |
| నలినకుసుమావళి | 69 | సరిగమపస | సనిధనిపమరిస |
| నలినభ్రమరి | [illegible] | సరిమపధనిస | సనిధనిపమరిస |
| నలినసుఖి | 34 | సమగమపధనిధస | సనిధపమగమరిస |
| నలినహాంసి | 35 | సరిగమపనిధస | సనిధపమరిస |
| నవనీతపంచమము | 24 | సగమధపధనిస | సనిపమరిస |
| నవనీతము (మే) | 40 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| నవరత్నభూషణి | 63 | సరిగమపధస | సనిధపమగరిస |
| నవరత్నవిలాసము | 20 | సరిగమపధపస | సధపమగామరిస |
| నవరసఆంధాళి | 49 | సగరిగమపధస | సధపమగరిగస |
| నవరసకన్నడ | 28 | సగమపస | సనిధమగరిస |
| నవరసకళానిధి | 28 | సరిమపసనిస | సనిధపమగరిస |
| నవరసకుంతలి | 40 | సమపధనిస | సనిధపధమగరిస |
| నవరసగాంధారి | 50 | సరిగమపమధనిస | సనిధమగరిస |
| నవరసచంద్రిక | 13 | సరిగపమధస | సధపమగరిస |
| నవరసబంగాళ | 47 | సరిగమధపధనిస | సనిధమగస |
| నవరోజు | 29 | పధనిసరిగమప | పమగరిసనిధప |
| నాగకుంతలి | 66 | సరిగమపనిస | సనిపధనిపమగరిస |

